

చేపలవేట

ఫోటో : ఎ. వి. నరసింగరావు (కర్నూలు)

ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రకటనలు
మీ వ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి

## సంక్రాంతి సంచిక

బాపుగారి ముఖచిత్రంతో, జమున, వాసంతి, రమణారెడ్డిగారి వ్యాసాలు, కథలు, రంగథామ్‌గారు గారు వ్రాసిన ఏడుకొండలు సీరియల్ కథతో ఆకర్షణీయంగా వెలువడిన 12—1—62 తేదీ వారపత్రిక చూచేసరికి నా సంతోషానికి పట్ట పగ్గాలు లేవు.

గూడా వెంకటసుబ్రహ్మణ్యం (కాకినాడ)

* * *

## ముఖచిత్రం

ముచ్చటైన ముఖచిత్రం వేసి మమ్ము మురిపించిన చిత్రకారుడు శ్రీ బాపుగార్కి మా హృదయపూర్వకాభివందనములు.

ఎ. వి. రంగయ్య,
శ్రీమతి అన్నపూర్ణ (గుంతకల్లు)

* * *

సంక్రాంతి సంచిక చాల బావుంది. కాని తీపి తింటు కారం నంచుకున్నట్లు మంచి వ్యాసా లున్నప్పుడు మధ్యన సినీమా నటీ నటుల వ్యాసాలు ప్రచురించడం ఏమంత బావుండ దంలా ! కేవలం వాళ్లను గురించి వారే పొగడు కోవడం, సొంత 'డబ్బా' వాయించడం తప్ప. ఆ వ్యాసాలవల్ల పాఠకులకు ఏమాత్రం ప్రయోజనం కనపడలా ?

తలుపూర్ రాము, మోహన్ (అనంతపురం)

* * *

## సంక్రాంతి వ్యాసం

ముఖ్యంగా పండగకు వచ్చే ప్రత్యేక సంచికలో పన్నాకర్షించేది ఆమంచర్ల గోపాలరావుగారి పండగ గూర్చిన వ్యాసం. సంక్రాంతి పండుగ మూడు దినములు మాత్రమే జరుపబడునన్న విషయం సర్వ విదితమే. ఐతే కొన్ని ప్రాంతాల్లో 'ముక్కనుమ' నాలుగో రోజు సంక్రాంతి సంబరాలుసాగుతాయని ఒక క్రొత్త విషయం ఆమంచర్లగారి వ్యాసం ద్వారా తెలిసింది.

ముఖ్యంగా వేసవికాలం భీకరమ్మైన దైనా భోగి మంటలో మనవారు వేసవి కాలానికి స్వాగత వచనాలు పలుకుతారన్న వాక్యం చాలా బాగుంది.

మొత్తంపై ఆమంచర్లవారు ప్రతిసారి వలెనే క్రొత్త విషయాల తెల్పుతూ పండగ వ్యాసం చాలా బాగా వ్రాశారు.

ఎస్. చక్రపాణి (హైదరాబాదు.)

* * *

## కాల్పనిక జగత్తు

"కాల్పనిక జగత్తులో వరకట్నాలు" అను వ్యాసం చాలా బాగున్నది. నిజముగా తల్లిదండ్రులు అనుభవించే బాధలు వ్రాసినారు.

ఎస్. ఎన్. రావు (పెనరవిల్లి)

* * *

## సినిమా వ్యాసాలు

నా అభిమాన తారజమునగారి నా ఫొన్ మైల్ చదివి ఆనందించా. అలానే సావిత్రిగణేశ్‌గార్ని గురించి వాసంతి

# ఉత్తరాలు

బి. ఎ. గారు వ్రాసిన రచన చాలా బాగుంది. సావిత్రిగారు చాలా సౌమ్యులు ఉత్తమ నటి కూడా. ఆమెను గురించి యిలాంటి రచన జరిపినందుకు వారికి (వాసంతి బి. ఎ గారికి) నా అభినందనలు.

సంక్రాంతి సంచిక చాలా బావుంది. ముఖ్యంగా రంగథామ్‌గారి ఏడుకొండలవాడు కథ నడక చాలా పుష్టిగా ప్రారంభించారు. అదేవిధంగా కథను రక్తి అనురక్తి కలిపి మానవ స్వభావాలను బాగా వివరించ గలరని భావిస్తాను.

మారేమళ్ల రామమోహన్‌రావు.

* * *

కుమారి వాసంతి బి. ఏ. శతచిత్ర సుందరి శ్రీమతి సావిత్రి గణేశన్ గురించి వ్రాసిన వ్యాసము చదివి నిజముగా సావిత్రి భారత్‌మాత పేరు నిలుపుటకు జన్మించిన సాధ్వీమణియా ! అని అనుకున్నాను. ఆమె అనూయలేని విశాల భావము గల భారత నారీమణి కావుననే కుమారి వాసంతి ఆశయము నెరవేరినది. ఆమె నటించిన చిత్రాలు పేరుగాంచుటము ఆమె పాత్రపోషణయే కారణము. ముఖ్యంగా దేవదాసు, రోజులు మారాయి, చివరకు మిగిలేది, మాబాబు చిత్రాలలో గల ఆమె అసాధారణ పాత్రపోషణ చూచి నేను చాలా సంతోషించినాను.

కుమారి వాసంతి కూడ సావిత్రి మాదిరి కాల్ షీట్ వేళకి సరిగ్గా వెళ్లి "క్విక్" గా చిత్రరంగములో పేరుగాంచుగాక !

కె. ధర్మారెడ్డి (హైదరాబాద్)

* * *

నా అభిమాన తార అయిన సావిత్రి గారిని గురించి వాసంతిగారు వ్రాసినందుకు వారికి నా అభినందనలు. రచన చాలా బాగా ఉంది. నాకు సావిత్రి నటించిన చిత్రాలంటే చాలా యిష్టము.

ఈ. కనకదుర్గ (బందరు)

* * *

శ్రీమతి సావిత్రి గణేశన్ నా అభిమాన నటీ మణులలో ఒకరై. ఆమె గురించి వ్యాసము ప్రచురించినందుకు మీకు, రచయిత్రి వాసంతిగారికి నా అభివందనములు అందజేయుచున్నాను.

నరసింహమూర్తి (విజయవాడ)

* * *

శ్రీ రమణారెడ్డిగారు సంక్రాంతి సంచికలో వ్రాసిన "క్రొత్త సంవత్సరం కోరికలు" వ్యాసం చాలా బాగుంది. ప్రతివారం ఏదో ఒక వ్యాసం ఆయన వ్రాయాలని కోరుతున్నాను.

ఎ. ఎన్. పంతులు (హైదరాబాదు)

* * *

'ఇన్‌ఫ్రారెడ్' ఫిలిం దక్షిణ భారత ఫిలిం పరిశ్రమలో కొత్త ఏమీ కాదు. పది సంవత్సరాల క్రితం కూడా ఇన్‌ఫ్రారెడ్ ఫిలిం కొన్ని చిత్రాలలో వాడటం నే నెరుగుదును. 'కాంట్రాస్ట్' కోసం —నలుపు తెలుపుల మధ్య తారతమ్యం కొట్టవచ్చేటట్టు కనపడేటందుకు — ఇన్‌ఫ్రారెడ్ ఫిలిం వాడతారు. ఆకాశం నల్లగానూ సముద్రపు కెరటాలు తెల్లగా కనుపిస్తాయి, యీ ఫిలిం వాడితే, ఆకుపచ్చని ఆకులు తెల్లగా కనుపిస్తాయి. దీనివల్ల ఒక్కొక్క సన్నివేశంలో ఒక విధమైన 'మూడ్'ను తీసుకురావచ్చు.

వి. వి. రామన్న (బొంబాయి)

* * *

"ఆంధ్ర సచిత్ర వారపత్రిక" ఏ కోణం నుంచైనా తన ధృక్పథాన్ని మార్చుకోవడానికి ప్రయత్నిస్తున్నదా ? అంటే సాహిత్య సేవమాని "చెత్త కారు సినిమా పత్రిక" గా మారుతోందా ? లేకపోతే యీ సినీజీవులవి, వారిని గురించినవి యిన్ని వ్యాసాలా ! ఇన్ని కార్టూనులా ?

కె. నరసింహారావు, కె. రామం, కె. సత్యం (వైజాగ్)

* * *

## సందేహం

కాస్త ఆ 'జమున' ముద్రగల తపాలా బిళ్లలు ఎక్కడ దొరకగలవో తెలియజేద్దురూ !

వి. ఆర్. శేఖర్ (చేబ్రోలు)

* * *

సంక్రాంతి సంచికలో "పాప పరిహారం" చిత్ర సమీక్షలో ఎం. ఆర్. రాధాకు ఒక ప్రఖ్యాత నటుడు, దర్శకుడు మాటలు యిచ్చినారని వ్రాసినారు. ఆ ప్రఖ్యాత దర్శక, నటుడు ఎవరో తెలియపర్చవలెను.

భోగాల రామచంద్రరావు (విజయవాడ)

**"పుట్టిల్లు" చిత్రనిర్మాత, దర్శకుడు డాక్టర్ రాజారావుగారు.**

* * *

## డా॥ రాజు

డాక్టర్ రాజు, బొమ్మల కథ చాలా చురుకుగా సాగుతోంది. అందులో నర్సు రమకు, దేవిక గారు చాల పెద్ద ఇయర్ రింగ్స్ తగిలించారు. నర్సులు సాధారణంగా డ్యూటీలో పెట్టుకోరు, పెట్టుకోకూడదు. అది అసంభవము.

శ్రీమతి సౌధామణి సుందరము (అనంతపురం)

## కథ

పుల్లయ్యమావా, నీ కత ఇంతజల్దీగా సూస్తా ననుకోలేదు. మువ్వు దెబ్బలు తినేటయిపున నాకు చెడ్డ ఏడుపొచ్చినాది. ఒకసారి నాకు గిట్టాగే జరిగింది. మామసీన్మ సూసిరమ్మని రూకలిచ్చిండు. నేను ఉశార్‌గా శీన్మకాడకు చేరేవారకు బుకింగ్ కట్టేసిండు. ఇంతలో ఒకడొచ్చి "ఏక రుపయా" అన్నాడు. నేను జర ఆలోచించి టికెట్టు కొనేసేను. కాని లోపల సోటునేక సీన్మ అయిందాకా నుంచున్న. గింటికాడ కొచ్చేతాలికి మామ చిల్లరేవన్నాడు. నేను లేదన్నాను. అపాలి నన్ను జరసేపు సూసి ఉతికేసిండు. నీ కత చదివేతలికి అది గాపక మొచ్చింది. నీ సైకిలు దొరికితే ఉత్తరం రాయి.

వి. వెంకట్రావు (భీమవరం) ★

తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక
సర్క్యులేషన్ అత్యధికమైనది!

# "పొదుపు గురించి ఎప్పుడైనా ఆలోచించారా?"

"ఆ...బేంకులో మాత్రంకాదు...బేంకులోనికి వెళ్లడమంటేనే భయం."

"నేషనల్ అండ్ గ్రిండ్‌లేస్ బేంకులోనికి వెళ్లడానికి మీరేమీ భయపడ నక్కర్లేదు. అక్కడ అందరూ చాలా మర్యాదగా, సహాయకారిగా వుంటారు."

"అయితే డబ్బో"

మీకు కావలసిందల్లా రూ. 5/- సేవింగ్స్ బేంక్ ఖాతా తెరిచేటందుకు, సాలుకు 3% వడ్డీ లభిస్తుంది."

"అయితే నేను ఆలశ్యం సహించ లేను"

"డబ్బు కట్టేటందుకు గాని, తీసేటందుకు గాని పది నిమిషాలు పడతాయి. డబ్బు తీసేటందుకు మీకు చెక్కు పుస్తకం కూడా దొరుకుతుంది.

"సరే, అయితే ఎంతవరకు డబ్బు తీయవచ్చు"

"వారానికి రెండు సార్లు, మీ మూలధనంలో నాలుగో వంతుగాని లేక రూ. 1000/- గాని ఏదీ ఎక్కువ అయితే అది."

"అలాగా – నేషనల్ అండ్ గ్రిండ్‌లేస్ బ్యాంక్"

"అవును! నేషనల్ అండ్ గ్రిండ్‌లేస్ బ్యాంకులో డబ్బు దాచుకోనడం అంటే భద్రతా, ఉజ్వల భవిష్యత్తు అని గుర్తుంచుకోనండి."

ఖాతా తెరిచే ఫారాలకోసం మా బ్రాంచీలలో ఏ ఒక్కదానినైనా సందర్శించండి లేదా వ్రాయండి.



## నేషనల్ అండ్ గ్రిండ్‌లేస్ బ్యాంక్ లి.,

సభ్యుల మితబాధ్యతలతో ఇంగ్లండులో స్థాపించబడింది

మద్రాసు బ్రాంచిలు: 8 నార్తు బీచ్ రోడ్, 378 నేతాజీ సుభాష్ చంద్ర బోస్ రోడ్, (లాయిడ్స్ బ్రాంచ్)
8 ఆర్మేనియన్ స్ట్రీట్, 158 మౌంట్ రోడ్.

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

ముఖచిత్రం :
సావిత్రి

## విషయానుక్రమణిక

శుక్రవారం : *26-1-62*
ప్లవనం॥ పౌషమాసః శు॥ పంచమి
సంపుటము : 54 సంచిక : 21
స్థాపితము:
1908
*
ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్
*
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
విడిప్రతి : 25 న. పై
సంవత్సర చందా : 13-0-0 రు.
*
ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీథి, మద్రాసు-1
★



## లోకంపోకడ




"స్వదేశీ, విదేశీ దొంగ వ్యాపారుల సంఘం ఈవేళ సమావేశమై ప్రభుత్వం గోవామీద తీసుకున్న చర్యవల్ల తమ వ్యాపారం దెబ్బతినగలదని ఏకగ్రీవంగా తీర్మానిస్తున్నది."

## ముద్ర వేసే విభాగం










కృష్ణమీనన్ మాటే నిజమవుతే...



# పేర్లు చెప్పక పెద్దల ప్రసక్తి తేవడంలో ఆంతర్యం : రాష్ట్రకాంగ్రెసు రాజకీయాలపై అధిష్ఠానవర్గం తీర్పు

**కౌండిన్య**

ఆంధ్రప్రదేశ్ రాజకీయాలలో తిరిగి అడుగు, పెడుతున్నానని ఢిల్లీలోని పెద్దలు, సహచరులు సచివులు యిచ్చిన సలహాపైనే ఈపని చేస్తున్నానని శ్రీ నీలం సంజీవరెడ్డి హైదరాబాదులో ప్రకటించారు. గత రెండేళ్ళుగా పడిన శ్రమను ఫలోన్ముఖం చేసుకుని తన అభీప్సితాన్ని నెరవేర్చుకోబోతున్నానని చెప్పడం బాగానే ఉంది కాని రాష్ట్రానికి వెళ్ళమని తనకు పెద్దలు సలహా యిచ్చారనడమే కొంత ఆశ్చర్యంగా కన్పిస్తోంది. ఢిల్లీలో పెద్దలు అంటే ఎవరు. అధిష్ఠానవర్గ మనే గదా? ఎన్నికలకు సంబంధించినంతవరకు సంజీవరెడ్డిని మినహాయిస్తే శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి, శ్రీమతి ఇందిరా గాంధీ— అధిష్ఠానవర్గం. ఎవర్ని అభ్యర్థిగా పెట్టాలన్నా, మానాలన్నా, వీరెంత చెబితే నెహ్రూ కూడా అంతే. అటువంటప్పుడు ఈ ఇరువురు ఇటు సంజీవరెడ్డిని, అటు సంజీవయ్యను అభ్యర్థులుగా నిలిచి, రాష్ట్ర నాయకత్వాల కోసం పోటీ పడవలసిందిగా బుద్ధిపూర్వకంగా ప్రేరేపించి ఉంటారంటే నమ్మశక్యంగాని విషయం. శ్రీ సంజీవయ్య, తాను, శ్రీ శాస్త్రి, శ్రీమతి ఇందిరా గాంధీల సలహాపైన శాసనసభకు అభ్యర్థిగా నిలవదలచినట్లు ప్రకటించారు. శ్రీ సంజీవరెడ్డి తనకు సలహా యిచ్చిన పెద్దల పేర్లు చెప్పక పోవడం బట్టి సలహా యిచ్చినది శ్రీమతి ఇందిరా గాంధి, శ్రీ శాస్త్రి కాదని, వీరిని కాదని నెహ్రూ ప్రత్యేకం సలహా ఇచ్చిఉండరని అనుకోవచ్చు. [illegible]

సరే. ఇంతకూ శ్రీ సంజీవరెడ్డి ఆంధ్ర రాజకీయాలలో కొత్తగా అడుగు పెడుతున్నా రనడం నిజమా ? కాదు. అసలు అడుగు కదిపితే కదా కొత్తగా అడుగు పెట్టడం జరిగేది. ఆయన అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షుడు అయినా ఒక అడుగు ఇక్కడ ఉంచే వెళ్ళారు. కనీసం రాష్ట్ర శాసనసభ సభ్యత్వాన్ని కూడా వదులుకోక కాంగ్రెస్ సంప్రదాయానికి విరుద్ధంగా వ్యవహరించారు. అటువంటప్పుడు రాష్ట్ర శాసన సభకు తిరిగి పోటీ చేస్తుంటే వింత ఏముంది. రాజకీయాలలో తిరిగి ప్రవేశిస్తున్నా రంటే ఆశ్చర్యపడాల్సినదేముంది. అయితే, సంజీవరెడ్డి అప్పుడే ప్రకటన ఎందుకు చేశారని అడగవచ్చు. ఆయన ప్రకటనకు అర్థం [illegible] రాష్ట్ర శాసనసభకు అభ్యర్థిగా నిలుస్తున్నాను అంటే, రాష్ట్ర శాసనసభ కాంగ్రెస్ నాయకత్వానికి, అనగా ముఖ్యమంత్రిత్వానికి వస్తున్నానుసుమా అని హెచ్చరించడమే నన్నమాట.

అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షపదవి అంటే, మహాత్మాగాంధి, పండిట్ నెహ్రూ, బాబు రాజేంద్రప్రసాద్, సర్దార్ పటేల్, మౌలానా ఆజాద్, సుభాస్‌చంద్రబోస్ వంటి మహనీయులు అలంకరించిన మహోన్నత పదవి. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత నెహ్రూ హయాంలో దానికి కొంత ప్రాముఖ్యం తగ్గినా, మొత్తంమీద ప్రధాన మంత్రిత్వం తరువాత దేశంలో మన్నన, గౌరవం పొందుతున్న స్థాన మది. అటువంటి స్థానం అప్రయత్నంగా శ్రీ సంజీవరెడ్డికి లభించినా, దానిపై వారికి మనుసు పెరగలేదు. బహుశః అయాచితంగా రావడమే అందుకు కొంత కారణం కావచ్చు. దేశమంతటా కాంగ్రెస్ అధికారంలో ఉన్న సమయంలో, కాంగ్రెస్ అధినేతగా సమస్త రాష్ట్రప్రభుత్వాలను సాధించి తీర్చిదిద్దగల ఆధిక్య పదవిని ఆసాంతం నిర్వహించకుండా మధ్యలోనే వదలి వస్తున్నారు.

యువకుడు, కార్యశూరుడు, కాంగ్రెసును ఉద్ధరించ గలుగుతాడు అని గదా, శ్రీ సంజీవరెడ్డికి నెహ్రూ అధ్యక్షపదవిని అప్పగించారు. మరి కాంగ్రెస్ ఉద్ధరణ కార్యక్రమం పూర్తికాకమునుపే శ్రీ సంజీవరెడ్డి ఎందుకు తిరిగి వస్తున్నట్లు ? అంటే అందుకు రెండు కారణాలు చెప్పవచ్చు. శ్రీ రెడ్డి హయాంలో కాంగ్రెస్ కొంత బలపడి నప్పటికీ, కాంగ్రెస్‌ను కాలానుగుణంగా క్రొత్త ప్రతిపక్షాల ధాటికి తట్టుకోగలిగేట్లుగా, సమర్థమైన సంస్థగా రూపొందించగల కార్యక్రమాన్నిగాని, సంస్కరణలను గాని ప్రతిపాదించలేకపోయారు. పైన పదేళ్ళుగా పదవులలో ఉన్నవారు దిగిపోవాలని, వయోవృద్ధులు, పాతవాళ్ళు పనికిరారని అంటూ ఏవో కొన్ని విచిత్ర సిద్ధాంతాలు పెట్టి అమలు జరపలేకపోవడంతో వ్యక్తిగతంగా పరాజయం పొందినట్లయింది. నెహ్రూ ముందు, తన వ్యక్తిత్వాన్ని నిబాయించుకోకపోవడంతో తిరోగమనం తప్పలేదు. ఇంతకన్నా బలవత్తరమైన కారణం రాష్ట్ర నాయకత్వ పిపాస,

భారత కాంగ్రెస్ అధ్యక్ష పదవి అంటే బాధ్యత తప్ప అధికారం అట్టే ఉండదు. అందుకే ఆ పదవికి తనను ఆహ్వానించినప్పుడు, శ్రీ రెడ్డి తన అయిష్టత చెప్పారు. ఇతరులచే చెప్పించారు. ఆఖరికి ఆంధ్రప్రదేశ్ శాసనసభ కాంగ్రెస్ పక్షంచే కూడా శ్రీ రెడ్డిని ముఖ్యమంత్రి పదవి నుంచి కదల్చరాదని విజ్ఞప్తిచేస్తూ తీర్మానం చేయించారు. అయినా లాభంలేకపోయింది. శ్రీ నెహ్రూ ఆదేశాన్ని శిరసావహించక తప్పలేదు. అధ్యక్షపదవిలో ఉన్న ఈ రెండేళ్ళు ముండ్లమీద ఉన్నట్లే ఉన్నారు. వీలైతే తను, లేదా తన అనుయాయులు, రాష్ట్ర నాయకత్వం చేపట్టాలని చేసిన ప్రయత్నం సానుకూలం కాలేదు. ప్రత్యర్థి వర్గం బలంవల్ల గాని, అధిష్ఠానవర్గం అభిమతాన్నిబట్టి గాని, ఎన్నికల వరకూ ఆగవలసి వచ్చింది.

ఇప్పుడు రాష్ట్రానికి తిరిగి వస్తూనే "నేను ఢిల్లీ వెళ్ళిన పని పూర్తి అయింది. [illegible] రాష్ట్రానికి వస్తున్నా" నన్నారు. వారు ఏం పనిమీద వెళ్ళారు, వెళ్ళిన పని ఎలా పూర్తి అయిందో ఎవరికీ తెలియదు. కాని రాష్ట్రానికి వస్తున్నది నాయకత్వం చేపట్టాలనే నన్న సంగతి అందరికీ తెలుసు. "నేను ఎవరికీ పోటీగా రావడంలేదు" అని ఆయన అన్న మాటకు, తన కెవరూ పోటీ రాకూడదనే అర్థం. అందుకే "శ్రీ సంజీవయ్య భవిష్యత్తు ఢిల్లీలో తేలుతుంది" అని అశించారు. కాని ఆయన అంచనా తారుమారై కథ అడ్డం తిరిగింది. శ్రీ సంజీవరెడ్డి, శ్రీ సంజీవయ్యల భవిష్యత్తు ఆంధ్రలోనే తేలిపోవాలని అధిష్ఠానవర్గం నిర్ధారణ చేసింది.

కాగా, శ్రీ సంజీవరెడ్డి నాయకత్వం చేపట్టడమన్నది నల్లేరుపైన నడక కాదు. రాజీ కాండిడేట్‌గా ముఖ్యమంత్రి అయిన శ్రీ సంజీవయ్య, నాయకత్వానికి అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షపదవిలో ఉన్న శ్రీ సంజీవరెడ్డిని సవాలు చేయగలిగాడు అంటే, ఆయన వెనకాల ఎంతో బలము, ఎందరివో అండదండలు ఉండిఉండాలి. లేకపోతే సాహసించలేరుగదా. ఏమైనా పోటీ చాలా తీవ్రంగా ఉంటుందనడం నిస్సంశయం. ఇరువురూ పోటీ పడటానికి అధిష్ఠానవర్గం ఒప్పుకొంటుందా అంటే లేదనడానికి వీల్లేదు. పూర్వం గోపాలరెడ్డి సంజీవరెడ్డి పోటీచేయలేదా ? ఇప్పుడూఅంతే అవుతుంది.

శ్రీ సంజీవరెడ్డి, శ్రీ సంజీవయ్యల గెలుపు, ఓటములు ఎట్లా ఉన్నా, ప్రస్తుత పరిస్థితులలో ఎన్నికలకు ముందే ఈ పోటీ మనస్తత్వం అంకురించినందువల్ల ఎన్నికలలో కాంగ్రెస్‌కు కొంత దెబ్బ తగలడం ఖాయం. 1952 ఎన్నికలలో ఇలాగే కాంగ్రెస్‌లో చీలికలు వచ్చి రంగా, ప్రకాశం గారలు బయటికిపోయి రెండు పార్టీలు పెట్టి కాంగ్రెసును ఓడించారు. అప్పట్లో కాంగ్రెసు ఓడినా, కనీసం ఒక్క సంస్థగా నైనా ఎన్నికలలో పోటీ చేయగలిగింది. ఈసారి అలా కాక రెండు వర్గాలుగా కాంగ్రెస్ ఎన్నికలలో నిలుస్తుంది. ఈ వర్గాలు, ప్రత్యర్థి పార్టీల నెదుర్కొనడం కన్నా, ప్రత్యర్థి వర్గాన్ని దెబ్బకొట్టాలని ప్రయత్నిస్తే, ఫలితం వేరే చెప్పాలా ? "కాంగ్రెసుకు బయటివారివల్ల ప్రమాదం రాదు. అంతఃకలహాలవల్లనే ఆ ప్రమాదం దాపురిస్తుంది" అని కాంగ్రెస్ అధ్యక్షులు పదే పదే అన్న మాటలు అక్షరాలా నిజమయ్యేట్లుంది. ఇటువంటి విపత్పరిణామానికి కాంగ్రెస్ అధ్యక్షులు కూడా కొంత కారకులవడం దురదృష్టం. 

యువరాజాగారి [illegible] లక్ష్మి [illegible] నిమిరింది.

"రాత్రి వస్తానునుమా! మరిచిపోయి నిద్ర పోయేవు!"

"నిత్యం" వెన్నెల చిలికినట్టు నవ్వింది రహస్యంగా లక్ష్మి.

"రమ్మంటావా?"

"మాబాబు మన్నిలా చూస్తే ఏమవుద్ది?"

"బావిగిలక చప్పుడు ఇంకా ఆగలేదుగా!"

"గదో! వస్తుండు ...." లక్ష్మి గుడిసెలోకి చేరింది.

"అయ్యో, నీళ్ళు రవ్వంత ఉప్పన. ఎలాగుంటయో! గలాసు కూడా లేద్దొరా! పేదోణ్ణి—ఎలాగుంటయో!" అన్నాడు పులి.

"చాలా రుచిగా వున్నాయి. వస్తాను పులిగా" అన్నాడు త్రాగి. మామిడితోపుల మధ్యలోంచి వెన్నెల నీడల్లో కదలిపోయింది విగ్రహం—

"ఎంత మంచోడో! కడవతోనే నీళ్ళిచ్చినా దాగాడు—చిన్నరాజాగారు దొడ్డదొరలు—పులికడుపున మేక పిడబుడత్తి—" అనుకున్నాడు పులిదొర తోవలికినవ్వి.

— 56-వ పేజీ చూడండి



జూల్స్ వెర్న్

# భూగర్భంలోనికి సాహసయాత్ర

ఐస్‌లాండు

స్నాఫెల్స్ యోకుల్

వాట్నాయోకుల్

రెకియావిక్

## జరిగిన కథ

హాంబర్గ్ నగర నివాసి ప్రొఫెసర్ లిడెన్‌బ్రాక్ ఒక పాత గ్రంథం సంపాదిస్తాడు. దానిలో దొరికిన ఒక లిఖితపత్రంలో రహస్య సందేశం వ్రాసి ఉంటుంది. దాని అది ఆయన తమ్ముడు కొడుకైన ఆక్సెల్ మాత్రం తెలుసుకుని భయవిహ్వలుడవుతాడు.

అయితే తన పెదనాన్న దాని విషయమై పడుతున్న బాధ చూడలేక, రహస్యం చెప్పేస్తాడు. 'ఆర్నె సాక్నుస్సెమ్' అనే ప్రాచీన ఐస్‌లాండిక్ శాస్త్రజ్ఞుడు, యాత్రికుడు భూగర్భంలోనికి వెళ్ళినట్లు వ్రాసి ఉంటుంది. ఐస్‌లాండ్‌లో ఆరిపోయిన ఒక అగ్నిపర్వతం ముఖద్వారంలో నుంచి వెళ్ళినట్లు ఉంటుంది. ఆక్సెల్ అది నిజం కాదని వాదించినా వినిపించుకోనకుండా ప్రొ॥ లిడెన్‌బ్రాక్ డెన్మార్క్ మీదుగా ఐస్‌లాండ్ ప్రయాణం కడతాడు. డెన్మార్క్‌లో హార్ థామ్సన్ సహాయంతో ఐస్‌లాండుకు ఒక పడవను కుదుర్చుకుంటారు. అక్కడ ప్రొఫెసర్ ఫ్రిడరిక్సన్ ఇంట్లో దిగుతారు. స్నాఫెల్స్ పర్వతం వద్దకు దారి చూపేందుకు ఫ్రిడరిక్సన్ వారికొక గైడును కుదురుస్తాడు. అతని పేరు హాన్స్. అతని సహాయంతో వారు స్నాఫెల్స్ పర్వతాన్ని చేరుకుని, స్కార్టారిస్ శిఖరం ఎక్కారు. ఆ శిఖరం చివరన వారికి మూడు రంధ్రాలు కనిపించాయి. మధ్య రంధ్రంమీద స్కార్టారిస్ నీడ పడేవరకు కనిపెట్టుకొనివుండి, నీడపడిన రోజున ఆ రంధ్రం గుండా భూగర్భంలోనికి దిగుతారు.

## 18

ప్రొద్దున ఎనిమిది గంటలకు మమ్మల్ని ఒక సూర్యకిరణం మేల్కొలిపింది. లావా గోడల మీద ప్రతిబింబించి నిప్పురవ్వలు చిందినట్లయినది.

మా పరిసరాలు తెలుసుకునేటందుకు కావలసినంత వెలుగు ఉన్నది.

"ఏమి, ఆక్సెల్, ఇప్పుడేమంటావ్?" అని అరిచాడు మా పెదనాన్న చేతులు నలుపుకుంటూ. "కోనిగ్‌బర్గ్‌లో మన చిన్న ఇంట్లో మాత్రం ఇంతకన్నా ప్రశాంతమయిన రాత్రి గడిపావా? బళ్ళ చప్పుళ్ళు లేవు! పడవవాళ్ళ అరుపులు లేవు! తట్టలుమోసుకు పోయేవారి కోలాహలం లేదు!"

"ఈ మాతితో ప్రశాంతంగాఉన్న మాట నిజమేకాని, ఈ ప్రశాంతత భయం కలిగించేదిగా ఉంది."

"ఇదిగో!" అని అరిచాడు మా పెదనాన్న. "అప్పుడే దడుసుకుంటే ఇంకా ముందు ముందుకి నీ

—64—వ పేజీ చూడండి

# హరివంశము

## హారీత శివశర్మ

## సాందీపనిపర్వం - 45

రాత్రి ఎంత పొద్దుపోయినదో తెలియుట లేదు. సుదక్షిణయు, ఆమె తండ్రియు తప్ప ఇప్పుడు ఆ మందిరమున ఎవ్వరును లేరు. మహారాజు పరిస్థితి యేమో బాగుగా లేదు. ఆయనకు వర్షము తగ్గినప్పుడు వ్యాధియు కొంచెము తగ్గుచున్నది. హెచ్చినప్పుడు హెచ్చుచున్నది. ఎప్పుడో ఒక్కసారి తెరపి యిచ్చిన వర్షము తిరిగి ఇప్పుడు మరియు నధికమైనది. అఖిల ప్రపంచము చీకటిచేతవలె, వర్షముచేత గూడ నావరింపబడినది. రాజమందిరములో మాత్రము రత్నములతోడి దీపముల వెలుగులో కొంత కాంతిగా నున్నది. సుదక్షిణ ఆ వెలుగులో శోకమూర్తియై యుండినది. ఆమెకు ఒక్క దుఃఖము కాదు. బహు దుఃఖములు. తండ్రి ఏమగునన్న దుఃఖము గొప్పది. తండ్రికి తన కుమార్తె యేమగునన్న దుఃఖము గొప్పది. వా రిద్దరును నడిరాత్రివేళ ఆ వర్షావేళలో ఇట్లు దుఃఖమును పంచుకొనుచున్నారు. పౌండ్రకుడు వెడలిపోయిన తరువాత ఒకరితో ఒక్కరు మాట్లాడుకొనలేదు. వాచాలుడేమో మాటలాడుద మనుకొనినాడు. కాని వారి ఆ స్థితిని చూచి మాటాడలేక పోయినాడు. వానికేమియు తోచినది కాదు. అక్కడ ఎవ్వరికి ఏమియు తోచుట యనునదే లేదు. ఎవరి ఆలోచనలు వారిది. ఒకరి ఆలోచనలకు మరియొకరి ఆలోచనలకు సంబంధ మున్నదో ! బయట వర్షము మర్దళములుగా కురియుచున్నది. మెరయుచున్నది. వేగముతోడి గాలిని చీల్చుచు విచిత్రనాదములను సృష్టించుచున్నది. ఆ నాదమును వినుట సుదక్షిణ కానందముగ నున్నది. ఇప్పుడు మనస్సును దేనిమీదకో లగ్నము చేయవలెను. కానిచో తాసీ దుఃఖమును, ఈ భయమును భరించలేదు. ఈ దుఃఖములో, ఈ భయములో నామె ఆ గాలికి, ఆ వానకు, అల్లాడు ఉద్యానతలత వలె నయిపోయినది.

ఆమె అచ్చటి గవాక్షమున కూర్చుండి మంచముపై పండుకొనిన తండ్రిని తిలకించినది. ఆయన ఏమో తెలియరాని బాధతో ఆయాసపడుచున్నాడు. నిజముగా తనకు ఆయన బాధ తెలియదా ! ఆయనయే తన నోటితో చెప్పినాడు: 'తల్లీ ! నేను శ్రీకృష్ణవాసుదేవుని చూడవలయును నా యీ బాధ తగ్గవలయును." ఆ వాసుదేవుని రాకయే లేదు. మహారాజు మహానందునితో గూడా నీ విషయము చెప్పికొన్నాడు. మహానందులవారు ఈ విషయమును శ్రీకృష్ణవాసుదేవునకు విన్నవించ లేదా ! ఆయన కేమి పని ! సుదక్షిణ తండ్రివైపు చూచి దుఃఖపడినది. ప్రేమలో దుఃఖమున్నది. అది ఆయనయందును, తనయందును గూడ ఒకే విధముగా నున్నది. ఆయన నన్ను అధికముగా ప్రేమించి దుఃఖమును తెచ్చుకొనినాడు. నేను ఆయనను అధికముగా ప్రేమించి దుఃఖమును తెచ్చుకొనుచున్నాను. ఈ అనుబంధమే విచిత్రమైనది. తమ యీ అనుబంధములు, విచిత్రములై, తాము ఎన్నడును చూడని శ్రీ కృష్ణవాసుదేవాభిముఖులై, నదులు సముద్రమునకు వలె, ప్రవహించుచున్నవి. ఆ వాసుదేవు డెట్టివాడు ? నిజముగా బావ వేషము వేసికొనినప్పు డున్నట్లే యుండునా ? బావయో, ఆయన చాల అందగాడని చెప్పినాడు. వాచాలు డున్నాడు కదా ! అతడును ఆయనను చూచెను. సుదక్షిణకు అతనిని ఆ విషయమై అడుగవలయు ననిపించినది.

"వాచాలా !"

వాచాలుడు మందిర ద్వారము కావలగా నున్నాడు. అతనికి ఆమె పిలుపు వినిపించలేదువలె నున్నది. అతడు పల్కలేదు. సుదక్షిణ మరల "వాచాలా !" అని పిలచినది. మహారాజు కన్నులు తెరచినాడు. "తల్లీ ! వాచాలుడు దేనికి ?" అనినాడు. ఆమె మరల వాచాలుని పిలచినది. వాచాలుడు కన్నులు నులుముకొనుచు లోపలికి వచ్చినాడు.

"భర్తృదారిక ! ఏమి ?" అనినాడు.

సుదక్షిణ ఆలోచించినది. మహారాజు ఆశ్చర్యముతో ఆమెను చూచుచు నుండిపోయినాడు. సుదక్షిణ వాచాలుని మరల సంబోధించినది.

"వాచాలా ?"

"భర్తృదారిక !"

'నీవు శ్రీకృష్ణవాసుదేవుని చూచినావు కదా ? ఆయన ఎట్లుండును ?"

"ఎట్లుండును ? వర్షాకాలము వలె నుండును. ఆయన శరీరము ఆకాశము వర్ణము, మేఘము. కన్నులు తటిల్లతలు. పల్కు స్తనితము. ఈ వర్షమును చూడగా, ఆయన నాకు జ్ఞాపకమునకు వచ్చెను."

సుదక్షిణ నవ్వినది. మహారాజు గూడ నవ్వినాడు. నవ్వి బలహీనముగా వాచాలుని ఇట్లడిగినాడు.

"వాచాల ! ఇంకను ఎట్లుండును ?"

"మహారాజ ! కోతివలె నుండును. వేదములలో నేను వృషాకపిని గూర్చి చదువుకొన్నాను. ఆ వృషాకపి ఎట్లుండును అని అప్పుడు ఆలోచించితిని. తెలియలేదు. శ్రీకృష్ణవాసుదేవుని చూడగా ఆ వృషాకపి ఇతనివలెనే యుండునని అనిపించినది. అదియును గాక ...."

మహారాజు : అదియునుగాక ...."

వాచాలుడు : అతడు నన్ను కోతి అన్నాడు. అందుచేత అతడు కోతివలె నుండు ననుకొన్నాను.

మహారాజు : వాచాల ! నీకు పిచ్చి ఎత్తినట్లున్నది.

వాచాలుడు: ఈ వర్షమును చూచినను, ఆ కృష్ణుని చూచినను ఎవరికి పిచ్చి ఎత్తదు ?

సుదక్షిణ మందహాసము చేసినది.

"వాచాలా ! నీవు పోయి పండుకొనుము. ఇక్కడ నుండ నవసరములేదు."

"ఉండకపోయినచో, ఉరిపోసుకొమ్మందువా తల్లీ! పౌండ్రకుని ఆజ్ఞను నేను ధిక్కరించుట యెట్లు?"

సుదక్షిణ మాటాడలేదు. వాచాలుడు మరల తన యధాస్థానమునకు చేరుకొనినాడు. మహారాజు మరల కన్నులు మూసికొని పండుకొనినాడు. సుదక్షిణ తిరిగి తన ఆలోచనలలో పడిపోయినది. అట్లు ఎంతసేపు జరిగిపోయినదో తెలియదు. అంతలో మహారాజు కన్నులు తెరచి తల్లీ!' అనినాడు. ఆమె తండ్రి మంచము వద్దకు వెళ్లినది.

—52వ పేజీ చూడండి

# సరస్వతీ స్తుతి

శొంఠి సీతారామయ్య

ఆరోహణ:
సరిమపదస

అవరోహణ:
సనిదపమరిస

సరస్వతిరాగం: 64-వ మేళకర్త - వాచస్పతి జన్యం,

షడ్జమం: చతుశ్శ్రుతిరిషభము, ప్రతిమధ్యమం.
పంచమం: చతుశ్శ్రుతి ధైవతము, కైశికినిషాదము - ఈ శ్రుతులు పల్కును.
చతుశ్శ్రుతిరిషభ, చతుశ్శ్రుతిధైవత, పంచమనిషాదములు రాగచ్ఛాయా స్వరములు.
సరిమపా - దప - పదనీదా - నిదదపమా - పదసా - సనిదా - దసరీ - రిమరీసా
సరిసనిదా - దాపా - పదనీ - నిదదపమా - పదపమ - రిమపామా - పమరిసా
సరిసని̣ధ̣ - ని̣ధ̣ప̣ధ̣సా - ఈ ప్రయోగములు ఈ రాగమును బాగుగా స్ఫురింపజేయును.
ఆదితాళము - మధ్యాది. 3 అక్షరముల జాగా.

పల్లవి: శ్రీ సరస్వతే - సుజనహితే - సుస్వరసంగీత - సుజ్ఞాన హితమతే॥

అనుపల్లవి: వాసవాదిసంసేవిత సుధీమతే
వాచస్పతి నతే - విద్యాలంకృతే॥ శ్రీ సర॥

చరణము: కవి గాయక - గాయిని వైణిక
కాది జన వాగ్రూపధారిణీ
రవిసోమవందితే - రంజిల్లుయువతే
రాదా దయ సీతారామ బుధనుతే॥ శ్రీ సర॥

పల్లవి:
| ; , రి మ పా ద | నీ, దా, - ప ద | సా - నీ ద |
| ; , శ్రీ - స ర | స్వ తే సు - | - - జ న
| ని ద ద ప మా - రీ మా - రి మ పా దా | ప ద నీ దా - ప ద | సా - స ని నీ దా
| హి - - తే - శ్రీ - - స - - ర - | - - స్వ - తే సు | - జ - న
| ని ద ద ప మా - రీ మా - రి మ ప దా | ప మ ప ద ని ద - ప ద | సా - స రి స ని ద ప
| హి - - తే - శ్రీ - స - - ర | స్వ - తే - సు - | - జ - - న -
| ని ద ద ప మా - రీ మా - రి మ పా దా | ప మ ప ద ని ధ - ధ̣ స | రీ - స రి స ని ద ప
| హి - తే - - - శ్రీ స - - - ర | స్వ - తే - - - సు - | - - జ - న -
| ని ద ద ప మా - ప ద ప మ - రి మ పా మా | రీ, సా, - రి మ | పా - మ ప దా - ప ద
| హి - తే - - సు - స్వ - ర - - సం | గీ తా - సు - | - జ్ఞా - న - హి -
| సా - ని ద ప మ
| త - మ - తే - ॥ శ్రీ సర॥

అనుపల్లవి:
| ; , - ని ద ప మ - పా ద | సా రీ, - రీ | స - సా రీ
| , , - వా - స - వా ది | సం సే - వి | త - సు ధీ
| స ని నీ దా - ని ద ప మ - ప మ పా దా | ప ద సా రీ - రీ | సా - ద స రీ రీ
| మ - తే వా - స - వా - ది | సం - సే వి | త - సు - ధీ
| స రి స ని దా - ని ద ప మ - ప మ పా దా | ప ద సా రీ - రీ | సా - రీ రీ మా
| మ - తే - - వా - స - వా - - ది | సం సే - వి | త సు - ధీ
| రీ, సా, - ద ని ద ప - ని ద ద ప మా | ప ద సా రీ - రీ | సా - రి మ పా మా
| మ - తే - వ - స - వా - - ది | సం - సే - వి | త - సు - ధీ -
| రి మ రీ సా - ద స రీ - రి మ రీ సా | స ని నీ దా ప మ | ప ద - ప ద రి స ని ద
| మ - తే - - వా - చ - స్ప - తి | న - తే - వి - | - ద్యా - లం
| ని ద ద ప మా
| కృ - తే ॥ శ్రీ సర॥

# ఈవారం సినీవిహారం

మధుమూర్తి

## ఫిబ్రవరి నెలలో ఆరు చిత్రాలా !

ఆంధ్ర ప్రేక్షకలోకానికి కొత్తసంవత్సరం కొత్తనెలలో నాలుగుతెలుగు చిత్రాలు అందినట్లే ఫిబ్రవరినెలలోకూడా కనీసం నాలుగుశుక్రవారాల్లోనూ నాలుగు చిత్రాలు విడుదల కావటానికి సంసిద్ధంగానే ఉన్నై. కొడక్ కంపెనీవారు పాజిటివ్ ఫిల్ము సరఫరాను సక్రమంగా అందించగలగాలేగాని ఫిబ్రవరి నెలలో ఆరు చిత్రాలనైనాసరే ఆంధ్ర ప్రేక్షకులకు సమర్పించడానికి చిత్రపరిశ్రమకు ప్రస్తుతం శక్తి ఉంది.

ఇప్పటి అంచనాలనుబట్టి ఫిబ్రవరి విడుదలలుగా విక్రమ్ ప్రొడక్షన్స్ "పెళ్ళి తాంబూలం", శ్రీనివాస్ వారి "టైగర్ రాముడు", జగపతి పిక్చర్స్ "ఆరాధన", రాజ్యలక్ష్మీ పిక్చర్స్ "ఖైదీ కన్నయ్య" చిత్రాలు సింగారించుకుంటున్నవి. ఇవిగాక నందీ పిక్చర్స్ "నాగార్జున", పద్మినీ పిక్చర్స్ "గాలి మేడలు" వచ్చే నెలలో ఆంధ్రదేశంపై జైత్రయాత్ర సాగించగలమని "స్పై" అంటున్నవి.

జనవరినెలలో చిత్ర నిర్మాతలు తమ చిత్రాలను ఒకవారం వ్యవధిలో విడుదలచేసినవిధంగానే ఫిబ్రవరినెల చిత్ర నిర్మాతలు కూడా ఎడంఎడంగానే సినీలోకంలోకి తమ ఉత్పత్తులను ఎగుమతి చేస్తారనుకుంటా.

అష్టగ్రహకూటమి చేస్తుందనుకునే కన్నెర్రలు ఫిబ్రవరిలో నెల పొడుపు వారంలోనే కనుక ఆ వారం జోలికి నిర్మాతలు పోకుండా ఉండకమానరు. కారణం ఏమంటే—నూటికి తొంభైతొమ్మిది చలన చిత్ర నిర్మాతలు తమ భవిష్యత్తు అటు చిత్రాలలోని తారా బలంతోబాటు ఇటు తమ జాతక చక్రంలోని గ్రహ, తారల, చంద్రుల బలంపై ఆధారపడి ఉందని గాఢంగా విశ్వసించేవారు కావడమే.

*   *   *

ఆంగ్ల సంవత్సరం అడుగు పెట్టిన రోజునే కౌసల్యా ప్రొడక్షన్స్ అనే చిత్రనిర్మాణసంస్థ గోల్డెన్ స్టుడియోలో "నువ్వా నేనా ?" అనే చిత్రం షూటింగ్ ప్రారంభించింది. ఈ సంస్థ వెనుకనున్న వ్యక్తులు, నిర్మాతలు ఎస్. భావనారాయణ, పి. సి. బాలకృష్ణరాజాలు. ఈ చిత్ర గాథ నూరేళ్ల క్రిందటి సాంఘిక వాతావరణలో ప్రేమ, పెళ్ళి, ప్రళయం అనే జీవన సమస్యల చుట్టూ చిక్కగా సాగుతుంది.

ఆరోజు గోల్డెన్ స్టూడియోలో అడుగు పెట్టే సరికి ఒక చిక్కని వన ప్రదేశంలో ఒక సుబేదారు ఇల్లు, ఇంటిముందు ఆ సుబేదారూ, కూతురూ పెళ్లి విషయంలో ఘర్షణ పడుతున్నారు. అందాల బాల పద్మ ఆనంద్‌ను ప్రేమించింది. తండ్రి మాత్రం తన కూతుర్ని జమీందార్ ప్రతాప్‌కి ఇచ్చి పెళ్లిచేద్దా మనుకున్నాడు. ఆమాట ఆమెకు చెప్పాడు. ఆమె అంగీకరించలేదు. మాటల పోట్లాట ప్రారంభమైంది వారి మధ్య.

"నాన్నా ! ఈ పెళ్లి నా కిష్టంలేదు."

"నిన్ను వరించేది ఈ దేశపు జమీందారమ్మా!"

"ఆ జమీందారుని నిరాకరించేది ఆత్మాభిమానాన్ని ప్రాణ సమానంగా చూసుకునే సుబేదార్ సుందరరావుగారి కుమార్తె నాన్నా !"

తాను ఆనంద్‌నే ప్రేమించాననీ, అతనినే పెళ్లి చేసుకుని, అతని వద్దనే ఉంటానని దాపరికం లేకుండా నిక్కచ్చిగా తండ్రితో చెప్పేసింది పద్మ. తండ్రికి సహజంగా కోపం వచ్చేసింది. ఐనా, తల్లిలేని బిడ్డ పద్మ అనే చింతతో ఆమెను నచ్చజెప్పటానికి ఆయన కొంత ప్రయత్నం చేశాడు.

"సరే ! వాణ్ణే చేసుకో. కాని, నే నడిగే ప్రశ్నకు సమాధానం చెప్పమ్మా ! నీ ఆనంద్ నిర్భయంగా



'గులేబకావళి కథ'లో నాగరత్నం, యన్. టి. రామారావు.

ఊళ్లోకి రాగలడా ? పదిమందీ కూర్చున్న పందిట్లో నిన్ను వాడు శాస్త్రోక్తంగా చేపట్టగలడా ?"

"అన్యోన్యంగా ప్రేమించుకునే హృదయాలకు ఆడంబరా లెందుకు నాన్నా ? మా పెళ్లికి పందిళ్లూ, మేళతాళాలు, ఊరేగింపు అక్కర్లేదు."

"చాలు ! ఇసుకలో ఇల్లుకట్టి, పప్పుబెల్లాలు పెట్టి, చిన్నపిల్ల లాడుకునే బొమ్మలపెళ్లి కాదమ్మా మనం చర్చించే పెళ్లి. ఇది జీవిత సమస్య."

"మనస్సుకు నచ్చినవాణ్ణే చేసుకోడానికి ఏ సమస్యనైనా ఎదుర్కోడానికి సిద్ధంగా ఉన్నాను."

"తండ్రిని కూడా ఎదిరిస్తావా ?"

—62వ పేజీ చూడండి

చరణము ॥ | ; , - ని ద - పా మ | ప ద నీ దా - ప ద | సా - ద స సా రి స ని ద -

; , క వి - గా య | క - - గా | - యి - - ని

| ని ద ద ప మా - ద ని ద ప - ని ద ద ప మా | ప మ రీ సా - రి మ | పా - ప ద నీ ద

| వై - - ణి - కా - ది - - జ న వా - - | ఘూ | - - - - ప - ధా - రి

| ని ద ప మ పా - ని ద ప మ - పా ద | సా రీ - రీ | సా - ద స రీ రీ

| ణి - - ర - వి - సో మ | వం ది తే | రం - జీ - ల్లు

| స రి స ని దా - ద ని ద ప - ని ద ద ప మా | ప ద సా రీ - రీ | సా - రి మ పా మా

| యు వ - తే ర - వి - సో - - మ | వం ది తే - రం | - జీ - - ల్లు

+ రీ రీ సా - ద స రీ - రి మ రీ సా | స ని నీ దా - ప మ | ప ద - ప ద రి స ని ద

| యు వ తే | గా దా - ద - - యు | నీ - తి - రా - | ము - బు - - - - ధ

| [illegible]

॥ శ్రీ సర ॥

# చదువుల్రావు





ఏమిటోనో ఈమధ్య నాజ్ఞాపకశక్తి మరీ ముందగిస్తూంది. మొన్న జరిగిన విషయాలు ఈవేళజ్ఞాపకఉడటం లేదనుకో




అలాగా పాపం, పోనీ ఈవేళ జరిగిన విషయాలు రేపు జ్ఞాపకం ఉంటాయా?
ఉండదోయ్




దానికేంగానీ బ్రదర్, ఓ పది రూపాయిలుంటే అప్పియ్యి
సత్యమూర్తి

# మనము - మన దేహస్థితి

డా॥ గాలి బాలసుందరరావు

## చిన్న ప్రేగులో జీర్ణము

శరీరపు ధర్మముల నన్నింటినీ అర్థం చేసుకుంటానికిముందు, దానిలోకివెళ్ళే ప్రధాన నాళములలో ఒకటైన పోర్టల్ వెయిన్, ఆహార పదార్థములను ఎక్కడనుంచి తెస్తుందో ఏ స్థితిలో తెస్తుందో అర్థం చేసుకోవాలి.

డువోడినంలో కొంత జీర్ణమయిన ఆహారం, జెజునం అనే ఆంత్ర భాగానికి వెళుతూందని యిదివరకే తెలుసుకున్నాము. భోజనం లోపలి పొరలోవున్న గ్రంథులు, ఆంత్రరసమును స్యందించుతవి. ఆంత్రరసం యొక్క విధి కూడా పేంక్రియస్ రసం విధి వంటిదే. ఇందులో "ఇరెప్సిన్" (Erepsin) అనే ప్రోటీనులను విరిచే శక్తిగల ఎంజయము వున్నది. ఇది రసాయనికంగా జఠర రసములో వుండే "పెప్సిన్," పేంక్రియస్ రసంలోవుండే ట్రిప్సిన్‌లను పోలి వుంటుంది. డువోడినంలో ఎమైనో ఏసిడ్స్‌గా మారిపోకుండా మిగిలిపోయిన అర్థ జీర్ణములయిన ప్రోటీనులను ఇది పూర్తిగా ఎమైనో ఏసిడ్స్‌గా మార్చివేస్తుంది. ఇంతేకాదు. పెప్సిన్‌కు, ట్రెప్సిన్‌కు కొన్ని రకములయిన ప్రోటీనులను జీర్ణించే శక్తిలేదు. కాని ఆంత్ర రసములోవుండే ఇరెప్సిన్‌కు ఆ శక్తి వున్నది. ఉదాహరణంగా పాలు విరిగినప్పుడు తెల్లని జున్నువంటి పదార్థము, లేత ఆకుపచ్చవర్ణం గల తేట నీరు తయారవుతుంది. ఈ నీటిని 'వే' (Whay) అంటారు. ఆ జున్నువంటి పదార్థమును 'కేసిన్' (Casein) అంటారు. కేసీన్ చాలామంచి ప్రోటీన్. కాని, అది తేలికగా జీర్ణంకాదు. దానిని విరిచి ఎమైనో ఏసిడ్స్‌గా మార్చే శక్తి పెప్సిన్‌కు ట్రిప్సిన్‌కు తక్కువ. కాని ఆ శక్తి ఇరెప్సిన్‌కు వున్నది. భోజనంలో తీసుకున్న కేసీన్ అనే పదార్థమును ఇరెప్సిన్ ఎమైనో ఏసిడ్స్‌గా మారుస్తుంది.

ఆంత్రరసంలో ఉత్పత్తిఅయ్యే మరొక పదార్థము, రక్తం ద్వారా డువోడినం చేరినప్పుడు అక్కడ గ్రంథులనుఉద్రిక్తంచేసి, ట్రిప్సిన్‌కుమాతృ వస్తువైన ట్రిప్సినోజన్‌ను ట్రిప్సిన్‌గా మారుస్తుంది.

జీవకణములలో న్యూక్లియస్ (Nucleus) అనే విశిష్టమయిన ప్రోటోప్లాజము వుంటుందని యిదివరకే తెలుసుకున్నాము. జీవకణము విభజన పొంది రెండుగా మారడానికి—అంటే ప్రాణినుండి ప్రాణి ఉద్భవించడానికి యీ న్యూక్లియస్సే కారణం. న్యూక్లియస్‌లో భాగం లేకపోతే జీవకణభాగం మరొక సర్వస్వతంత్రమైన జీవకణం (Cell) గా తయారు కాలేదు. ఈ న్యూక్లియస్‌లో అతి ముఖ్యమైన, విలువైన, ప్రోటీన్ విశేషము వున్నది. దానిని న్యూక్లీన్ (Nuclen) అంటారు. ఆంత్రరసంలో న్యూక్లియేజ్ (Nuclease) అనే ఎంజయము ఈ న్యూక్లీను అనే పదార్థమును మారుస్తుంది. న్యూక్లియస్ తయారు కావడానికి న్యూక్లీన్ చాలా అవసరము.

ఇరెప్సిన్, న్యూక్లియేజ్ అనే ఎంజయములేకాక శర్కరాద్రవ్యములను—అంటే పిండి పదార్థములలో వుండే చక్కెరలను, పాలలోవుండే పంచదారను, మాల్టులోవుండే పంచదారనూ, గ్లూకోజుగా మార్చే మూడు రకములయిన ఎంజయిములు కూడా ఆంత్ర రసంలో తయారవుతవి.

రోజుకు రెండు లీటర్ల ఆంత్రరసం జెజునంలో తయారవుతుంది. జెజునం గోడమీద, అందులో ప్రవేశించిన ఆహార పదార్థముల ఒత్తిడివల్ల, అక్కడ వుండే నరాగ్రములు ఉద్రిక్తములై, గ్రంథులను ఉద్రిక్తములు చేసినందున ఈ రసం ఉత్పత్తి అవుతుంది. ఇంతేకాదు. జఠర రసము ఆహారంలో వున్న మసాళా వస్తువులు, ఆమ్ల వస్తువులు (Acid) ప్రోటీనులు జీర్ణంకాగా తయారయిన వస్తువులు పాలనుండి ఉత్పత్తి అయిన పంచదార, పాదరసంనుండి తయారయిన 'కేలొమెల్' (Calomel) అనే లవణ విశేషము, ఆంత్ర రసము విరివిగా ఉత్పత్తి కావడానికి సహకరిస్తవి.

మసాళా ద్రవ్యములలో ఆవాలనుండి తయారైన తైలము ఆంత్రరసం ఉత్పత్తికి ఎక్కువగా సహకరిస్తుంది. పాకకళ అభివృద్ధి అయినప్పటినుంచీ మనవారు ,ఆవాలను పోపులో ఉపయోగిస్తున్నారు. మాంసమును కాచి తయారుచేసే 'క్షోరువా' (Soup) ఆంత్రరసమును ఉత్పత్తి చేస్తుంది. ఆహారంలో కొవ్వులు అధికంగావున్నా ఆంత్రరసం అధికంగా ఉత్పత్తి అవుతుంది. పేంక్రియస్ రసంలోలాగానే ఆంత్రరసంలో కూడా భోజనంలోవున్న ఆహారపదార్థములో ఏ రకమైన భోజన వస్తువు—ప్రోటీన్ కార్బోహైడ్రేట్, కొవ్వులలో అధికంగావుంటే ఆ వస్తువును జీర్ణించే ఎంజయము అధికంగా ఉత్పత్తి అవుతుంది. బెంగాలీవారు చేపలను ఆహారంలో ఎక్కువగా తింటారు. చేపలలో ప్రోటీను కొవ్వు మాత్రమే వుంటవి. శర్కరా ద్రవ్యములు వుండవు. వారు ఆవనూనె అత్యధికంగా వినియోగిస్తారు. ఆహారంలో ఇన్ని రసాయనిక వస్తువులున్నవనీ, జీర్ణ రసములలో ఇన్ని రకములయిన ఎంజయములున్నవనీ, వాటి రసాయనిక స్వరూప స్వభావములు యిట్టివనీ మన పూర్వులకు తెలిసినా, తెలియకపోయినా, ఏ భోజన వస్తువు పుష్టికరమైనదో, ఏ వస్తువు ఏ ధాతువును వృద్ధి చేస్తుందో ఏ వ్యంజన వస్తువు జీర్ణకారియో వారికి పూర్తిగా తెలుసును. ఆయాప్రాంతములలోపరంపరాగతమైనభోజనవిధానం స్వస్థాహారముగానే (Balnced Diet) వుంటుంది. కాని ఆధునిక వ్యవసాయ విధానాలవల్లా, నాగరికతవల్ల, ఆహారంలో పథకం ప్రతి ప్రాంతంలోనూ మారిపోయింది. కొన్ని వస్తువులు అధికం కావడం, కొన్ని లోపించడం ఏర్పడింది. ఇందువల్ల కాపిక వ్యాధులు (Difficiency Diseases) అధికమౌతున్నవి. ఆహార పథకములలో మార్పులువచ్చినప్పుడు, భోజన సంబంధమయిన రసాయనిక విజ్ఞానంతో క్రొత్తగా వచ్చిన మార్పులను దృష్టిలో వుంచుకుని, ఆహారంలో "స్వస్థత" (Balance) ఏర్పడేలాగా, దొరికే వస్తువులను మిళితం చేసుకోవాలి. ఇప్పుడల్లా జరగడంలేదు. నీటి వనరు అధికమైనకొద్దీ ధాన్యముల ఉత్పత్తి అధికమై, పప్పులు, కూరలు, వ్యంజన ద్రవ్యములు ఉత్పత్తి చేయడం తగ్గిపోయి, వాటి ధరలు అధికమైపోయినవి. ధరలు అధికం కావడంతోనే, వాటి వినియోగం తగ్గింది. కడుపునింపుకోడం మాత్రమే భోజనం చేయడానికి ప్రధానోద్దేశ్యమైంది. జనుల ఆహారంలో స్వస్థత నశించింది. ఈ విషయం అందరూ గ్రహించాలి. జీర్ణకోశంలో జరిగే కార్యక్రమమును గూర్చి సమగ్రమయిన పరిజ్ఞానము అందరికీ—ముఖ్యంగా ఆహారం తయారుచేసి ఇంటిల్లపాదికీ అన్నంబెట్టే స్త్రీలకు సమగ్రంగా ఏర్పడవలసిన అవసరం ఈ కాలంలో పూర్తిగా ఏర్పడింది. అందుకని జీర్ణాశయమును గురించీ, ఆహారనిర్మాణమును గురించీ పరిపూర్ణంగా తెలుసుకొని అందులో తగిన మార్పులు చేసుకోకపోతే జాతి క్షీణించి నశించే సూచనలు కనుపిస్తున్నవి. 'అందరికీ' అందుబాటులో అన్ని వస్తువులు దొరికే విధంగా ఆహారం నిర్మించబడాలి. పూర్వులకు ఈనాటి రసాయనిక శాస్త్రం తెలుసునో తెలియదో చెప్పలేము. కాని వారికి ఏ ప్రాంతంలో ఏ యే వస్తువులు ఏ యే పరిమాణంలో భోజనంలో కలిపి ఎల్లా తిండి తింటే శరీరం ఆరోగ్యంగానూ, శక్తివంతంగానూ వుంటుందో పూర్తిగా అనుభవంవల్ల తెలుసు. ఆ పద్ధతులు ఈనాడు మారిపోయినవి. మారుతున్నవి. ఆ విషయం ఆహారమును గురించి చర్చిస్తున్నప్పుడు సోదాహరణంగా వివరిస్తాను. కాని ఈ ప్రాణావసరమైన విషయమును పూర్తిగా అర్థం చేసుకుంటానికి జీర్ణాశయమును గురించి సమగ్రమయిన పరిజ్ఞానం అవసరం.

ఆంత్రరసం స్యందనానికి ప్రేగుయొక్క గోడమీద ఆహార పదార్థముల వత్తిడి ఒక కారణమని చెప్పేను. భోజనానికి ఒక పరిమాణంవుంటేనేగాని ఈ వత్తిడి యేర్పడదు. కేవలం కావలసిన పదార్థముల సారములను మాత్రమే తీసుకున్నప్పుడు ప్రేగుకు ఈ వత్తిడి వుండదు. అక్కడ గ్రంథులు స్యందించవలసిన పని వుండదు. కొంతకాలం అల్లా జరిగిన తరవాత ఆ గ్రంథులు జీర్ణ రసములను స్యందించే స్వభావం కోలుపోయి ఎండిపోతవి. 24 గంటలూ కాఫీ, టీ, హార్లిక్సు, ఓవల్టిన్‌వంటి ఆహారసారములు తీసుకుని జీవించేవారు ఈ విషయం గమనించాలి.

శరీరంలో ఏ అవయవం జీర్ణంకాగా తయారయిన సారం ఆ అవయమును ఉద్రిక్తంచేసే శక్తి కలదై వుంటుంది. ఇల్లాగే లివరుతింటే అది జీర్ణమై ఏర్పడిన సారం లివరును శక్తివంతము చేస్తుంది. ప్రేగులసారం, ప్రేగులను ఎక్కువగా జీర్ణరసం స్యందింపజేస్తుంది. ఈ విధంగా జఠరాశయంలోనూ, డువోడినంలోనూ చిన్న ప్రేగులలోనూ జీర్ణమైన ఆహారసారం చిన్నప్రేగు రెండవ భాగమైన ఇలియంలో ఆహరించబడి—పోర్టల్ వెయినులోకి పోతుంది. ఆ వివరములు వచ్చేవారం చర్చిస్తాను. ★

# మంచిభవిష్యత్తు

క్రమం అత్తవారింట్లో బాధపడుతున్నట్లు తెలిసిన తర్వాత నా మానసిక పరిస్థితి ఛిన్నమయింది. నేనొకప్పుడు ద్వేషించాను. అసహ్యించుకొన్నాను. దాని క్కారణం కూడా అప్పుడు అమ్మే నదే. 'నాలాంటి కష్టాలు నీకు రాకపోతాయా? శ—' అనుకొని ఓర్చాను. సరిగ్గా నే వూహించిన పరిస్థితే కొద్ది యేళ్ల అనంతరం వచ్చింది. ఇప్పుడు అలా వచ్చినందుకు బాధ కలుగుతోంది.

నాన్నగా ఓ ఉత్తరం రాసారు. చెల్లెలి ఆరోగ్యం ఏం బావులేదని, తను ఎలక్షన్ గొడవల్లో రద్దీగా ఉన్నారని, ఓసారి వెళ్లి చూసి రమ్మని ఆ లేఖలోని ముఖ్యాంశాలు. నాన్నగారు యిలా కోరడం కూడ ఇదే తొలిసారి. అంతెందుకు? కమలే విద్యావంతుల ఇంటిలో పుట్టి ఉంటే యింకో జీవితంలోకి ప్రవేశించే ఉండేదికాదు. ఆ విషయంలో నా ఆలోచనలేవీ కార్యరూపం పొందలేదు, సరికదా విఫలమయ్యాయి. పదహారో ఏటనే కమల మీద యిన్ని సమస్యలు కురిపించింది సమాజం పెళ్లిపేరుతో.

ఐదేళ్ళు వెనక్కి నడవండి. అక్కడ మా యింటి పెరటి పూలతోటలోకి. ఆ పూలతోట పెంచింది కమలే. తోడు చిన్న చెల్లెలు నిర్మల. ఒక క్రమపద్ధతిలో నాటక పోయినా ఎంతో అందంగా పెరిగిన పూపొదలు. నాకు అందులో చాల పువ్వులు అప్పట్లో అవసరం ఉంటుండేవి. ఆ పూవులు నేను తీసి యెవరికో యిస్తున్నానని కమల బాధయితే బావుణ్ను. ఆ పూలమొక్కల దగ్గరికి రావడానికే హక్కు లేదన్నట్లుగా మాటాడేది. సవతితల్లి దానికి తోడు. అంచేత నామీద ఈసడింపులు, కోపాలు రాలేవి. నాన్నమ్మ యింకా ఘాటుగా తిట్టి, ఆ పూవు అందుకొంటున్న వ్యక్తిని అమాంతంగా యీ తగువుల్లోకి లాక్కొచ్చేది. అలా ఏ తప్పూ యెరగనివారిని వీధుల్లోకి తేవడం సంగతి వేరు. ఈ సంగతి వేరు. నేనెంత



# వనితా వాణి

## సంక్రాంతి సంచిక

ఆంధ్ర సచిత్ర వార పత్రిక 'సంక్రాంతి' సంచిక ఊహించినదానికంటె బాగున్నది. కానీ 'వనితావాణి' శీర్షిక పుస్తకమునందు కనపడనందుకు నేను చాలా విచారించినాను. ఇందుకై పత్రికను క్షమించుటకు వీలుకాదు. అంతకంటె మీరు మాకు కలిగించిన అన్యాయము వేరే కలదా!

పి. తులసమ్మ (కర్నూలు)

* * *

## మధ్యతరగతి మహిళలు

ఎంతోమంది స్త్రీలు ఎన్నో వ్యాసాలు వ్రాశారు. కాని, మధ్యతరగతి స్త్రీలు, ముఖ్యముగా విద్యార్థినులు నేడు సమాజములో ఎదుర్కొంటున్న సమస్యలు గురించి ఎవ్వరూ వ్రాయలేదు. ఆ లోపమును కుమారి రమగారు పూర్తి చేశారు.

కుమారి మా. వెం నిర్మల (బరంపురం)

* * *

ఈ రోజుల్లో ఏ స్త్రీయును మగవారికి తీసిపోదు. అందులో కాలేజి విద్యార్థినుల సంగతి చెప్ప నవసరములేదు. విద్యార్థులకంటె రెండు రెట్లు ఎక్కువగానే ప్రవర్తిస్తున్నారు. రచయిత్రి పూర్వకాల పద్ధతి ననుసరించిరి. కాలంతో ఏకీభవించటం కష్టం.

పల్లూరి సరస్వతి (సోమవరం)

* * *

విద్యార్థులు మధ్య తరగతి మహిళలనేకాదు అంతటిని ఆదేవిధంగా ఏడిపిస్తారు. వారు అది గొప్ప అనుకుంటారేమో! కాలేజీ విద్యార్థులైతేనేమి, బూజు పట్టిన పాత పద్ధతులతోవుండే పెద్దలైతేనేమి, ఉన్నతాశయాలు అలవర్చుకోవాలి. ఈకాలంలో స్త్రీలకు విద్య ఎంతైనా అవసరము. వేడినీళ్ళకు చన్నీళ్ళ తోడన్నట్లు వుంటుంది.

రమణీ మగేశర్మ (విశాఖపట్నం)

* * *

నేటి సమాజములో ఆమె వ్రాసినట్లు మధ్య తరగతి మహిళల అవస్థలు వ్రాయ నలవికావు. చదువుకుంటున్న మధ్య తరగతి మహిళలకు సంఘమే శత్రువు. గొప్పవారి పిల్లలు నైలాను చీరలు కట్టినా రోజు కొక స్టయిలుగా జడలల్లుకున్నా వారి మాట బయటకురాదు. గొప్పింటిపిల్ల ప్రైమరీ క్లాసు పదిమార్లు తప్పినా దాని పెట్టుకోడానికి వెనుకాడరు. దానికి సంఘం కూడా ఎదురాడదు. అదే మధ్య తరగతి మహిళ బి. ఏ. చదివినా దాని పెట్టుకోడానికి భయపడుతుంది. ఒకవేళ ఏ అమ్మాయి అయినా ధైర్యముచేసి పెట్టుకున్నదే అనుకోండి. అప్పుడు చూడాలి ఆ అమ్మాయి అవస్థ. రమగారు వ్రాసినట్లు ఆ అమ్మాయి యెంత అణుకువగా వున్నప్పటికి సంఘము యెన్నో అభూతకల్పనలతో ఆమె మనస్సు విరిచేస్తుంది. లెక్కచేయని అమ్మాయి అయితే పరవాలేదు. ఇలా అనేవారు పల్లెల్లోనే గాదు, పట్టణాలలో గూడా ఉన్నారు. కుమారి రమగారు ధైర్యముగా నేటి సమాజములో మహిళల అవస్థలు విపులీకరించారు.

కుమారి దేవరాజు కళావతి (గుడివాడ)

* * *

ఆడపిల్లలకు ఎప్పటికైనా పెళ్ళిచేసి మరో యింటికి పంపవలసిందే కనుక చదువుకు పెట్టిన సొమ్ము బూడిదలో పోసిన పన్నీరవుతుంది అని అంటూ కుమార్తెలకు చదువు చెప్పిస్తున్న తల్లి తండ్రులను నిరుత్సాహపరచేవారు బంధువులలోను, ఇరుగు పొరుగువారిలోను అనేకమంది వున్నారు. చదువుకునే మహిళలు అందరూ ఉద్యోగాన్ని అపేక్షించేవారని అనుకోవటం పొరపాటు. కొందరు కుటుంబ పరిస్థితులవలన ఉద్యోగం చేయవలసిన అవసరం కలుగవచ్చు. మనం చదువుకున్న చదువుకు పుద్యోగాలు మాత్రమే ముఖ్యమయిన ప్రతిఫలం కాదని నా పుద్దేశము. మగవాళ్ళ విషయంలో మాత్రం వారి చదువునుండి వారు ఆసించినంత ప్రతిఫలం యెంతమంది పొందగలుగుతున్నారు? 'లా' పరీక్ష ప్యాసయిన ఒకరు వేలు ఆర్జించుచుంటే అదే పరీక్ష ప్యాసయిన మరొకరు కాఫీ ఖర్చుకు కూడా సంపాదించలేక బాధపడుతున్నారు. అటువంటప్పుడు ఆడపిల్లలకు చదువు చెప్పించటం బూడిదలో పోసిన పన్నీరు అని అనుకోవడంలోగాని అలా ప్రచారం చేయడములోగాని యేమీ అర్థం లేదు.

లక్ష్మీ మల్లికార్జున్ (విజయవాడ)

* * *

ఈ రోజుల్లో ఈ మహిళలు ఏమి చేసినా తప్పుగానే వుంటుంది. కాస్త కళ్ళకు కాటుక తీర్చి దిద్దితేనే అమ్మో! మాశాపురోయ్ సినిమాలో హీరోయిన్ దిగొచ్చింది, అని వెటకారంగా చూస్తారు. అంతెందుకు మన వయసువాళ్ళూ వున్నారు. ముందు వారేమి చేసినా ఫరవాలేదు. అదే ఎదుటివారు చేస్తే 'ఛీ! ఆ గాజులేమిటి, ఆ సోకులేమిటి, ఆ బొట్టేమిటి అని మన ముందరే ఎవరికో చెప్తారు. ఇవి నేను స్వయంగా విన్న మాటలు.

గమిని విమలా గోపాల్ (విజయవాడ)

* * *

మధ్యతరగతి మహిళల అవస్థల గురించి కుమారి, రమ చాలా బాగా వ్రాశారు. ఈ రోజుల్లో కాలేజీల్లో చదివే ఆడపిల్లల పరిస్థితి చాలా విషమంగా వుంది. అందంగావుంటే ఏడిపిస్తారు. లేకపోయినా ఏడిపిస్తారు. ఫాషన్‌గావుంటే ఏడిపిస్తారు. లేకపోయినా ఏడిపిస్తారు. అందరితో మరుగ్గా మాట్లాడితే, బాటాకులు కట్టి పేర్లు గోడలమీద కెక్కిస్తారు. మాట్లాడకపోతే, మొగవాళ్ళను చూస్తే ముడుచుకుపోతారు అంటారు. ఈ కాలేజీ చదువులు కత్తిమీద సాములా తయారయ్యాయి.

ఆమధ్య మా వాళ్ళ అమ్మాయి పరీక్షలని, నిద్రా, ఆహారాలు మానుకుని చచ్చేట్టు చదువుకుని పరీక్ష వ్రాయటానికి కాలేజికి వెడుతుంటే నో అరడజను మంది స్టూడెంట్స్ వెనకాలపడి నానా గొడవ చేస్తూ వాళ్ళల్లో వాళ్ళు పందెం వేసుకుని ఆ అమ్మాయి జడ పట్టుకుని లాగారుట. దానితో భయంతో అవమానంతో మనస్సంతా పాడుచేసుకుని పరీక్షపాడు చేసి ఏడుస్తూ వచ్చింది యింటికి. ఇల్లా చేసేవాళ్ళు ఏడిపించటం, అవమానించటం ఘనకార్యంగా భావించటానికి వాళ్ళకు సిగ్గుగా వుండదేమో.

కాలేజీలో నానా పాట్లూపడి ఎల్లాగో చదువుకుంటుంటే యింక యింటి దగ్గర యిరుగూ, పొరుగూ అమ్మలక్కలు, వారు అడిగిన దానికి విసుగ్గా వుంటే, లేకపోతే జవాబు చెప్పాలనిపించకో ముభావంగావుంటే, "తనే కదా కాలేజీలో చదువుతున్నానని గర్వం. ఇంతోటి చదువూ, మాలనున్న మన అమ్మ చదువుతోంది ఈ రోజుల్లో" అంటూ మూతి దిరువులూ, ముక్కు విరుపులూ, అక్కడనుండి ఆ అమ్మాయిని గురించి కాలేజీ కుర్రాళ్ళు చేసే గొడవ తెలిస్తే, దానికి చిలవలూ, పలవలూ పెట్టి "ఫలానావారమ్మాయి, యిల్లాగట" అని ప్రచారం మొదలెడతారు. దిన దినగండంగా తయారయ్యాయి వీళ్ళ చదువులు.

కాలేజీల్లో చదివే మహిళల అవస్థల గురించి తమ అనుభవాలు కళ్ళకు కట్టినట్లు, శాస్త్రంగా జరిగేవన్నీ చిత్రించారు కుమారి రమ. ఆమెకి నా ధన్యవాదాలు.

ఎస్. లక్ష్మి (రాజమండ్రి)

* * *

"మా మధ్యతరగతి కుటుంబాలు" అను వ్యాసం బాగానే ఉందిగాని, విషయం హెడ్డింగ్‌కు తగినట్లుగా లేదు. అంతా కాలేజీ విద్యార్థినులు, వారి కష్ట నష్టాలను గురించి వ్రాశారు. రచయిత్రి అనుభవం తక్కువగా ఉన్నట్లుంది. బీదవాళ్ళు చదవలేరు, ధనవంతులు లెక్క చేయరు గాన ప్రభావం అంతా మధ్య తరగతి అమ్మాయిలపైనే పడటం సహజం. మాటి మాటికి 'మా మధ్య తరగతి' అంటూ, అదేదో వింత వస్తువైనట్లుగా వ్రాశారు. రచన బాగుంది.

కె. రూబెన్ (మార్కాపురం)

* * *

పెద్ద పట్నాలలో అటువంటి అవస్థలు లేకపోవడం పొరబాటు. ఇంకా అక్కడే ఎక్కువ జరుగుతాయనే నా అభిప్రాయం. ఒక్క మీ ఊరిలోనే కాదు. ప్రతీ ఊరిలోను వున్న గొడవే ఇది. దారిన పోతూంటే ఒక్కమాటయినా వాళ్ళని అనందే ఉండలేరు. వెంటబడటం పేర్లు పెట్టి పిలవటంలాంటి అసహ్యకరమైన పనులన్నీ చేస్తారు. పిల్లికి చెలగాటం, ఎలుకకు ప్రాణ సంకటంలాగుంటుంది. చదువుకొను సోదరులే ఇలా ప్రవర్తిస్తున్నారు.

ఎదుటివాళ్ళ పిల్లలు కాలేజీలలో చదువుతూంటే ఏం కాలేజీ చదువులమ్మా మగపిల్లలు ఏదో ఒకటి అంటారు. మా అమ్మాయిని యస్. యస్. యల్. సి. తోనే మాన్పించేస్తాం అని కబుర్లు చెప్పి, మరుసటి సంవత్సరమే వాళ్ళ పిల్లల్ని కాలేజీలో చేర్పిస్తారు. అలా ఉంటాయి వాళ్ళ ప్రగల్భాలు.

కె. కల్పన (కాకినాడ)

* * *

వ్యాసం మొదట్లో "అసలే మగవాడికి తలతిక్కగా ఉండే ఈ రోజుల్లో....." అని మొదలు పెట్టడం అసందర్భముగాను, అసభ్యముగాను కనుపిస్తోంది. మిగతా వ్యాసంలో మధ్య తరగతి మహిళల నిజ పరిస్థితులను చక్కగా వర్ణించారు, రచయిత్రి. వ్యాసంలో మరోచోట వ్రాసినట్లు "ఆడవారు మగవారు కలిసి నాటకాలు వేస్తున్న ఈ రోజులలో...." మధ్యతరగతి మగువలు అవస్థపడడం విచారించవలసిన విషయం.

వి. పూర్ణ (న్యూఢిల్లీ)

* * *

వ్యాసం పూర్తిగా చదువుతే ఒక లోపం కొట్టొచ్చినట్లు కనుపిస్తోంది. ఇందు ఆమె వ్రాసిన కష్ట నిష్ఠూరాలు (రచయిత్రి అన్న తరగతులతో సంబంధం లేక), అందరకూ వుండేవే. కాలేజీలలో పురుషులు కేవలం మధ్య తరగతివారినే గేలి చేస్తున్నారనేది నిజంకాదు. అయితే పేద పిల్లలు కాలేజీలలో చదవటం లేదని, ధనికులు కారులలోనే షికార్లు కొడుతూ, ఈ పురుష పుంగవులకు కనుచూపు దూరంలో మాత్రమే వుంటున్నారని అనుకునేవారికి ఈ వ్యాసంలో ఈ లోపం కనుపించక పోవచ్చు. కాలేజీ యువతుల జీవితంలోని కష్ట నిష్ఠూరాలు వ్రాస్తూ ఈ 'తరగతి'తో ముడి పెట్టడం నాకు చాలా హాస్యాస్పదంగా తోచింది. అందుకే ఈమె తన వ్యాసం చివరి భాగంలో ఉద్యోగ, వివాహ విషయాలు వ్రాస్తూ ఈ పై లోటును భర్తీ చేయ ప్రయత్నించారు. కాని లోటు లోటే. వనితనైన నేను సాటి స్త్రీ వ్రాసిన విషయాన్ని ఇలా విమర్శిస్తున్నందుకు మరోలా భావించకండి. రెండు విభిన్న విషయాలను ఒకే త్రాటిపై లాగటం మంచిది కాదునా మాత్రమే నా మనవి.

వి. సత్యవతాంబా వెంకటాప్తు
(అయినవిల్లి)

* * *

"మధ్య తరగతి మహిళల అవస్థలు" అనే వ్యాసం మధ్య తరగతి మహిళలకు సంబంధించినదేకాదు. ఈ వ్యాసానికి ఈ మకుటం బాగాలేదు. దీనినిబట్టి రచయిత్రికి 'అసలు' మధ్య తరగతి మహిళల అవస్థ లేమిటో తెలియటలేదే భావించవలసి వస్తుంది. వ్యాసం వ్రాసేటప్పుడు కలుగులు పెట్టుకోకుండాగానూ, ఉండడం అవసరం.

వనితలకు ప్రత్యేక శీర్షిక ఉన్నది గదా అని పురుషులను దుయ్యబట్టటం మామూలైనది. కనుక యికముందైనను స్త్రీ పురుషులలో యెవరికైనను సలహాలు యివ్వదలచినప్పుడు కొందరికి నచ్చకపోయినా ఎక్కువ మందికి నచ్చేవిధంగా వ్రాయగలరని ఆశిస్తున్నాము.

జి. హెచ్. వళిని (నిడుబ్రోలు)

* * *

## ఆడపిల్లలు—వరకట్నాలు

'విశాఖ'గారు వ్రాసిన 'ఆడపిల్లలూ—కట్నాలూ' అనే వ్యాసంలో ఒక్క విషయం వ్రాయ మరచారు. ఆమె 'ఆడపిల్లలు వివాహం కానప్పుడు పడే అవస్థలు తెల్పుతూ, ఆడపిల్లలకు చదువో, మరేపనైనా చిత్రలేఖనమైనా నేర్పించి వారికి దానిపై మనస్సు లగ్నం అయ్యేటట్లు చేయాలన్నారు. చదువుకుంటున్న కొందరు ఆడపిల్లలు వేష భాషల్లోనూ, తీరు తెన్నుల్లోను సంప్రదాయానికి కట్టుబడి ఉంటారు. కొందరు ఎక్కడలేని టీవితో నల్గురిలో తిరగడం, విదేశ పద్ధతులలో మెలగాలని ఉత్సాహపడటం జరుగుతోంది. అంతేగాక విద్యార్థులతో ప్రణయ కలాపాలు సాగిస్తూంటారు. 'ఆ ఆనందం నీటి బుడగ వంటిదని' గ్రహించరు. ఆ విద్యార్థులు ఆ చదువుకొంటున్న సమయంలోనే వారి ఆనందాలకు వినియోగించి తర్వాత తెగతెంపులు చేస్తారని తెలుసుకోరు. ఇటువంటివి చాలాచోట్ల చూస్తున్నాం. తర్వాత ఆమె కెలాగైనా పెళ్ళి చెయ్యాలనీ, తండ్రి ప్రయత్నిస్తే వీవరుడైనా దొరికితే దానిన్నిటికీ ఒప్పుకొన్నా చివరికి ఏం చదువుకుందని ప్రశ్నించి— పెద్ద చదువు చదివింది అనగానే ఆమె శీలాన్ని శంకించి వివాహాన్ని త్రుణీకరిస్తాడు—అప్పుడామె జీవితం నాశనం అయినట్లేగదా? అందుచేత ఆడ పిల్లలకు చదువుగాని, మరేపనైనా నేర్పినా నష్టమేగాని లాభం లేదని పత్రిక ద్వారా తెల్పుతున్నాను.

ఆర్. ఎస్. వి. జి. మణి (హైదరాబాద్)

* * *

"మీరు కట్నం ఇస్తారా? పుచ్చుకొంటారా? అనే ప్రశ్నలకు జవాబులేదు అని చెప్పుకొనేటంతగా మనవాళ్ళు ముందుకు రాలేదు. నాకు తెలిసిన ఇద్దరు అన్నా చెల్లెళ్ళు వున్నారు. అన్నగారు బి. కాం. వాళ్ళ చెల్లెలు ఇంటర్ చదివారు. వారిద్దరూ పైన మీరు చెప్పిన విధంగానే కట్నం తీసికోము, కట్నం ఇవ్వము అని పట్టుపట్టారు. దానివల్ల వాళ్ళకు 25 సంవత్సరాల వయస్సు వచ్చినా వివాహం కాలేదు.

ఉమ (పీలేరు)

* * *

ప్రభుత్వం వరకట్న నిషేధ చట్టం ప్రవేశపెట్టిన దగ్గరనుంచి కట్నాలు మరీ విపరీతంగా పెరిగిపోయాయి. పూర్వం పెళ్ళి సమయమందు చదివించేవారు. ఇప్పుడు సమయమందు చదివించే (ఈ రోజులలో) పెళ్ళికాకపూర్వం వరకట్నం తీసుకుంటున్నారు. పెళ్ళి అవుతుందా అవదా అని ఆడపిల్ల—వారికి ఒకటే దిగులు.

తోట నాగమణి (గుంటుపల్లి)

★

## ఎప్పుడూ ఇంతే—115

శంకర్



# తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!

# పిల్లలూ - ఆటవస్తువులూ


## కోమలాదేవి


శిశుసంరక్షణ కేంద్రాలలో, ప్రసూతి ఆసుపత్రులలో "పిల్లలకు టీకాలు వేయించండి" "మీ పిల్లలకు క్రొత్త ఆటవస్తువులు కొనివ్వండి" యిత్యాది ప్రకటనలు సచిత్రంగా గోడలమీద వ్రేలాడుతుంటాయి.

యం. పి. లో యిలాంటి ప్రకటనలు సాధారణంగా చూస్తుంటాము.

పిల్లలకు క్రొత్త ఆటవస్తువులు కొనివ్వమని ఒకరు చెప్పాలా ? మనకు తెలియదేమిటి ? అనుకుంటాము. కానీ ఆటవస్తువే కాదు, ఏదైన క్రొత్త వస్తువంటే పిన్నలకూ, పెద్దలకూ చాల యిష్టంగా ఉంటుంది. "క్రొత్తొక వింత .... పాతొక రోత" అన్నట్లు.

పసివారు రెండు సంవత్సరాలలోపున తమతో తామే ఆడుకొంటారు. ఒక వస్తువుతో కొంతసేపాడి దానిపై మోజు తగ్గిపోగానే మరొహ వస్తువును తీసుకుంటారు. ఈవేళ పనికిరాని బొమ్మను రేపు ఆప్యాయంగా తీసుకుంటారు. విన్న ఆడిన బంతిని చూడనైనా చూడరు. చూసి చూసి విసుగుపుట్టి ఉంటుంది. అందుకే క్రొత్తదాని కోసం ప్రాకులాట.

ఆటవస్తువులనగానే బజారులో అమ్మే ఆట వస్తువులని భ్రమపడటం పొరపాటు. పిల్లలు చిన్నవారుగా ఉన్నప్పుడు దారం అయిపోయిన, తరువాత మిగిలే చెక్కరీలు, చిన్న పాత్రసామాన్లు, చెంచాలు, చిన్న భరిణలు, పనికిరాని పుస్తకాలు, ప్లాస్టిక్ సామాన్లు, ప్లాస్టిక్ సంచిలు యింత దూది పెట్టి మూతి దారంతో కట్టి పిల్లల ఎదురుగా వేస్తే యెంత ముచ్చట పడ్తారు. ఆర్థిక స్తోమతలేనివారీ రీ విధంగా పిల్లలను సంతోషపెట్టగలరు.

డబ్బున్నవారు రకరకాల ఆట సామాన్లు కొనగలరు. ఐతే పిల్లలకు యెలాంటి ఆటవస్తువులు కొవాలి ? అని ఆలోచించి కొనేవారు చాలా అరుదు. కళ్ళ కింపుగా అగుపించేది కొనేయటం పరిపాటి. అవి పిల్లల కెంతవరకు సంతృప్తి నిస్తాయని ఆలోచించము.

ప్లాస్టిక్ బొమ్మలు చౌకగా, ఆకర్షణీయంగా ఉంటాయి. పాపకు కొనిస్తాము. మరు క్షణంలో అది తెలియకుండా మనం త్రొక్కేసో, లేక పాపే దాన్ని నేలకేసి కొట్టి యేదోలా పగలగొట్టేస్తుంది. దాంతో విడుపు, అసంతృప్తి, తనివిదీరా ఆడుకున్నది లేదూ, పెట్టింది లేదు. ఒకవేళ ఆ చిన్న ముక్కలు మనం చూడకపోతే వాటిని నోట్లో వేసుకుంటారు, లేదా తెలియక త్రొక్కేస్తారు. లేక పాదాలల్లో దిగబడి .... ఇంతా ఎందుకు, పాపకు ఏ ఉద్దేశంతో కొన్నామో—అది నెరవేరలేదు. దానికి తోడు మనకు పాప కాలును గూర్చి ఆందోళన, లేదా తెగిన పెదిమను గూర్చి చింత.

మెత్తగా ఉన్న వస్తువులంటే సాధారణంగా పిల్లలకు భయం, బెలూన్స్, పాలిదీన్ (మెత్తగా ఉండే ప్లాస్టిక్) బంతులు, రబ్బరు బొమ్మలు, గుడ్డ బొమ్మలు యిలాంటివి. సరదాపడి కొంటాము వారికి భయం అని తెలియగానే వాటిని పిల్లల నించి దూరం చేయుటం ఉత్తమం. కొద్దిగా పెద్దవారు యిదే నందనుకుని తమ్ముళ్లను, చెల్లెండ్రను ఏడ్పిస్తారు. అలా జరుగకుండా చూడాలి. ఏ వస్తువైతే భయకారణమో అది ఎవరికీ అందకుండా జేయాలి. బెలూన్స్ పైగా ఎత్తి కట్టేస్తే పిల్లలు 'దూరం నించి' చూచి ఆనందిస్తారు.

ఇలాంటిదే కీ యిస్తే పరుగెత్తే బొమ్మలు, కార్లు, రైళ్లంటే గూడ ఒక వయస్సులో పిల్లలకు మహా భయం. కీ యిచ్చి వదలగానే అది తిన్నగా అలా వెళ్లిపోవటం, లేదా వారు వెనక్కు జరిగేకొలది మీది మీదికి రావటం ఎంత గాభరాగా కేకలు వేస్తారు. ఇలాంటి వస్తువులు కాస్త పెద్దయ్యాకగానీ కొనగూడదు. చిన్నప్పుడే అలాంటిది కొంటే మనం దగ్గరుండి దాన్ని కీ యిచ్చాక దూరంగా వదలాలి.

ఇంకొకరకం ఆటవస్తువులకు ఇనుపతీగెలు లోపల ఉంటాయి. పై పొర పోగానే యీ తీగ అగుపిస్తుంది. లేదా పాలిథీన్ కారు గానీ, మోటారు కారు గానీ ఉంటే వాటి చక్రాలగుండా యినుప తీగ యిరుసులా ఉంటుంది. ఆ బొమ్మ బాగున్నంతవరకు ఫరవాలేదు. ఒక చక్రం వూడితే బయటి కగుపిస్తున్న యినుపచువ్వ ఎంతో ప్రమాదకరం. పిల్లలకు గుచ్చుకుని సెప్టిక్ కావచ్చు, లేదా గాయం చేయవచ్చు. అందుకని ఒక చక్రం వూడిపోగానే మరొక చక్రం లాగివేసి ఆ యినుపచువ్వను తీసేయటం మంచిది. చిన్నప్పుడు పిల్లలు సమస్తం నోట్లో పెట్టుకుంటారు. ఇలా ఇనుపచువ్వ లుండే వస్తువు లిచ్చేప్పుడు జాగ్రత్తపడాలి.

నోట్లో పెట్టుకుంటారంటే యింకొకటి జ్ఞాపకం వస్తుంది. తిరునాళ్లలో అమ్మే బొమ్మలకు ఘాటుగా, ముతక రంగులు వేస్తారు. వాటిని నోట్లో పెట్టుకోగానే రంగంతా నోటికొతుంది. ఆ రంగు పడక పిల్లలు పాలు కక్కేస్తారు. కొందరికి ఆ రంగు పడదు. ఇలాంటి రంగు ప్రమాదకరం.

ఈమధ్య ప్లాస్టిక్ 'బిల్డింగ్ బ్లాక్స్' అమ్ముతున్నారు. రకరకాల రంగుల్లో వివిధ రకాలలో యీ బ్లాక్స్ ఉంటాయి. వాటిలో ఒక యిల్లు, బ్రిడ్జి, గేటు ఆర్చి యిలా అమర్చవచ్చు. వివిధ రంగుల్లో ఉంటాయి కాబట్టి పిల్లలకు ఆకర్షణీయంగా ఉంటాయి. ఇలాంటి ఆటవస్తువు అన్ని అందాలా మంచిది.

ఎక్కువమంది పిల్లలుండే యింట్లో ఒకే ఆట వస్తువు అందరికీ పనికివచ్చేదిగా ఉండాలి. యీ ప్లాస్టిక్ బ్లాక్స్ అందు కుదాహరణ.

పాపాయి వాటి నెత్తివేస్తూ, నేలకు రాస్తూ ఆడుతుంది. అన్నయ్య వాటితో తనకు చేతనైనన్ని కట్టడాలు కడ్తాడు. (పేచీ రాకుండా చూచే వంతు మనదండోయ్) అలాగే పాలిథీన్ బంతు లొస్తున్నాయి. రంగు రంగుల్లో ఉంటుంది. గాలి వత్తేస్తే పాపాయి చక్కగా ఆడుకుంటుంది. గాలి ఉన్నా భయపడకపోతే గాలి వూది యిస్తే చాలు. అన్నయ్య దాంతో ఫుట్‌బాల్ ఆడుతాడు. ఇలాంటివే ఎన్నో ఉన్నాయి.

నునుపుగా ఉంటే చెక్క ఆటవస్తువులు ఎంతో మంచిది. గిలకలు, వంట సామాను, బొమ్మలతో పిల్లలకేవిధంగానూ హానికరం కాదు. వాటివల్ల పిల్లలు సంపూర్ణానందం పొందుతారు.

వాళ్ల బొమ్మలు పగిలి పాడైపోగానే వారికి దుఃఖం, కోపం, అసంతృప్తి, విసుగు, చికాకు, మొండితనం—వస్తుంటాయి. లేత హృదయాలు యింతటి తీవ్రమైన హేయభావాలకు గురి కావటం మంచిదికాదు. వారిలోని అతి సున్నితమైన భావాలు ఎప్పటికీ దెబ్బతినరాదు.

అందుకే ఒక క్రొత్త ఆటవస్తువు, చాలా కాలం మన్నేదిగా, హానికరం కానిదిగా, సంతృప్తి, ఆనందం చేకూర్చేదిగా ఉండాలి. అప్పుడే పిల్లలకు క్రొత్త ఆటవస్తువు కొనిచ్చామన్నమాట విలువ పెట్టుకోగలము. 

# వ్యాసరచన పోటీ

# నేటి మన సినిమాలు

## మొదటి బహుమతి - రు. 50

## రెండవ బహుమతి - రు. 30

## మూడవ బహుమతి - రు. 20

తెలుగునాట ఇంచుమించు అన్నివర్గాలవారికీ సినిమా 'వినోద, సాంస్కృతిక కాలక్షేపం'గా ఉన్నదంటే అతిశయోక్తికాదేమో! మద్రాసువంటి ఇతరరాష్ట్రాలలో సంగీత సాహిత్యాలను మనకన్నా ఎక్కువగా ప్రోత్సహిస్తూ ఉండటం కూడా మనం గమనిస్తున్నాము.

'సాంస్కృతిక జీవితం'లో ఇంత ప్రాధాన్యం వహిస్తున్న సినిమాలు ప్రజల, ముఖ్యంగా బాలబాలికల, యువజనుల, భావనాగతులపై ప్రభావం చూపిస్తున్నవనటం సత్యదూరంకాదు.

గతంలో మనచిత్రాలు ఇప్పటి వాటికన్నా సంఘసంస్కరణాభిలాషను కలిగించాలని ప్రయత్నించేవనిపిస్తుంది. వితంతు వివాహాలు, కులతత్వ నిర్మూలన మొదలైన సంస్కరణలు ఆధారంగా కథావస్తువులు రూపొందేవి. ఇప్పటి చిత్రాలు సాంకేతికంగా వాటినిమించి ఉన్నత స్థాయిని అందుకున్నాయి. కాని విభిన్న పంథాలలో తయారవుతున్నాయి.

ఈ వైఖరిపైన పాఠకుల అభిప్రాయాలు తెలుసుకునే ఉద్దేశంతో ఈ పోటీ నడుపుతున్నాము. అంతేకాక వారు చేయదలచిన సూచనలు తెలుస్తాయనే ఉద్దేశం కూడా లేకపోలేదు.

తమ అభిప్రాయాలు, సూచనలు వ్యాసరూపంలో పొందుపరుస్తూ 12-2-1962 లోపుగా మా కార్యాలయానికి అందజేయవలసిందిగా పోటీలో పాల్గొనేవారిని కోరుతున్నాము.

● వ్యాసాలు ౫ అరఠావు పేజీలు మించి ఉండరాదు. ● కాగితం ఒక వైపునే వ్రాయాలి. ● కవరు పైన 'నేటి మన సినిమాలు' అని స్పష్టంగా వ్రాసిఉండాలి. ● తుది నిర్ణయం సంపాదకునిదే. దానిపైన ఉత్తరప్రత్యుత్తరాలు జరుపబడవు. ● తిరిగి పంపగోరువారు తగిన తపాలా బిళ్లలు జతపర్చి పంపాలి.

# కవి సార్వభౌముడు

నోరి నరసింహ శాస్త్రి

### జరిగిన కథ

సర్వజ్ఞ చక్రవర్తి బిరుదాంచితుడగు కొండవీటి ప్రభువు పెదకోమటి వేమారెడ్డి శ్రీనాథభట్టును కవిసార్వభౌమ బిరుదు పట్టముతో అలంకరించి, సర్వవిద్యానిలయమైన శ్రీ విద్యానగరమునకు విద్యావిజయ ప్రస్థానము చేయవలసిందని అర్థిస్తాడు. కార్యసిద్ధికై దిగ్గజాలుసూచించిన పౌష్టిక క్రియలు ఆచరించి శ్రీనాథుడు యాత్రకు సంసిద్ధుడవుతాడు. సింగన ప్రధానితోను, వామనభట్ట బాణునితోను ముచ్చటించి, డిండిముని శాస్త్ర పాటవము, లోపాలు తెలుసుకుంటాడు. వేమభూపాలుడు ఆయనకు ఉచితమైన వీడ్కోలు ఇచ్చి పంపుతాడు. విద్యానగరం చేరినతరువాత శ్రీనాథుడు ముమ్మకవి ఆతిథ్యం స్వీకరిస్తాడు. డిండిమభట్టును జయించేందుకే శ్రీనాథుడు వచ్చాడన్న వార్త వ్యాపిస్తుంది. డిండిమునకు ఆవిషయం శిష్యుల ద్వారా తెలిసి, శ్రీనాథుని బెదరగొట్టడానికి, లింగనసోమయాజి క్రతువు చూడేమిటనే యజ్ఞశాలకు వెడతాడు. శ్రీనాథుని వెంట వచ్చినమల్ల బిరుదుపర్వతమల్లుడొక్క శిష్యుడువిద్యానగరమల్ల వీరుడైన విద్యామల్లు శిష్యుని చేతిలో ఓడిపోతాడు. శ్రీనాథుని కవిత్వం దోషభూయిష్టమైందని విద్యానగరంలో ప్రవాదు బయలేరుతుంది. శృంగేరి విరూపాక్ష పీఠాధిపతుల ఆశ్రమంలో అరుణగిరినాథుని పత్నికి, శ్రీనాథుని పత్నికి సఖ్యము ఏర్పడినది. శ్రీనాథుడు మానసోల్లాస కావ్యాన్ని అభిప్రాయార్థం అరుణగిరినాథులకు పంపుతాడు. తాను గూఢచారుడను అనుమానమును పోగొట్టుకొనుటకు శ్రీనాథుడు కటకపాలుని సందర్శించి మెప్పుపొందుతాడు. శ్రీనాథుని ఔషధప్రభావంవల్ల పర్వతమల్లు శిష్యుడు విద్యామల్లు శిష్యుని మల్లయుద్ధంలో ఓడిస్తాడు. శ్రీనాథుడు డిండిములకు మానసోల్లాసకావ్యావహేళనంపై అధిక్షేపణపత్రంపంపుతూ కావ్యదోషాలు పండిత పరిషత్తులో నిరూపించమని డిండిముని సవాలుచేస్తాడు.

డిండిముడిచ్చిన గడువు తీరినది. ప్రత్యుత్తరము రాలేదు. పండితసభ చేయుటకెట్టి ప్రయత్నములును జరుగలేదు. శ్రీనాథునకు జ్యోతిషికులు వాదసభకు శుభమని సూచించిన దినము లాసన్నమగుచున్నవి. అతడిక శీఘ్రముగా వాదసభను ఒక కొలికికి తీసికొని రాదలచెను. గడువు తీరిన మరునాటి యుదయముననే మిత్రులతో సంప్రదించి డిండిమభట్టునకు చివరి పత్రము సిద్ధము చేసెను.

అందులో ముందు పూర్వము జరిగినదంతయు పూసగ్రుచ్చినట్లు వివరింపబడెను. పిమ్మట నిట్లున్నది:

"జరిగినదానినిబట్టి మీరు మా మానసోల్లాసములో ఎట్టి దోషములును చూపజాలరనియు వృథా డిండిమాడంబరములో పండిత కవుల సత్కావ్యములను నిందించుచున్నారనియు ధ్రువపడినది. కావున మేము జయించినట్లు అంగీకార పత్రికతో పాటు మీ కంచు ఢక్కను మా కర్పించుకొనుడు.

"అది సమ్మతముకానియెడల మీ ధిక్కారము పండిత సభలో సమర్థించుకొనుటకు మరియొక

44 పేజీ చూడండి





కార్ట్యూనులు 18

శ్రీ నందమూరి తారక రామారావు
ప్రజల
ఆనందమూరి తారగా నెలకొన్నవారు




దైవజ్ఞపాతూరి శ్రీరామమూర్తి

26-1-1962 శుక్రవారము మొదలు
1-2-1962 గురువారము వరకు

**మేషం :**

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

మీ ఆలోచనలు ఎన్ని రకాలుగా నడచినా చివరకు—మొదటికే రాక తప్పదు. డబ్బు ఇబ్బంది తొలగి మనస్సుకు నెమ్మది లభిస్తుంది. వృత్తిలో మీకు తెలియకుండా ఏదో ఒక సమయంలో చిన్న చిన్న పొరపాట్లు జరుగుతవి. ఎప్పుడూ పని [illegible] కలిసి తిరగవలసి రావచ్చు. ప్రయాణాలు అనుకూలంగా జరుగవు. సోదరులతో కలహ ప్రసంగాలు వస్తవి. కాని వెంటనే సర్దుబాటు చేసుకోగలుగుతారు. వారం రెండవ భాగంలో మీ జాగ్రత్తవల్ల కార్యభారం పెరుగుతుంటా చూసుకొంటారు. కుటుంబ వాతావరణం ఉత్సాహపూరితంగా ఉంటుంది. బంధువుల రాకపోకలు విశేషం. వ్యవహారరంగంలో నెమ్మదిగా మార్పులు కలిగే సమయం. ఎదురుచూస్తున్న వార్తలు [illegible]. 28, 29 లలో వినోద కార్యక్రమాలు, అధికారుల [illegible] [illegible].

* * *

**వృషభం :**

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

దైవబలంవల్ల సంఘంలో మీ మాటను నెగ్గించుకోగలుగుతారు. అయితే ముందు ఖర్చుచేసి తరువాత ఇబ్బందిపడవలసిన అవసరం రాకుండా చూచుకొనండి. వృత్తివ్యాపారాలలో పేరు ప్రతిష్ఠలు బాగుంటవి. మీ ఆలోచనలకు తోడు మంచి మనుష్యుల సహాయం లభిస్తుంది. కుటుంబంలో సుఖసంతోషాలు లభిస్తవి. డబ్బు ఇబ్బందివల్ల ముందుగా అనుకున్న కార్యక్రమాలు వాయిదా వేసుకోవలసి వస్తుంది. ఆరోగ్యం బాగానే ఉంటుంది. ప్రస్తుతం ఇతరుల సమంలో సౌఖ్యం కలిగించుకుందామనే ఆసక్తి బాగా తగ్గుతుంది. ఉత్తరదిక్కు నుంచి నిరుత్సాహం కలిగించే వార్తలు తెలుస్తవి. వారాంతంలో అనుకోకుండా ఆదాయం పెరుగుతుంది. ఈ సమయంలో ఒకరి [illegible] [illegible] గాని, [illegible] గాని నష్టపెట్టుకోకుండా ఉండటం అవసరం. సాహస కార్యాలకు అనుకూల సమయం కాదు. 26, 27 తేదులలో ధర్మకార్యాలు, శుభవార్తలు తెలుస్తవి.

**గ్రహస్థితి**

కర్కాటకంలో రాహువు, మకరంలో సూర్య అంగారక బుధ గురు శుక్ర శని కేతువులు, కన్య తుల వృశ్చిక ధనుస్సులలో చంద్రుడు.

* * *

**మిథునం :**

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ప్రస్తుతం మీ శక్తిని మించి శ్రమచేయవలసి వస్తుంది. సమయంలో ఆదుకొనే మనిషి దొరకక ఇబ్బందిపడతారు. మానసికంగా ఆందోళన అధికం. వృత్తి ఉద్యోగాలలో మీరు అనుకుంటున్న చిక్కులు మెల్లగా తొలగి ఒక విధంగా మనశ్శాంతి లభిస్తుంది. పిల్లల ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి. కుటుంబ ఖర్చులు పెరగటంవల్ల క్రొత్తగా ఏమైనా ప్రారంభిద్దామనుకున్నా ముందుకు సాగదు. ఏ వ్యాపారం వంటి పనిలోనూ ముందుగా మాట ఇయ్యదగిన సమయం కాదు. ప్రయాణ కార్యక్రమాలు సకాలంలోనే అనుకూలిస్తవి. అకస్మాత్తుగా విలువగల వస్తువులు పోగొట్టుకుంటారు. అధికారులతో ప్రసంగించే సందర్భంలో పొరపాట్లు రాగల అవకాశం ఉన్నవి. వృథాఖర్చులు పెరుగుతవి. 30, 31 తేదులలో కుటుంబంలో కలహాలు, వృత్తిలో ప్రయాసలు.

* * *

**కర్కాటకం :**

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

ఇంతకుముందు కలిగిన ఆందోళన తొలగి వ్యవహారరంగంలో సులభ మార్గం లభిస్తుంది. ఎవరు మీకు అనుకూలమైనవారో తెలుసుకుని ముందు ముందు మీరు చేయవలసిన పనులకు చక్కని ప్లాను తయారుచేసుకొన గలుగుతారు. తరచు మీ ఆరోగ్యం లోపిస్తూ ఉంటుంది. అధికారులవద్దనుంచి అనుకూల వార్తలు తెలుస్తవి. ఆదాయం మామూలుగా ఉంటుంది. అయితే మానసికంగా ఉత్సాహవంతమైన సమయం. రాజకీయాలలో మీ మాటను అనుసరించగలవారు లభిస్తారు. సాహస కార్యాలయందు ఆసక్తి అధికమవుతుంది. కుటుంబంలో చిన్న చిన్న విషయాలలో ప్రతికూల వాతావరణం ఏర్పడగల సూచనలున్నవి. అందువల్ల అకస్మాత్తుగా ఖర్చులు పెరుగుతవి. 29, 30 తేదులలో గౌరవప్రాప్తి, శుభవార్తలు, వినోద కార్యక్రమాలు.

* * *

**సింహం :**

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

"దూరపు కొండలు నునుపు" అనే సామెతను గుర్తుపెట్టుకుని ముందుగా లభించిన అవకాశాన్ని వినియోగించుకొనండి. మొదట మనస్సులో కొంత ఆరాటం కలిగినా క్రమక్రమంగా నిగ్రహించుకో గలుగుతారు. గౌరవ ప్రతిష్ఠలు బాగుంటవి. ధనసంబంధమైన ఇబ్బందులు చాలావరకు తొల

[illegible]. [illegible] [illegible] మొదలుపెట్టాలని కొందా మని అనుకున్నా ప్రస్తుతానికి వాయిదా వేసుకొవ వలసి వస్తుంది. ఇతరులకు సిఫార్సు చేయటం వంటి బాధ్యతలు సంపూర్తిగా నెరవేరవు. మీ స్వంత వృత్తివ్యాపారాలలో పోటీ తగ్గి క్రమంగా ఆదాయం పెరుగుతుంది. జ్ఞాపకశక్తి లోపించగల అవకాశా లున్నవి. ప్రత్యేకంగా అనారోగ్యం కను పించదు. కాని సౌఖ్యంగా ఉన్నామనే సంతృప్తి మాత్రం కనుపించదు. 26, 27 తేదులలో దుబారా ఖర్చులు, ఆందోళనకరమైన వార్తలు.

* * *

## కన్య:

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

ఈ సమయంలో ఏ మూలనుంచి ఏ చిక్కు వస్తుందో నవే ఆందోళన కలుగుతూ ఉంటుంది. తీరా ఆలోచిస్తే కారణం ఏమీ ఉండదు. వ్యాపార వ్యవహార రంగాలలో యథాప్రకారం పనులు జరుగుతూ ఉంటవి. మీ బాధ్యతలను జ్ఞాపకం చేస్తూ మిమ్ములను అనుసరించే స్నేహితులు లభిస్తారు. కుటుంబంలో ప్రశాంతంగా ఉంటుంది. విద్యా వినోద గోష్ఠులలో పాల్గొనే అవకాశాలు లభిస్తవి. వ్యవహార రంగంలో తరచూ ఆటంకాలు వస్తూ ఉంటవి. బంధువులవద్దనుంచి శుభవార్తలు తెలుస్తవి. ఒకటి రెండు సందర్భాలలో మీ నిర్ణయాలు తప్పిపోయే అవకాశా లున్నవి. క్రొత్తగా ఏ పని ప్రారంభిద్దా మనుకున్నా మానసికంగా ప్రోత్సాహం కనుపించదు. సంచారము, దేహ శ్రమ అధికంగా ఉంటవి. 28, 29 లలో అకస్మాద్ధనలాభం, శుభకార్యాలు.

* * *

## తుల:

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

ఆర్థికంగా మీ స్థితి పెద్దగా పెరిగినట్లు కనిపించదు. కాని, పదిమందీ మిమ్ములను గురించి గొప్పగా చెప్పుకొనగిన సమయం. ఏపని తల పెట్టినా ముందుగా డబ్బు చేతిలో కనుపించదు. ముఖ్యంగా ఆ సమయానికి ఏదోవిధంగా సమకూర్చుకో గలుగుతారు. సంఘంలో మీ బుద్ధిబలంతో గౌరవం సంపాదించుకొంటారు. ధర్మ కార్యాల యందు పాల్గొంటారు. మీరు మీ క్రిందవారి మీదవదలిన పనులలో అవకతవకలు వచ్చే సూచన లున్నవి. మీవద్ద నుంచి ధనసహాయం కోరేవారిని చల్లగా తప్పించుకొనటం అవసరం. అధికారులతో పరిచయం లభిస్తుంది. సాధారణంగా ఈ సమయంలో ఎక్కువభాగం ఇతరులనిమిత్తం శ్రమ పడవలసి వస్తుంది. వారాంతంలో మంచి మాటలతో మిమ్ములను బోల్తా కొట్టటానికి ప్రయత్నించేవారు ఉంటారు. జాగ్రత్త. 26, 27 లలో కార్య భంగం, వృథా ప్రసంగాలు. సంచారం.

* * *

## వృశ్చికం:

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)

తటస్థంగా పోవలసిన సమయం. వృత్తిలో ఒక అడుగు ముందుకు పోతూ ఉండగానే రెండడుగులు వెనుకకు లాగవలసి వస్తుంది. [illegible] [illegible] ధనవ్యయం అవుతుంది కాని, తగినంత ప్రయోజనం కనుపించదు. పైకిమాత్రం ఆడంబరంగా ఉంటుంది. తరుచు ప్రయాణాలు చేయవలసి వస్తుంది. స్నేహితులు చేసిన సహాయంవల్ల చిన రకు ఏవిధమైన ప్రయోజనము లభించదు. నౌకరులతో కలహాలు వచ్చి వెంటనే సర్దుబాటు అవుతవి. కుటుంబంలోనే నెమ్మది లభిస్తుంది. తలంపని తలంపుగా శుభవార్తలు తెలుస్తవి. మీ బాధ్యతను నలుగురూ పంచుకొనటంవల్ల మనస్సు తేలిక పడుతుంది. ఖర్చులు పెరిగినా పనులు సులభంగా జరుగుతవి. ఎవ్వరితోనూ వృథా ప్రసంగాలకు అవకాశం ఇవ్వవద్దు. 31, 1 తేదులలో సంతోష వార్తలు, ధనాదాయం, పెద్దమనుష్యులతో సంప్రదింపులు.

* * *

## ధనుస్సు:

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

ఇంతకుముందు ఎప్పుడో ఆలోచించిన పనులు ఈ సమయంలో ఒక రూపానికి వస్తవి. కుటుంబంలో తలపెట్టిన శుభకార్యములు నిరాటంకంగా జరుగుతవి. మీరు పెద్దగా చొక్యం పెట్టుకొనక పోయినా వృత్తిలో సాటివారి సహాయంతో మీ బాధ్యతలు చాలాభాగం జరుగుతవి. ఇతరుల ప్రోత్సాహాన్ని నమ్ముకుని క్రొత్తగా పెట్టుబడిపెట్టవలసిన సమయం కాదు. చట్టా వ్యాపారం, లాటరీ వంటి సాహసకార్యాలలో లాభం పొందలేకపోతారు. వృథా వ్యయం అవుతుంది. వ్యవహార విషయాలలో ముందు ముందు అనుకూలతను సాధించగలమనే ధైర్యం తోస్తుంది. వారాంతంలో భాగస్థులతోగాని, నౌకరులతోగాని పేచీలు రాకుండా చూచుకొనండి. ప్రయాణాలు మానుకోవలసి వస్తుంది. 29, 30 లలో స్వల్ప లాభం, నిష్ఠురాలు.

* * *

## మకరం:

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

మీతో కూడాఉండే మనుష్యులే మిమ్ములను నిరుత్సాహపరుస్తూ ఉంటారు. అయితే చివరకు వారివల్లనే మీ పని కావలసివస్తూ ఉంటుంది. మీ సహన స్వభావం వల్లనే ఈ సమయంలో మీ అంతస్థును కాపాడుకొంటారు. మీరు చేయవలసిన పనులను చురుకుగా సాగించవలసిన సమయం. ప్రయాణాలు లాభిస్తవి. దేహశ్రమ అధికం. రకరకాల మనుష్యులకు సమాధానం చెప్పవలసి వస్తుంది. అధికారులు మిమ్ములను ఆదరించే సమయంలో సహాయంచేస్తారు. బంధువుల వద్ద నుంచి అనుకూలవార్తలు తెలుస్తవి. చిల్లర మనుష్యుల మాటలను లెక్కపెట్టకుండా మీ కర్తవ్యాన్ని నెరవేర్చుకో గ లు గు తా రు. ఆదాయంకూడా బాగానే ఉంటుంది. 28, 29 తేదులలో మీ

## [illegible]

బంగారు ధర తేజీలోనే పిలుస్తుంది. వెండి ధర వారం ఆరంభంలో మందీ వచ్చి 29 నుంచి తేజీ అవుతుంది. మిర్చి ధర బాగా పెరగగల అవకాశా లున్నవి. వేరుశనగ నువ్వు ధర వారం చివరలో మందీ వస్తుంది. వేరుశనగ నూనె ధరలో పెద్ద మార్పులు కనుపించవు. ప్రత్తి ధరలో కొద్ది మందీ రావచ్చు. నూలు ధరలో నిలకడ తక్కువ. తరచు హెచ్చు తగ్గులు రాగల సమయం. కందులు ధర తగ్గుతుంది. చింతపండు ధర బాగుంటుంది. షేర్ల మార్కెట్టులో గత వారం కన్నా మందీ రాగల సూచన లున్నవి.

మాటకు విలువ లభిస్తుంది. [illegible], విశేష లాభం.

* * *

## కుంభం:

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

మీ ప్రయత్నలోపం ఉండదు. కాని, అవకాశం వెంటనే కలిసిరాదు. ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా మాట్లాడి మిమ్ములను విసిగిస్తారు. ఎంత డబ్బు వచ్చినా ఖర్చులు ఎదురుచూస్తూ ఉండటం వల్ల మీ ఆలోచనలు కొనసాగే అవకాశాలు ఉండవు. కుటుంబంలోనివారికి అనారోగ్యం చేస్తుంది. సమయంలో నిష్కర్షగా మాట్లాడలేకపోవటంవల్ల అపవాదులను భరించవలసి వస్తుంది. అంతరంగంలో ఎన్ని బాధలున్నా పైకి పెద్దమనిషి తరహా నిలుపుకో గలుగుతారు. వృత్తిలో కార్యభారం తగ్గించుకొనటానికి చూడండి. మాటలలో తొందరపడకుండా ఉండటం అవసరం. గౌరవం నిమిత్తం ఖర్చులను పెంచుకోవద్దు. 28, 29 లలో మంచివారి స్నేహం, శుభకార్యాలు.

* * *

## మీనం:

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

దైవబలం కలసివస్తుంది. మీ డబ్బును క్రొత్త మార్గాలలో వినియోగిస్తారు. పరోపకారం చేస్తారు. లాభసాటి ప్రయాణాలు చేస్తారు. కుటుంబ శుభకార్య బాధ్యతలు ఒక దారికి వస్తవి. వృత్తిలో పాతమనుష్యులతో సంబంధం క్రమంగా తప్పించవలసి వస్తుంది. వ్యవహారాలు పెరుగుతవని అనుకున్న సందర్భాలలో సులభంగా పరిష్కారం కుదిరి ఫలితం చేతికివస్తుంది. పనుల వత్తిడి వల్ల నరములయందు, జీర్ణకోశాలలోను బాధ పడతారు. ప్రోత్సాహదాయకమైన కాలం. సాధ్యమైనంతవరకు గుట్టుగా పనులు జరుపుకొనటానికి చూడండి. వారాంతంలో లెక్కలలో పొరపాట్లు వస్తవి. ముందు అంచనా తెలుసుకోకుండా చేసిన పనులు క్రమంగా తయారు అవుతవి. 26, 27 లలో శుభ సూచనలు, విలాస్ వినోద కార్యక్రమాలు, సంఘంలో గౌరవం. ★



చుట్టూ మోటారుకారులు ఉన్నా నిర్లక్ష్యంగా నడుస్తున్న ఈ సింహం, అప్పుడే చంపిన జీబ్రాని కొంచెంతిని మిగాంతికి ఒక చెట్టుక్రిందకు వెళుతున్నది. సింహం పిల్లలుభోజనం కానిస్తున్నాయి!

# నైరోబీ గేమ్ పార్కు

నైరోబీ బ్రిటిష్ తూర్పుఆఫ్రికాలోని 'కెన్యా' ముఖ్యపట్టణం. సముద్ర మట్టానికి సుమారు అయిదు వేల అడుగుల ఎత్తున ఉన్న ఈఊరు ఇంచుమించు ఒక ఆధునిక పాశ్చాత్య నగరాన్ని పోలి ఉంటుంది. ఎత్తయిన కట్టడాలూ, మోటారుకార్లూ, చల్లటి వాతావరణం ఈ పోలికను బలపరుస్తాయి. (నైరోబీలో భారతదేశం నుంచి వలసవెళ్ళి అక్కడే స్థిరపడిపోయిన వారు చాలామంది కనిపిస్తారు. అందుచేత మనదేశం నుంచి వెళ్ళిన వారికి అంత కొత్తగా కనిపించదు. షాపులపేర్లు చూస్తే బొంబాయిలో ఉన్నామా అనిపిస్తుంది!)



బాబూన్‌కోతులు కారు ఆగగానే దాని చుట్టూ మూగుతాయి. కొన్ని పైకెక్కి మళ్లీ [illegible]

కాని పూలచెట్లు, తారు రోడ్లూ ఎటు చూసినా కనిపించే ఈ ఊరి అంచులలో 'వన్యమృగాలు' విచ్చలవిడిగా తిరిగే ఒకపార్కు ఉంది. దానినే 'నైరోబీ గేమ్ పార్కు' అంటారు. 'జూ'లలో వలెకాక, అడవిజంతువులు ఇక్కడ స్వేచ్ఛగా తిరుగుతూ ఉంటాయి. (ఈ పార్కు చుట్టూ ఒక 'కంచె' ఉంటుందని వేరే చెప్పక్కరలేదు!) అంతేకాక ఒక ఆఫ్రికన్ తెగవారి పల్లెటూరు కూడా లోపలే పర్చారు.

టికెట్టు కొనుక్కున్నవారు కారులో ఈ పార్కుచుట్టూ తిరగవచ్చు. కాని కారు దిగరాదు! జంతువుల కేవిధమయిన తిండి పదార్థాలూ ఇవ్వకూడదు!

అడవి అంటే దట్టమయిన వృక్ష సంపదతో గుబురు గుబురుగా ఉంటుందని పిస్తుంది కాని, ఈ పార్కులో చిన్నపొదలే ఎక్కువగా కనిపిస్తాయి. విపరీతమయిన ఎండ! కొంచెం ఓపికపడ్తే సింహాలు, జిరా



ఈ దృశ్యం నైరోబీ ఎంత ఆధునిక పట్టణమో సూచిస్తుంది. పెట్రోలు, బంకులలో పనిచేసే వారు సాధారణంగా అనుపచ్చని దుస్తులు వేసుకుంటారు.



ఉష్ట్రపక్షి చాలా పెద్దది. దీనినెక్కి స్వారీచేస్తారంటారు. దీని ఈకలు చాలా అందంగా ఉంటాయి, చాలా ఖరీదయినవి.

పులులు, జింకలు మొదలయినవి చూడ గలుగుతాము. సింహాలు కార్లకు బాగా అలవాటుపడి పోయాయి. ఏమాత్రం బెదరవు. మొగసింహాలు అధికంగా కనిపించవు. జీబ్రాలు, 'ఇంపాలా' అనే జింకజాతి మృగాలు కావలసినన్ని చూడవచ్చు. 'బాబూన్' కోతులకు కరువులేదు!

నైరోబీ గేమ్‌పార్కు చాలా చిన్నది. కిన్యాలోనే ఉన్న విక్టోరియా పార్కు కొన్నివందల చదరపు మైళ్లు ఉంటుందని ప్రతీతి. వీటిని చూసేందుకని ఎందరో 'టూరిస్టు'లు వస్తారు. మన దేశంలో కూడా ఇటువంటి పార్కులు మరి కొన్ని ఏర్పరిస్తే బాగుంటుంది.



విమానంలో నైరోబీలోకి దిగుతూ ఉండగానే ఇవి మందలు మందలుగా తిరుగుతూ ఉండటం చూడవచ్చు. విమానాలమోతకి ఇవి బెదిరి పరిగెత్తుతూ ఉంటే వింతగా ఉంటుంది.

# డాక్టర్ రాజు

బొమ్మలకథ

దేవిక 1























# హాస్య సమాహారం



### మా తథాకా!

మందారచెట్టు ప్రక్కన
మల్లె పందిరి క్రింద
మడత మంచముమీద
ముఖమల్ పరపుపైన
మనసైన మగువ
మంజులగానంతో
మన్మథ దృక్కులతో
మురిపుగొల్పే చూపులతో
మృదువైన హాస్తాలతో
మధురపానీయాలు యిస్తుంటే
ముదవతి వదనం
ముచ్చటగా ముద్దొస్తుంటే
ముప్పిరిగొన్న ఆనందాన్ని
మకరందంలా
మందంగా అందిస్తుంటే
మలయమారుతం వీస్తుంటే
మానిని మందహాసంతో
మత్తుగా మైమరపింపచేసేలా
మేము అడిగినవన్ని
మాకిస్తే
మనుచరిత్ర రచయితలా
మల్లనాని పెద్దనలా
మేమూ రాస్తాం—

శ్యామ్ (ఏలూరు)

*    *    *

### తాండవం

పదండి ముందుకు పదండి తోసుకు
పదండి పోదాం పైపైకి
కనపడలేదా వెలిగినదీపం
వినపడలేదా విలయతాండవం
బుకింగుదగ్గర భుజానకెక్కే
బ్లాకుమార్కెటోళ్లు కనపడలేదా.

వేణుగోపాలం (సామర్లకోట)

ప్రక్కింటాయన—
సుందరమ్మగారూ!.. పోపు మాడిపోతూంది. అర్జంటుగా కొస్త కరేపాకు...........

ఎవరూ!..ఆ... ?!!!
ఆ... మీరూ ఎప్పుడూ ఇంతేనన్నమాట.

సత్యమూర్తి

పెప్పు బాత్‌రూంలో చేస్తున్న కొంటే?" అని అడిగాడు.

పాపుడి అమాయకత్వం చూసి మల్లికార్జునరావు కోపం పారిపోయింది. ఐన్‌స్టీన్ సైన్సు కుర్రవాడికి కూడికలు చెప్పే పద్ధతిలో

అంతే! ఏమాత్రం జంత్రలుంటారు. సంగీతజ్ఞాన మనలే వుండదు. పాట పాడినా పాట అని గ్రహించుకోలేరు!"

మంచంమీద కూర్చొని బాబ్జీ ఆశ్చర్యంగా "అయితే నువ్వు ఇప్పుడు పాట పాడావా?" అనడిగాడు.

అతడి అభిప్రాయం.

"ఇంత పొద్దున్నే పాడడమెందుకూ?" అనడిగాడు అజ్ఞాని బాబ్జీ.

"సాధన చేస్తున్నానురా! కృషితో నాస్తి దుర్భిక్షం అన్నారు కదా!"



అన్నాడు: "పెరటిని అడుగుతావేమిటోయ్ బడుద్ధాయ్! ఆమాత్రం తెలుసుకోలేవూ! పాటోయ్, పాట. పాట సాధన చేస్తున్నాను. కంఠం బాగా తిరగడంకోసం తప్పెట కుండని పట్టుకొని ఆలాపన ప్రాక్టీసు చేస్తున్నాను" లోలోపలే స్వగతంగా అనుకున్నాడు: "కొంతమంది

"అవును. పాట. గాత్రం. వోకల్ అని కూడా అంటారు" అన్నాడు మల్లికార్జునం మిత్రుడికి సంగీతజ్ఞానం కలిగించాలని దీక్ష వహించినవాడై. ఏదైనా విషయం గురించి తెలుసుకుంటున్నప్పుడు దాన్ని గురించి సంపూర్ణజ్ఞానం కలిగించుకోవాలి

"రేడియోలో పాడాలనుకుంటున్నావేమిటి?"

"అంతకంటె గొప్పపనే చేయదలచుకుంటున్నానోయ్!"

"ఏమిటది?"

"హృదయాల్ని కరిగించేయ్యాలి. రాతిలాగుండే

కుంజెని కుంచుముక్కలా కరిగింజేయ్యాలి. అంటుకే ఈ సాధన. బైజాబావ్‌లా పాటపాడి పాషాణహృదయాన్ని నవనీతంగా మార్చివేస్తాను'' అన్నాడు ఆవేశంతో మల్లికార్జునరావు.

దుప్పటి కప్పుకుంటూ, "నాకేం అర్థంకాలా'' అన్నాడు బాబ్జీ. మల్లిక్ కాసేపు ఆలోచించి, "ఓ రహస్యం చెబుతా దాస్తావా?'' అనడిగాడు.

"ఏం ఫరవాలేదు చెప్పు. మొన్ననే సి. ఐ. డి. ఉద్యోగానికి అప్లయి చేశాను'' అని భరోసా యిచ్చాడు బాబ్జీ.

మల్లికార్జునరావు గొంతు సర్దుకున్నాడు. కాసేపు తటపటాయించి, తల వంచుకుని, "మన క్లాస్మేటు కల్పవల్లిలేదూ! ఆమెని ప్రేమించానోయ్!'' అన్నాడు.

బాబ్జీ ఉలిక్కిపడ్డాడు. "బాబోయ్! మగరాయుళ్లా వుంటుందే ఆ కల్పవల్లినేనా?'' అని అడిగాడు.

"అవును'' అని ఒప్పుకున్నాడు మల్లికార్జునరావు.

తెలిసిన విషయాన్ని ఆధారం చేసుకొని, తెలియని విషయాన్ని బోధించమని సువిఖ్యాతులైన ఆచార్యవర్యులు సెలవిచ్చి వున్నారు. పూర్వగాథ తెలునుకోవడం మన కిక్కడ కొంత అవసరం గనక, మనం కూడా ఈ తెలియని విషయాలు తెలుసుకుందాం.

సృష్టిలోని జీవకోటిని శాస్త్రవేత్తలు రెండు విభాగాలు చేశారు. అకశేరుకములు లేక వెన్నెముకలేని జీవులు అని ఒక జాతి, సకశేరుకములు లేక వెన్నెముక గల జీవులు అని మరొక జాతిన్నీ. ఈ రెండు జాతులలో బాబ్జీ, మల్లికార్జునరావు అనబడే వారిద్దరూ సకశేరుకజాతికి చెందారన్న విషయం వారికి కూడా తెలుసు. దానికి కారణమేమంటే వీరిద్దరూ జంతు శాస్త్రం ప్రధానంగాగల కాలేజీ తరగతిలో చదువుతుండడమే. అంటే అర్థం వీరిద్దరూ బీయస్సీ జూ ఆలజీ మెయిన్‌తో చదువుతున్నారు అని. కానీ ఇద్దరబ్బాయిలు "కలకాలం బీయస్సీ చదివేసి హాయిగా వుందాం'' అనుకుంటే అది సాధ్యం కాని పని అని మనకి తెలుసు.మల్లికార్జునం అనే వాడి హృదయంలో ప్రేమ తాలూకు దావానలం అప్పుడే రాజుకుంది. బామ్మచేత "ఒసేవ్ కల్పకం!''అనీ, ప్రియ స్నేహితురాండ్రచేత "వల్లీ!'' అనీ గోముగా పిలిపించుకునే ఓ లావణ్యవతి అతడి క్లాస్మేటు కావడమే అందుకు కారణం. ఈమె ఎల్లప్పుడూ పసందైన పంజాబీ దుస్తులనే ధరిస్తుంది. చక్కని "మువరి'' వల్లెవాటు వేసుకొని ధాటీగా తిరిగేస్తుంది. ఎవ్వర్నీ కాస్తయినా లెక్కచేయదు. అంచేతే అందరూ ఆమె పొడంటేనే హడలైపోతారు. (షరా :— నల్లులు అకశేరుకజాతికి చెందినవి. వాని విషయం ఇటుపైన వివరింపబడును.)

బాబ్జీ అందుకనే మల్లికార్జునం మాటలకి ఆశ్చర్యపోయి అన్నాడు: "మగరాయుళ్లావుండే కల్పవల్లిని పాట పాడి రంజింపజేదా మనుకుంటున్నావా? అది అసాధ్యమని తెలుసుకో!''

మల్లికార్జునరావు తేలికగా కొట్టి పారేస్తూ, "నీకేం తెలుసోయ్ గాత్ర మహాత్మ్యం?'' 'రాగ భావమున పశువులు శిశువులు, పాములు పరవశమ్మైపోతా' యని ఒక ఆంధ్ర సిక్కురులో చెప్పారు. కంఠం విప్పి ఒక్క ఆలాపన అలా చేశావంటే బాబు, మంత్రిం

# మత్కా కౌ లా...

చిన పాముల్లా అందరూ నావెంట పడరూ!''అన్నాడు.

"మంత్రించిన పాముల సంగతి నాకు తెలీదు గాని, ఒక్క ఆలాపన చేశావంటే అందరూ కర్ర లొస్తే నీ వెంటపడతారనేది ఖాయం.''

మిత్రుడు తన గాన పాటవాన్ని శంకిస్తున్నాడని గ్రహించినవాడై మల్లికార్జునరావు అన్నాడు: "చూస్తావుగదూ! నవ్విన నాపచేనే పండుతుందట.''

"పోనీ ఆ సంగతి వదిలేయ్! వాళ్ళనాన్న పెద్ద జమీందార్ల ఫాయాలోవాడట. అసలు వల్లి నీకేసి కన్నెత్తి అయినా చూస్తుందా అని నా అనుమానం'' అని మరొక సందేహాన్ని బయటపెట్టాడు బాబ్జీ.

"గాన ప్రపంచంలో ధనమనే ప్రశ్నకి తావు లేదు'' అనే మహత్తర సత్యాన్ని వాక్రుచ్చాడు మల్లిక్.

"సరే! ఆ సంగతీ వదిలేద్దాం. అసలయిన విషయం

---

తనపుట్టిన రోజు పండగకు గుర్రంకొని పెట్టమని ఒక పిల్లవాడు తండ్రిని వేధించుకు తిన్నాడు. అతడు ఒక కొయ్య గుర్రంకొని వాడికిచ్చాడు. కుర్రవాడు దాన్ని ఎగాదిగాచూచి ఒక్కతన్ను తన్నాడు.

'దానికేమైందిరా బాబు! ఎందుకలా తన్నావు' అంటూ తండ్రి వాణ్ణి సమాధాన పరచడానికి ప్రయత్నించాడు.

ఏమైందా! ఆగుర్రం నాకస్సల్ బాగుల్లేదు. నాకు నిజం గుర్రం కావాలి' అని ఉరుముతూ వాడు రాగం లంకించుకున్నాడు.

ఆర్. ఎస్. ప్రసాద్ (విజయవాడ)

---

ఇంకొహటుంది. నీకేవీ దాని సంగతి తెలీదనుకుంటా. పాపం, నిన్ను చూస్తోంటే జాలేస్తోంది. నిజానికి నాగుండె చెరువైపోతోంది. నువ్వా అమాయకుడివి. ఏంజేయను?'' అన్నాడు బాబ్జీ చేతులు పిండేసుకుంటూ.

"ఏవిటా సంగతి?'' అనడిగాడు మల్లిక్.

బాబ్జీ పాట నందుకున్నాడు:

"వినరోరి వినరా మల్లికార్జునావల్లి గాథ నేడూ
హృదయమట్టులే వ్రయ్యవ్రయ్యలా ఇది
వినాగానోయీ!!''

మల్లిక్ వినుక్కుని, "ఒరేయ్ చాలించు! త్వరగా అసలు సంగతి చెప్పకపోయావంటే నీ పీవు వ్రయ్యవ్రయ్యలు చేసేస్తాను'' అన్నాడు.

"ఏమని చెప్పేదిరా? నరసింహం అనేవాడు లేడూ ఇటూమిక్స్ విద్యార్థి. నీ ప్రేమ లోకానికి వాడేనా కంటకం. నీ అనురాగకుసుమ మొగలిపొదలో నాగుబాము వాడే. నీ చేతిలోని పండు నెత్తుకు పోవడానికి గద్దలా కూర్చున్నాడు'' ఈ మాటలకి మల్లిక్ అడ్డు రాకపోతే జీవశాస్త్రంలోని ఇతర జంతువులతో కూడా నరసింహాన్ని పోల్చివుండేవాడే. కాని బాబ్జీ మాటలకి అడ్డొస్తూ, మల్లిక్ "నీవు చెప్పేదేవిటో నాకేం అర్థం కాలా!'' అన్నాడు.

"అర్థమంటావేమిట్రా!! వెర్రినాయనా! ఆ నరసింహంగాడు కూడా కల్పవల్లిని మెప్పించాలని చూస్తున్నాడు. ఈమధ్యనే వాడేవిటో కసరత్తు కూడా చేస్తున్నాడని విన్నాను.''

"చేస్తే చేసుకోనీ! ఎవడిగోల వాడిది.''

"అలా అనుకుని వూరుకున్నావంటే నీకంటే వాడే మెరుగైన పరిస్థితిలో వుంటాడు. కీ లెరిగి వాత అన్నారు పెద్దలు. వల్లికేది యిష్టమో ముందు తెలుసుకుని, అనక అవిణ్ణి ఆకర్షించడానికి ప్రయత్నించాలి. నీ విలా గుడ్డిగా ప్రయత్నించావంటే మోసపోతావ్!'' అని బాబ్జీ మిత్రుడికి హెచ్చరిక చేశాడు.

"చాల్లేవోయ్! నీ బోడి సలహా! అడిగినప్పుడు ఇద్దువుగానిలే. ఇప్పటికి నీ దగ్గరే అట్టేపెట్టుకో!''

"సరి! పెట్టుకుంటాలే గానీ ఇదొక్క సాయం చెయి!''

"ఏవిటది?''

"నువ్విలా రాగం తీయడం మానెయ్. ఒక పాట నేర్చుకో. కాస్తయినా బాగుపడతావ్.''

"అంటే?''

"నే చెప్పినట్టు చేయి. ఆకలికి స్పెషల్ దోసెని అందిద్దాం. మీద అరగజం కాఫీని ఒంపేద్దాం. అప్పుడు చెబుతా పద'' అన్నాడు బాబ్జీ టాయిలెట్‌కి ఉపక్రమిస్తూ.

హొటల్లో సెర్వరు చెప్పిన పాఠం విని, "రెండు స్పెషల్ మసాలా!'' అన్నాడు బాబ్జీ.

"దో.......సా.......శేయ్'' అనరిచాడు సెర్వరు.

అదయ్యాక, "రెండు లైట్లు'' అని ఆర్డరిచ్చాడు.

"ఏవిటిసార్?'' అనడిగాడు సెర్వరు.

"రెండు లైట్లయ్యా!'' అని లీవిగా చేయి ఊపాడు బాబ్జీ.

"క్షమించండి సార్! లైట్లిక్కడ దొరకవు. ఇది హొటల్. మీకు లైట్లు కావాలంటే ఎలక్ట్రికల్ షాప్‌కిగాని........''

"నన్ను అపార్థం చేసుకున్నావు నువ్వు. లైట్లంటే లైట్ కాఫీలని నా ఉద్దేశ్యం'' అని వివరించాడు బాబ్జీ. సెర్వరు ఈసారి అర్థం చేసుకున్నట్టు తల వంకించి, తప్పుగా అర్థం చేసుకున్నందుకు విచారిస్తున్న భావం కళ్ళలో స్ఫురింపజేసి వెళ్ళిపోయాడు.

సేవనంఅయి బయటికొచ్చాక బాబ్జీ మెయిన్ రోడ్డమ్మట దారి తీశాడు. "ఇలా మట్టేమ్మన్నా వెక్కడికిరా?'' అనడిగాడు మల్లిక్.

"లోకేశ్వరరావు దగ్గరికి''

"మీ లోకేశ్వరరావు దగ్గిరకా? ఎందుకూ?''

"అబ్బబ్బ! నీ ప్రశ్నలతో నా ప్రాణాలు తోడేస్తున్నావు. వినయితే, నీవు వల్లి యింటికెళ్ళి నీ సంగీత పాటవం ప్రదర్శించదలచుకుంటే, నీ వొక పాట పాడాలిగాని రాగాలాపన చేయకూడదు. అలా పన చేశావంటే వల్లి హృదయుం హరించడం

అటువంటి వాళ్ళ బొమ్మలే "హిట్" అవుతున్నాయ్. కాబట్టి ఓ పాట నేర్చుకో."

"సరేలే! దానికి లోకేశ్వరరావు దగ్గిర కెళ్ళడ మెందుకూ?"

"వాడిచేత ఓ పాట రాయించుకుందాం. నాకు తెలిసిన సంగీతం మాస్టా రొక డున్నాడు. అతడిచేత రాగం కట్టిద్దాం. దాన్ని నేర్చుకుని నువ్వు పాడు. మనకి ఇమిటేషన్ సరుకు గిట్టదు. అంతా కొత్తగా వుండాలి. ఒక్క చరణం వినేసరికి కల్పవల్లి కరిగి నీరైపోవాలి"

"ఈ లోకేశ్వరరావు పాటలు రాస్తాడేవిటి?"

"హారి! ఇదా వాడి గురించి నీకు తెలిసింది. వాడు ఇప్పుడప్పుడే రెండు కావ్యాలు రాసేశాడు. అద్భుతమైన కావ్యరాజాలనుకో! వెనక వాడికి చాలా భవిష్యత్తుంది."

"అయినా మనకింత కష్టమెందుకు లెద్దూ. హాయిగా సినిమా పాటలున్నాయిగా. "పోదువో ప్రియతమా!" అనేది పాడేస్తాను. అది నాకు బాగా వచ్చు కూడాను."

"ఛ, నోరుముయ్యరా!"

"పోనీ 'నగుబాటుకదా' అనేది పాడేస్తానో........?"

బాబ్జి గుడ్లురిమాడు. "ముందు నీ నోరు మూసేసి వెంటరా!" అన్నాడు తీక్షణంగా. మల్లిక్ పిల్లిలా కదనేశాడు. ఇద్దరూ లోకేశ్వరరావు గది కొచ్చారు.

కుర్చీలో కూర్చొని "నమస్తే లోకేశ్వర్" అన్నాడు బాబ్జి.

పుస్తకంలోంచి తల ఎత్తి, "నమోస్తుతే" అని జవాబిచ్చాడు లోకేశ్వర్. మల్లికార్జునం మంచంమీద చోటు చేసుకున్నాడు.

"ఏవిటో బిజీగా వున్నట్టున్నావే" అనడిగాడు బాబ్జి లోకేశ్వరరావుని.

"ఏం బిజీలే! గ్రామీణ వాతావరణంలో ఓ కావ్యం వ్రాస్తున్నానంతే!" అన్నాడు లోకేశ్వర్ తెలివిగా చిరునవ్వు నవ్వుతూ.

బాబ్జి ఉత్సాహంతో "అబ్బో! కావ్యమే! కృత్యాద్యవస్థ అయిపోయిందా?" అని ప్రశ్నించాడు.

"అబ్బే! మనకలాటి అవస్థలేం లేవు బ్రదర్! నిఘంటువులో మాటలు వెతుక్కోవడమే పెద్ద అవస్థ అయిపోయింది!" అని జవాబిచ్చాడు లోకేశ్వర్ చేతులు చాచి ఆవులిస్తూ.

"ఆహా! ఏదో సర్దాకి అంటున్నావులే! తెలీకడుగుతాను! కావ్యాలు ఇందరు రాసేస్తున్నారు కదా! అలా అందరూ రాసెయ్యొచ్చంటావా?"

"అలా రాయకూడదోయ్! నాన్ ఋషిః కురుతే కావ్యమ్ అని ఒక లోకోక్తి వుంది. అంటే ఋషులు కానివాళ్ళు కావ్యాలు రాయాలన్నమాట. అందుకే నేనూ ఒకటి రాస్తున్నాను."

"సరే! ఆ గొడవలావుంచు. ఇదుగో వీడు నా మిత్రుడు. మల్లికార్జునరావని గొప్ప గాయకుడు" అని బాబ్జి మల్లిక్‌ని పరిచయం చేశాడు.

"నమస్తే"—అన్నాడు లోకేశ్వర్.

"నమస్కారమండి" అన్నాడు మల్లిక్ బిడియపడుతూ.

"మావాడు నీ దగ్గరకో పనిమీద వొచ్చాడు. కొద్ది రోజుల్లో వీడు టవున్‌హాల్లో ఒక పాట కచేరీ చేయబోతున్నాడు. నీవు ఒక పాటరాసిస్తే దానికి మెట్లు కట్టి పాడదామనుకుంటున్నాడు" అన్నాడు బాబ్జి.

"బెస్! యింకేం! అయితే చెబుతా రాసుకోండి!" అన్నాడు లోకేశ్వర్. వాలుకుర్చీలో జేరగిలబడి కళ్ళు మూసుకున్నాడు. బాబ్జి కాయితమూ, కలమూ తెచ్చుకున్నాడు.

"చెప్పనా?" అని అడిగాడు లోకేశ్వర్.

"ఊఁ!"

"దూరాన తీరాలు నేస్తం, ఎలుగెత్తి పిలచినా లేవోయి......"

బాబ్జి మధ్యలో అడ్డు తగిలాడు: "ఈ దూర తీరాలొద్దు. మంచి ప్రేమ గీతిక కావాలి!"

"ప్రేమ గీతికా. సరే రాసుకో. "విలాసాల తేలించు నెరజాణవే......"

బాబ్జి మళ్ళీ అడ్డొచ్చాడు. "అబ్బే! అబ్బే! ఇంత తేలికకాదు. ఉదాత్తంగా వుండాలి!"

"మరి ముందన్నగానే అలా చెప్పరాదూ! రాసుకో!

రాణీ ఆడవే!  
చలిత మరుత్ కల్లోల వాహిని  
తరగలపై రాయంచరీతిగా  
నీలాకాశపు వేదికపై బంగరు కాంతుల  
చాందినిలో మొయిలు కన్నెలను కూడి  
ఆడుచు, నడయాడెడి నా శశిరేఖవుగా!!

బావుందా?"

"బావుంది కాని ఆ చలిత మరుత్....అనేది కాస్త తప్పుగా వున్నట్టుందోయ్!" అనుమానంగా అన్నాడు బాబ్జి.

"నీకు తెలీదులే! అసలు కవిత్వంలో తప్పనేదే లేదు" అన్నాడు లోకేశ్వరరావు.

"నీవు ఆ మాట అన్నావు. నేను పూర్తిగా సంతృప్తి చెందాను. పాట చెప్పినందుకు థాంక్సోయ్.

"నా కెటాల్ బోయ్. మరో నాలుగు లైన్లు చెబుతా కావలిస్తే!"

"ఇప్పటికింత చాల్లే. వస్తామా!"

"అలాగే"

* * *

కొద్ది రోజుల తర్వాత—

సాయంకాలమైంది. హాలీవుడ్ పంచ రంగుల చిత్రాల్లాగా వీధులు వన్నెచిన్నెలతో తళుక్కుని మెరుస్తున్నై. అందరూ ఉషారుగా ఎవరి దారిన వారు వెడుతున్నారు. కొందరు ఈ భూమి తమ సొంత ఆస్తి నన్నట్టు గర్వంగా, ఠీవిగా వెడుతున్నారు. మరికొందరు తమకేసే అందరూ చూస్తున్నారన్నట్టు విలాసంగా, వయ్యారంగా వెడుతున్నారు. కానీ మల్లికార్జునరావు మాత్రం దీర్ఘంగా ఆలోచిస్తూ పార్కువంకకి నడుస్తున్నాడు. సాయంత్రం వేళ ఒక్కటే అతడికి ముఖ్యమైనది. పార్కులో ఏకాంతప్రదేశంలో కూర్చొని తన పాటని సాధన చేస్తాడు. తలకి దెబ్బ తగిలిన దగ్గర్నించీ హాస్టల్లోని గదిలో సాధనం చెయ్యడం మానేశాడు. కొద్ది రోజుల్లోనే కల్పవల్లిని ఆమె గృహంలోనే సందర్శించి, లోకేశ్వర్ రాసిచ్చిన పాట పాడేసి, ఆమెని మెప్పించాలని అతడి సంకల్పం.

"ఒరే మల్లిక్, ఇలారా!" అనే కేకలు వినిపించి వెనక్కి తిరిగి చూశాడు. వాళ్ళ క్లాసుమేటు ఒకడు పిలుస్తున్నాడు. మల్లికార్జునరావు దగ్గరికొచ్చాక "ఒరే చూశావ్రటోయ్! ఇవాళేం జరిగిందో!" అన్నాడు.

"ఏం జరిగింది?" అనడిగాడు మల్లిక్ నిర్లిప్తంగా. అంటార్కిటికా అమాంతం కరిగి నీరైపోయింది అంటే "ఓ హో! అలాగా!" అనేవాడు అంతే నిర్లిప్తతతో.

"సంగతేమిటంటే విమలనే అమ్మాయుంది చూశావూ. కల్పవల్లి కూర్చొనే బెంచిలోనే చివర్న కూర్చుంటుందే, ఆ అమ్మాయే! ఈరోజు ఆమెకో మొదటి రకం విట్టు చెప్పేశానోయ్! నవ్వలేక చచ్చిందనుకో!" అన్నాడు ఖుషీరాంలాగా.

"ఓహో! అలాగా!" అన్నాడు మల్లికార్జునరావు.

"సాయంత్రం అలా మాటాడుకుంటూ వస్తున్నాం. ఏవిటో పల్లెటూళ్ళ గురించి విషయమొచ్చింది. వెంటనే నా కొక జోక్ జ్ఞాపకమొచ్చింది. అది చెప్పేశాను. ఏం జోక్ అంటావేమో. పేరయ్య, వీరయ్య అనే ఇద్దరు అతి తెలివిమంతులైన అన్నదమ్ము లున్నార్ట. ఒకరోజిద్దరూ చేను కావలా కెళ్ళారట. చలికాలం కాబట్టి ఓ లావుపాటి దుప్పటిని వెంట పట్టికెళ్ళార్ట. మంచెమీద ఇద్దరూ దుప్పటి కప్పుకుని పడుకోబోతోంటే చిన్నవాడు వీరయ్య "అన్నయ్యా! నాకు దుప్పటి చాలట్లేదు" అన్నాట్ట. అది విని పేరయ్య ఆశ్చర్యంతో, "చూశావ్రా తమ్మయ్యా! ఇంత పెద్ద దుప్పటయినా మనిద్దరికీ సరిపోవట్లేదు. నావేపు వూరికే బోల్డు మిగిలిపోతోంది కాని నీవేపు చాలడమేలేదు" అన్నాట్ట. ఈ జోక్ చెప్పేసేసరికి విమల ఎంతలా నవ్వేసిందనుకున్నావు!" అన్నాడు.

మనసులో అగ్నిపర్వతాలు బ్రద్దలవుతున్నా బయటికి నవ్వగలిగినవాడే ధీరుడు అన్నాడొక వేదాంతి. ఆ లెక్కన మల్లికార్జునరావు ధీరుడే. కోపాన్ని లోపలే అణచుకొని బయటి కెలాగో నవ్వేశాడు. వాడి స్నేహితుడు ఇక వాణ్ణి వదిలేసి మరెవర్నో పిలుస్తున్నాడు. "ఒరే అప్పారావ్! ఇది విన్నావా?" అంటున్నాడు.

మల్లికార్జునం వెంటనే వాడి ప్రక్కనించి తొలగిపోయాడు. మనసులో వాణ్ణి అసహ్యించుకున్నాడు కూడా. వారెవా! ఏం గొప్ప! నాలుగురోడ్ల దగ్గర బైఠాయించి యీ వూసు అందరికీ చెప్పాలి గావోను. ఇంతకంటె బాజాపెట్టి వాడ వాడా ప్రచారం చేయరాదూ! లోకమంతా విని సంతోషిస్తుంది కదా!

మల్లిక్‌కి నూరు మెగాటన్నుల కోప మొచ్చింది. సరిగ్గా అదే అదను కనిపెట్టి రోడ్డుమీద వో రాయి పుటుక్కున కాలికి తగిలింది. "అబ్బా!" అని బాధగా అరచి కాలివేలిని రుద్దుకున్నాడు. ఆ బాధలోనే అతడికొక అభిప్రాయం తోచింది. అమ్మాయిలకి జోక్ చెబితే తప్పేవిటి? కొద్ది రోజుల్లో తను వల్లిని కలుసుకోబోతున్నాడు గదా! అప్పుడు ఈ జోక్ చెబితే ఆమె సంతోషిస్తుంది. భేష్! ఇదీ ఒక రకమైన మంచి ఆలోచనే అనుకున్నాడు మల్లిక్ ఆనందంతో.

విజయోత్సాహం ఒక టానిక్కు వంటిది. ఈ భావం మనసులో మెదలడంతో అత డెంతో కోలుకున్నాడు. హర్షామోదాలు మదిలో పులకలెత్తగా, రెట్టింపు వేగంతో నడక సాగించాడు.

మరొక నాలుగు రోడ్ల కూడలి వచ్చింది. అక్కడ జనసందోహాన్ని తిలకిస్తూ రాజారావు నిలబడి ఉన్నాడు. మల్లికార్జునరావు వాణ్ణి చూసి

# మత్తు కాలూ...

సర్దాగా "ఏమిట్రోయ్, రాజారావ్! ఏవిటి కథ?" అని అడిగేశాడు.

"ఫ్రెంచి విప్లవం పద్దెనిమిదో శతాబ్దంలో జరిగింది!" అన్నాడు రాజారావు నవ్వుతూ.

"అంటే?"

"కథంటే అదే!"

"అదేవిట్రా వెర్రి?"

"నీ వెర్రి లాటిదే!"

"వెరీగుడ్, వస్తా!" అని ముందుకి సాగిపోయాడు. ఉత్సాహంతో ఎక్కడి కెళుతున్నాడో, ఎంత దూరం వచ్చేశాడో గమనించుకోలేదు. స్పృహ వచ్చి చూచేసరికి "బి. మాధవరావ్, లాండ్ లార్డ్" అనే బోర్డు ఎదురుగా ఉన్న యింటికి కనిపించింది. అదే కల్పవల్లి యిల్లు! అంటే పార్కుని దాటి అప్పుడే మూడు వీధులు వచ్చేశాడన్నమాట. వెనక్కి తిరిగి వెళ్దామా అని ప్రయత్నించాడు కాని కాలు సాగలేదు.

చిత్రమైన కాలగతి యొక్క లక్షణం ఆనాది నుంచీ మానవుణ్ణి కలవరపెడుతూనే ఉంది. విజ్ఞుడు కైక్రోబాహి వీక్షణాన పెండ్యులాన్ని మొదట ఉపయోగించాడో నాటినించీ యీ కల వరపాటు ఎక్కువయింది. "కాలం, కాలం" అని వెంపరలాడ్డం యినుమడించింది. రష్యాదేశపు పండితు డొకడు "ఇది కూడా గడచిపోతుంది" అనే వాక్యాన్ని తన యింట్లో వ్రాసి ఉంచుకున్నాడట. నిజమే! ఇప్పుడున్న ప్రతిదీ గడచిపోయి భూతకాలపు పరదాల మాటున మాయమవుతుంది. ఇక భవిష్యత్తులో! అది అనిశ్చితమైనది. "సంశయాంధసంవృతము భవిష్యదర్థము" అన్నాడు ఉమర్ ఖయ్యాము (కవి) కోకిల కంఠంతో, "దక్కని యీ రేపటి మాట లేమిటి కనుభోగ్యంబైన నేడుండగన్" అని కూడా అన్నాడు. సత్యమైనదీ, నమ్మదగినదీ వర్తమానమే. అందుచేతనే "రేపు చేయదల్చుకున్న పని యీరోజు చేయి" అని తెలివైనవాళ్ళు బోధించారు.

మల్లికార్జునరావు కల్పవల్లి యింటిముందు నిలబడి యీ విషయాలన్నీ ఆలోచించాడో లేదో చెప్పడం కష్టం. కాని ఒక్కటి మాత్రం నిజం. పార్కుకి తిరిగి వెళ్దామనుకున్నవాడు సాహసించి వల్లి యింటివేపుకే ధైర్యంగా నడిచాడు. లోని కడుగు పెట్టగానే ఎదురుగా ఉన్న వరండాలో యీజీచైర్‌లో పడివున్న మానవాకారం ఒకటి అతడి కళ్ళబడింది. ఆ ఆకారం నోట్లో ఓ గొట్టమున్నది. "ఎవరీ శాల్తీ? ఇతడి కింత దాహమా? నేరుగా కుళాయి నుంచే గొట్టాన్ని తెచ్చుకుని తీరిగ్గా నీటినంతా పీల్చేస్తున్నాడే!" అని ఆశ్చర్యపోయాడు. పూర్వకాలపు టాంటలస్ వంటి వ్యక్తులు నేటికీ ఉన్నారు గామోసు నని సంతృప్తిపడ్డాడు. కాని అతడు మరి కాస్త దగ్గరి కెళ్ళేసరికి "గుడ గుడ" మని ధ్వని వినిపించింది. దాంతో అది కుళాయి గొట్టం కాదనీ, హుక్కా గొట్టమనీ అతడికి తెలిసిపోయింది.

మల్లిక్ ముందు కెళ్లి "వల్లిగా రున్నారా?" అని ప్రశ్నించాడు. ఆ విగ్రహం హుక్కాను గుడగుడ మనిపిస్తూ పైకప్పు వంకకి చూడడం తప్ప జవాబీయలేదు. ఈసారి కంఠాన్ని పై స్థాయికి శ్రుతి మార్చుచేసి, అదే ప్రశ్నను అడిగాడు.

"ఎవరు కావాలి?" అన్నది ఆ ఆకారం పైకప్పే తననేదో ప్రశ్నవేసిందని భావిస్తూ. వల్లి యొక్క అస్తిత్వాన్ని గురించిన ప్రశ్నను మల్లిక్ తిరుగా ఒప్పజెప్పాడు.

ఆ ఆకారం అలానే పైకప్పుకేసి చూస్తూ, హుక్కా గొట్టం నోట్లో పెట్టుకొని గుడగుడమని పీల్చింది తప్ప మాటాడలేదు. మల్లికార్జునరావు కుడికాలుమీది బరువును ఎడంకాలు మీదికి మార్చుకున్నాడు. ఎట్టకేలకు ఆ ఆకారం భువికి దిగివచ్చినట్లై మాటాడ్డం ఆరంభించింది.

"నీ పేరు—గుడుగుడ—ఏవిటబ్బాయ్?" అని ఆ ఆకారం హుక్కా పీలుస్తూ అడిగిన ప్రశ్న.

"మల్లికార్జునరా వంటారండీ!"

"ఓహో అలాగా! (హుక్కా పీల్చడం). దూడు రావ్గా (హు. పీ) నీవు మా అమ్మాయితో చదువుకొ మొచ్చావా?"

'వల్లిగారు మీ అమ్మాయాండీ?"

"గుడగుడ."

"మిమ్మల్ని కల్సుకున్నందుకు చాలా సంతోషంగా ఉందండీ?"

"గుడ"

"మేడమీ దున్నారాండీ?"

"అవును (హు. పీ) ఆమెతో నీకేంపని!"

"మాట్లాడాలండీ!"

"అలాగా! (చాలాసేపు హు. పీ) అయితే మేడమీది కెళ్ళు!"

"థాంక్సండీ! గుడగుడ .... ఓ సారీ సార్ మర్చిపోయి నేను కూడా గుడగుడ అనేశాను!"

"ఏం ఫర్వాలేదు (హు. పీ) వెళ్ళిరా!"

మల్లిక్ ఆనందంగా మేడ మెట్లెక్కాడు. గదిలో ప్రవేశించగానే రేడియో క్రికెట్టు కామెంటరీ కాబోలు వెదజల్లేస్తోంది. సోఫాలో కూర్చొని వల్లి ఏదో పుస్తకం చదువుకుంటోంది. కల్పలతలాంటి దేహ సౌందర్యం పంజాబీ దుస్తుల ధారణతో మరింత యినుమడించింది. నిర్లక్ష్యంగా వేసుకున్న జడలు రెండూ ఆమె అందానికి ఉద్దీపకలుగానే ఉన్నయ్. లేత గులాబీ డ్రస్సుపై ఆకుపచ్చని వల్లెవాటు ఆమె బుజాల మీదుగా సోఫాపై పడి చిరుగాలికి రెపరెప లాడుతోంది. అద్దంలాంటి నుదుటిమీద కళకళలాడే బొట్టు. ఆమె విలోల విలోచనాలలో విలసిల్లే విభ్రమం అయస్కాంతంలా ఆకర్షిస్తుంది.

మల్లిక్ ఆమెను ఉషారుగా గ్రీట్ చేశాడు. ఆమె తలఎత్తి విశాలమైన తన కళ్లను రెపరెపలాడించి ఒక నిమేషంపాటు చూసింది. తరువాత చిరునవ్వుతో పుస్తకాన్ని విసరివేసి సోఫాలోంచి లేచింది. "నమస్తే! రండి మల్లిక్‌గారూ!" అని ఆహ్వానించింది. అతడు ఉపవిష్టుడై "ఏవిటండి విశేషాలు?" అని ప్రశ్నించాడు మామూలుగా.

వల్లి నేలన బడిన పుస్తకాన్ని తీసి అతడి

అందిస్తూ "చూశారా, డ్యూరండ్ కప్ మన వాళ్ళు గెలిచారట !" అన్నది. మల్లిక్ ఉత్సాహం క్షణంలో నశించిపోయింది. తర్క పండితుడి దగ్గిర ఎల్ల కాలుక అకా గుర్తించి మాట్లాడిన ట్టయింది. "నిజంగానా !" అని లేని ఆశ్చర్యాన్ని తెచ్చుకుని, పుస్తకాన్నందుకుని చూడకుండానే పక్కని ఉంచేశాడు అదొక విషపదార్థ మయినట్టు.

"మన ఆటగాళ్ళు బాలా బాగా ఆడారండీ !" అన్నది తలలో పువ్వులు సర్దుకుని తానొక కుర్చీలో కూర్చుంటూ.

పరిస్థితి మరింత బేజారి పోతున్నట్టు మల్లిక్ గ్రహించాడు. ఏ క్షణాన్నయినా తన అజ్ఞానమనే గాలిబుడగ ఆమె ప్రశ్నలనే సూది తగిలి టపుక పేలి బయటపడుతుందని గ్రహించాడు. పూర్తిగా ఆశలు వమ్ముచేసుకొని ఎందుకేనా మంచిదని ఆఖరు ప్రయత్నంగా సంభాషణ మార్చాలని ప్రయత్నించాడు.

"సరేగాని, ఆ హాకీ .... " అని ఆరంభించాడు. కల్పవల్లి మధ్యలోనే అందుకుంది. "అవునండి! ఆయనే మా నాన్నగారు ? .... చూశారా ! నాకు క్వార్టర్ ఫయినల్సు అయేవరకూ నమ్మకమే లేదు. మనవాళ్ళ రష్యన్ డిఫెన్సు బాగా ఆడారండీ !"

మల్లికార్జునరావు జావ కారిపోయాడు. తనకూ ఓ హాకీ వుంటే బావుండు ననుకున్నాడు. ప్రతి మాటకూ గుడగుడ మని జవాబివ్వవచ్చును. కాని అది లేదు కాబట్టి ఎంతో తెలివిగా ఆమె చెప్పిన ప్రతి మాటకూ "అవునవును" అనాలి. అలా అందామన్నా యీ సంభాషణ యిలా ఎంతకాలం జరుగుతుందో తెలీదు. సంభాషణ యీ కప్పు వదలి దాని సిగ్గోసిన కప్పు మరొకటుంటే దానిమీదికీ వెళ్ళచ్చు. ఎంతటి యమయాతన సృష్టించావయ్యా భగవంతుడా ! అనుకున్నాడు.

కాని న్యూటన్‌కి భూమ్యాకర్షణ సిద్ధాంతం తట్టినట్టు అకస్మాత్తుగా అతడి బుర్రలో ఓ మెరుపు మెరిసింది. వెంటనే ఉత్సాహం తెచ్చుకుని "ఏమండీ ! ఓ మంచి జోక్ చెప్పేదా ?" అని అడిగాడు. వల్లి ఆశ్చర్యపోయి, తమాయించుకుని "చెప్పండి" అన్నది. "శభాష్!" అనుకుని మల్లికార్జునరావు ఇంత మంచి అయిడియా తట్టినందుకు తన వీపు తనే .... నిజంగా తట్టుకోలేదనుకోండి, మానసికంగా తట్టుకున్నా డనవచ్చు. విపత్కర పరిస్థితుల్లో సర్వాధికారాలూ వశపరచుకున్న నియంతలా మొదలెట్టాడు : "ఒక ఊళ్లో పేరయ్య, వీరయ్య అని యిద్దరన్నదమ్ములున్నారు. ఇద్దరూ తెలివితక్కువవాళ్ళే ! ఓ చలి కాలం రాత్రి వాళ్ళు పొలం కాపలాకి బయల్దేరారు. వెళ్తూ వెళ్తూ వెంట లావాటి దుప్పటిని కూడా తీసికెళ్లారు. ఏమండీ వింటున్నారా ?"

"చెప్పండి వింటున్నాను" అన్నది వల్లి మేగజైనులో బొమ్మకేసి తీక్షణంగా చూస్తూ.

మంచెంమీదపడుకున్నాక తమ్ముడు వీరయ్య ఓరే అన్నయ్యా ! నాకు దుప్పటి చాలడం లేదురా ! అన్నాడు. దానికి అన్న ఏమన్నాడో తెలుసునా ?"

"ఏమన్నాడు ?"

"అవును, ఏమన్నాడు ? అతడికూడా గుర్తు రాలేదు. యుద్ధకాలంలో పట్టణాలు కనబడకుండా చీకటిమయం చేసేసినట్టు అతడి మెదడులో కూడా బ్లాకవుటు అయిపోయింది. అష్టకష్టాలలో జోక్ మర్చిపోవడం కూడా ఒకటి ఉన్నదో లేదో తెలీదు. లేకపోతే దాన్ని చేర్చాలనుకున్నాడు. కాసేపు ఆలోచించగా ఆ చీకటిలో అతడికిరాజారావు నవ్వుతూ కనబడి ఏదోఅంటున్నాడు.

మల్లికార్జునరావు తడబడుతూ చెప్పాడు : "అన్నయ్య ఏమన్నాడంటే ఒరే అబ్బీ ! ఫ్రెంచి విప్లవం 18వ శతాబ్దంలో జరిగిందిరా !" అన్నాడు."

"అరే ! అదేవిటి అలా అన్నాడు ?" అనడిగింది వల్లి ఆశ్చర్యంతో.

"ఏమో నాకు తెలీదు. కానీ అలాగే అన్నాట్ట" అన్నాడు ధైర్యంగా.

"అయితే అన్నయ్య [illegible] కున్నవా డయిఉండవచ్చు !"

"ఉండచ్చు !"

"అది పోనిండి. వచ్చే వారం పది రోజుల్లో మన కాలేజీలో జరగబోయే ఆటల్లో పాల్గొంటున్నారా ?"

సమయం వచ్చింది కాబట్టి నిజం చెప్పేద్దామనే ఉద్దేశ్యంతో "లేదండీ ! ఆటలంటే నా కంతగా యిష్టంలేదు!" అన్నాడు.

"ఎబ్బే ! స్పోర్ట్సు అంటే యిష్టంలేదా ?" అనడిగింది వల్లి.

మల్లిక్ తల తాటించాడు.

"చూడండి ! నేను రెండువందల మీటర్ల పరుగుపందెంలో మొదట వచ్చినవారికి ఒక ప్రత్యేక బహుమతి ఇద్దామనుకుంటున్నాను. ఇదుగో, బహుమతి అప్పుడే కొనేశాను కూడా !" అన్నది ఒక మెడల్‌ని చూపిస్తూ. లాయిలం చూపిన చిన్ని పిల్లాళ్లా ఆ మెడల్‌ని చూసి గుటకలు మింగాడు. మనసులో బాధ కూడా పడ్డాడు. ఇన్ని రోజులూ తను కష్టపడి సంగీతం సాధన చేశాడు. పాటపాడి ఆమె హృదయంలో చోటు సంపాదించవచ్చని అనుకున్నాడు. ఇప్పుడా శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరయింది. ఆమెకు పాటలంటే అంత కుతూహలం ఉన్నట్టుగా లేదు. అయినా తాతో పేరో తెల్సుకుంటే మంచిదని అడిగేశాడు.

"మరి పాటలో ? పాటలంటే మీకు యిష్టం లేదా ?"

"పాటలా ? పాటలు శిశువులకీ, పాములకీ యిష్టమనీ మా నాన్న చెప్పేవాడు. మనబోటి చదువుకున్నవాళ్లకి కాదు" అన్నదామె తన అభిప్రాయాన్ని విశదీకరిస్తూ.

"లేదండీ ! మీరు పొరబడ్డారు. గౌరవనీయులైన మీ నాన్నగారు కూడా పొరబడే ఉంటారు. నేనొక పాట పాడతాను చూడండి. అది విన్నారంటే మీ రిట్టే కరిగిపోతారు !" అన్నా డెలాగైనా నచ్చజెప్పాలని చూస్తూ.



"అబ్బే! మా బామ్మకి పాటలంటే ఇష్టంగాని నాకు నచ్చవు!"

"ఎందుకు నచ్చవు! మహా చక్కగా నచ్చుతాయి. కావాలంటే ప్రయత్నించండి. ఒక్కసారి నేను "రాణీ ఆడవే!" అనే పాట పాడ్తాను. కళ్యాణి రాగం, రూపకతాళం. మీకు నచ్చుతుందో లేదో చూడండి" బ్రతిమాలే ధోరణిలో అన్నాడు.

"ఊహూ! నాకు తెలుసు. నా కసలు నచ్చదు. కావాలంటే మీ పాటని మా బామ్మ దగ్గిర పాడండి!" అన్నది వల్లి మొండిగా.

"మీ బామ్మ దగ్గిర 'రాణీ ఆడవే!' అనే పాట ఎలా పాడేదండీ!" అన్నాడు విచారంగా.

"పోనీ పాడొద్దులేండి!" అన్నది వల్లి.

"మోడై పోయెను మావిడిచెట్టూ మొగము వేలవేసె" అన్నారు గురజాడ (బసవరాజు ?) అప్పారావుగారు. ఈ వర్ణనకి సరిపోయేట్టుగానే గదిలో ప్రవేశించిన మల్లిక్‌ని చూసి బాబ్జీ ప్రశ్నించాడు : "ఏమిటి భాయ్ గాథ."

"విషాదాంతగాథ" అని జవాబిచ్చాడు కుర్చీలో కూలబడి.

"సంగతేమిటి ?" వివరించాడు. బాబ్జీ చీవాట్లేశాడు. "ఒరే నేను ముందే చెప్పాన్రా. నువ్వు చెవిన పెట్టావుకాదు. నీ శ్రమంతా వృథా అయిపోయింది కదా. అప్పటినుంచే పరిగెత్తడం అలవాటు చేసుకుని ఉంటే తప్పక వల్లి ప్రేమకు పాత్రుడ వయ్యేవాడివి. సరే యిప్పుడేం చెయ్యదల్చుకున్నావ్ ?"

"ఏం చేస్తానూ ? ఆవిణ్ణి మర్చిపోవడానికి ప్రయత్నిస్తాను" అన్నాడు విషాద భంగిమలో. కూచిపూడివాళ్ళు చూసి ఉంటే అతడి ఆంగిక, ఆహార్యాలకు మొదటి బహుమతి యిచ్చిఉండేవారు.

"కాని .... కాని .... ఆమెని మర్చిపోవడం కల్ల. నా హృదయ మిలా బ్రద్దలై పోవలసిందేరా, బాబ్జీ! బ్రద్దలై పోవలసిందే!" ఈసారి వాచికానికి కూడా మొదటి బహుమతి తీసుకునేట్టు మాటాడాడు.

"ఛ! వెధవలా మాట్లాడకు" అన్నాడు బాబ్జీ.

"మరేం జెయ్యాలి."

"ఉండు కాస్త ఆలోచించనీ .... ఆ! అదీ సంగతి. ఇప్పు డర్థమయింది. ఆ నరసింహంగాడు ఈమధ్య ఉదయాన్నే లేచి పరిగెత్తుతూంటే ఎందుకో అనుకున్నాను. రెండు వందల మీటర్లలో ఫస్టు రావడానికే నన్నమాట. సరి! ఇది విన్రా మల్లిక్. నువ్వు ఇంతకుముందు కాస్త ప్రాక్టీసు చేసినవాడివే కదా! కాబట్టి నరసింహంతో పోల్చుకుంటే నీ వెక్కడ ఉంటావో ముందు తేల్చుకోవాలి. రేపు ట్రయల్స్ జరుగుతున్నప్పుడు పోయి ప్రయత్నిద్దాం. ఆ తర్వాత మిగతా సంగతి ఆలోచించొచ్చు" అన్నాడు బాబ్జీ.

"అలాగే!"

* * *

ఒక చెట్టుక్రింద మల్లికార్జునరావు బాబ్జీ అందించిన టర్కిష్ టవల్‌తో మొహం తుడుచుకుని అలాగే నిమ్మకాయబద్దని నాలికపై వేసుకుని, కోపంగా వెనక్కి తిరిగి చూశాడు. "వెధవ వాడి కాళ్ళు మరీ దూదిపింజెల్లా ఎగిరిపోతున్నై" అన్నాడు ఆయాసంతో.

"ఇరవై మీటర్లు! అంత దూరం నువ్వె

# మత్కు— కాలూ...

ప్పుడు దాటాలి ? ఒరే మల్లిక్, ఇది మాత్రం నిజం. ఒక్క వారంరోజు లుందికదా. గట్టిగా ప్రయత్నిస్తే అప్పటికి అందర్నీ ఓడించగలవు. కాని ఆ నరసింహాంగాణ్ణి ఓడించడం మాత్రం నీ సాధ్యంకాదు."

"ఒరే! మిత్రు డీ లక్షణముల మెలగుచుండు. ఏ లక్షణముల ?' అనే ప్రశ్నకి తెలుగు పేపర్లో చిన్నప్పుడు పదికి ఏడు మార్కులు తెచ్చుకున్న వాడివి నువ్వే చౌఎన్ లై లాగా మాట్లాడితే ఎలారా ? నువ్వు సాయం చేస్తావనే కదూ, నేను జీవించి ఉన్నది!"

"అంతలా మాట్లాడవద్దులే! అదే ఆలోచిస్తున్నా! ముందు రూము కెళ్దాం పద!" అని బయల్దేరాడు.

చీకటి పడబోతోంది. మిత్రు లిద్దరూ బిల ప్రవేశం చేసి, లైటు వెలిగించుకొని చెరో మంచం మీదా వాలిపోయారు, మల్లిక్ ఆవేదనాభారంతోనూ బాబ్జీ ఆలోచనాభారంతోనూ.

"ఒరే ఇకనేనా వల్లిని మరచిపోవలసిందేరా!" అన్నాడు మల్లిక్ లైటుకేసి చూస్తూ.

"అవసరంలేదు. చూడు నాకో దారుణమైన అయిడియా తట్టింది. పరుగు పందెం ప్రారంభించేముందు ఓ మాంచి కుక్కని వుసిగొల్పి నీ వెనుక వదుల్తాను. నువ్వు భయపడి పారిపోతావు. ఎంత వేగంగా పరుగెత్తుతావంటే నరసింహంగా డేమిటి జటోపెక్‌నే ఓడించేస్తావ్!"

"నీ మొహంలాగుంది."

"ఏం ?"

"ఏమంటా వేమిటి? అన్నీ లొసుగులే. ఆ కుక్క మర్చిపోయి నావెంట పడ్డం మానేసి ఆ నరసింహంగాడి వెంటే పడిం దనుకో, అప్పు డేమవుతుందో ఆలోచించు. పైగా అది కోపంతో కరిచిందంటే అపాయం కూడా!"

బాబ్జీ మాటాడకుండా మళ్ళీ ఆలోచనలో పడ్డాడు.. "వల్లి! నిన్ను నే నెట్లు మరతును? నా హృదయంలో ...." మల్లిక్ యీ ధోరణి ఆరంభించాడు.

"ఒరే! మరో అయిడియా. పల్లేరుముళ్ళు మంచివి తీసుకొచ్చి ఆ నరసింహంగాడు పరిగెత్తే చోట జల్లేస్తేనో!"

మల్లిక్ విషాదంగా తల వూపాడు. "లాభం లేదురా! వాడు బూట్లతోపరుగెత్తుతాడు"అన్నాడు.

"అవునవును, సాయంత్రం చూశాగా. మరేం చేద్దాం ?" అని తిరిగీ ఆలోచనలో పడ్డాడు. మల్లిక్ జపంలో పడ్డాడు. "నా హృదయంలో ప్రతి రక్తకణమూ వల్లీ, వల్లీ"

"నల్లి!" అన్నాడు అకస్మాత్తుగా బాబ్జీ.

"ఏమిటి ?"

బాబ్జీ కాస్త తడబడి "అబ్బే ఏంలేదురా నీవు నిర్భయంగాఉండు తప్పక గెలుస్తావ్!"అన్నాడు.

"సరేలే! ఇందాక ఏమిటో అన్నావేమిటి?"

"అదా! నల్లుల విషయం. నల్లి అంటే తెలుసు కదా! మత్కుణం. బగ్ అంటారు. నల్లి విషయం నేను కొంతే పరిశోధన చేశాలే! నవ సమాజంతో నల్లుల స్థానం" అనే విషయం పై వ్యాసం కూడా ప్రారంభిస్తున్నాను. ముఖ్యంగా నేను ప్రతిపాదించదలచుకున్న సిద్ధాంత మేమంటే— —నల్లులు రెండు రకాలు. శాంతి నల్లులు, సైనిక నల్లులు అని. శాంతి నల్లులు ఉన్నచోటనే దాగొని అవకాశాన్ని ఉపయోగించుకుంటై. సైనిక నల్లులు పగటిపూట గోడల మీదుగా పైకప్పుకి ప్రాకి రాత్రివేళప్పుడు విమానంలోంచి సైనికులు దూకినట్టు మంచంమీదికి దూకుతై. మందులు శాంతి నల్లులమీద పనిచేస్తాయి గాని సైనిక నల్లులమీద పని చెయ్యవు. ఎంతోకాలం పరిశోధన చేసి ఈ విషయాన్ని కనుక్కున్నాలే!"

"ఈ గోలంతా యిప్పు డెందుకూ ?"

"ఎందుకేమిటి ? అడిగావ్ గాబట్టి చెప్పాను. అసలు సంగతేమిటంటే నీవు పోటీలో పాల్గొంటే చాలు. గెలిపిస్తాను. పాల్గొంటావా ?"

"తప్పక గెలుస్తాను కదూ ?"

"ఓ యస్."

"ఓ యస్."

* * *

పోటీ అయిపోయాక బహుమతి మెడల్స్‌ని తీసుకొని గర్వంగా మల్లికార్జునరావు బాబ్జీ దగ్గర కొచ్చాడు. "చాలా థాంక్సురా బాబ్జీ! నీవల్లనే యీ పందాన్ని గెలిచాను! ఇదిగో వల్లి యిచ్చిన స్పెషల్ మెడల్. ప్రత్యేకంగా కలుసుకొని అభినందనలు తెలిపిందిరా. నే నింతటి స్పోర్ట్స్‌మన్‌ని అని ఆమె వూహించనేలేదట. ఈమాట అన్న ఆమె కళ్ళెలా వెలిగిపోయా యనుకున్నావు ? అది ప్రేమజ్యోతికాకపోతే మరేమిటో నాకుతెలీదు."

"నీకు సహాయం చేయడమే కదా నా ధర్మం" అన్నాడు బాబ్జీ.

"సరేగాని ఆ నరసింహం అసలు పరుగెత్తలేక పోయాడేమిటి ? నిద్దరోతున్నవాడిలా జోగుతూ వచ్చాడు. సెకెండయినా రానందుకు చాలామంది ఆశ్చర్యపోయారు. ఏంచేశా వేమిటి ?"

"చెప్పమంటావా ? సిల్లీగా ఉందంటావేమో!"

"అబ్బే, సిల్లీ ఎలా అవుతుందిరా! ఇంత ఘన కార్యం కదా! చెప్పు ఫర్వాలేదు."

"నిజానికి నేనేమీ చెయ్యలేదు వాడికి. ఒక అవున్నుడు నల్లులు చేశాయి. ఉదయం ఎనిమిది గంటలకే పోటీ ఉంటుందని తెలిసింది. నిన్న సాయంత్రం వరకూ అవున్న నల్లులను సేకరించాను. నిన్న చీకటి పడ్డాక నరసింహం గదిలో లేని సమయం చూసి ఆ నల్లు లన్నిటినీ వాడి పరుపులో వదిలేశాను. రాత్రంతా మనవాడు నల్లుల్ని వేటాడుతూ కాలం గడిపాడు. అది కూడా గమనించాను. రాత్రంతా నాడికి సరిగా నిద్రలేదు. నిద్రలేనిదే శక్తి ఎక్కడినించి వస్తుంది ? అసలు 7—30 దాకా వాడు లేవనే లేదు. ఏడు నలభై కి నేనే అలా వెళ్ళి వాణ్ణి లేపి పందానికి వేళవుతుంది తొందరగా వెళ్ళమని చెప్పాను. అందుచేతే వాడు మత్తుగా ఉండి పరుగెత్తలేకపోయాడు" అన్నాడు బాబ్జీ.

"ఆహా! ఫ్రెండంటే నువ్వేరా బాబ్జీ! తెలివంటే కూడా నీదేరా! ఇంత సహాయం చేసినందుకు చాలాచాలా ధన్యవాదాలురా!"

"మత్కుణార్పణమస్తు."

"వస్తాన్రా! ఈరోజు మధ్యాహ్నం వల్లి డిన్నర్‌కి పిలిచింది. మళ్ళీ కలుస్తాలే!" 

డడం ఎంతో కష్టం. అటువంటిది 'సూర్యం' స్వత స్సిద్ధంగానే వాళ్ల విశ్వాసం మెప్పు సంపాదించాడు. వేలకొద్దీ డబ్బు అతనికి అప్పగించినా దమ్మిడీ వార లేకుండా జమాఖర్చులు సరిగ్గా చెప్పేవాడు. అతను డబ్బు అపహరిస్తాడేమోననే అనుమానం వాళ్లకు అసలుండేదే కాదు. అంతేకాక డబ్బు పారెయ్యడం గాని, బజారు ధరలకన్నా ఎక్కువ చెప్పడం కాని ఏనాడు వాళ్లతనిలో చూడలేదు.

రామవరంలో బ్రాంచి తెరిచేనాటికి కంపెనీలో సూర్యం సర్వీసు పదిహేను సంవత్సరాలు. అతని కప్పటికి వివాహమై ఇద్దరు రబ్బాయిలు పుట్టారు. వారి వయస్సు నాలుగేళ్లూ, రెండేళ్లూ. మొదట్లో సూర్యంతోపాటు ఒక మార్వాడీ గుమాస్తా కూడా వచ్చాడు గాని, అక్కడి నీరు అతనికి సరిపడక వెళ్లిపోయాడు.

సూర్యం ఒక్కడే నిర్వహించగలడనీ, వేరే మనిషి ఉండనక్కరలేదనీ వ్యాపారమంతా అతనికే అప్పజెప్పారు కంపెనీవాళ్లు. వాళ్ల నమ్మకానికి తగి నట్టు సూర్యం బాగా వ్యాపారం చేసి మంచి లాభాలు చూపిస్తున్నాడు. అప్పుడప్పుడు బన్సీలాల్ గాని, మరెవరైనా పెద్దవాళ్లు గాని వచ్చి వ్యాపారం ఎలా నడుస్తుందో చూసుకొని వెళ్లిపోతుండేవారు. ఒకటి రెండు రోజులకన్నా ఎక్కువ ఉండేవారు కారు.

అందరితో స్నేహంగా కలిసి మెలిసి తిరిగే స్వభావం అతనిది. పైగా వ్యాపారరీత్యా అందరితో మంచి అవసరమేను. ఆ ఊళ్లో ఉన్న మరికొందరు యువకులతో సరదాగా కాలక్షేపం చేస్తూండేవాడు. వ్యాపారం ఎప్పుడూ ముమ్మరంగా ఉండదు. అప్పు డప్పుడు మందంగా నడుస్తూ గోళ్లు గిల్లు కుంటూ కూచోడం కూడా సంభవించేది సూర్యా నికి. అటువంటప్పుడు స్నేహితులలో సరదాగా పేకాట ఆడుతుండేవాడు.

ఆ పల్లెటూళ్లో ఇరవైనాలుగు గంటలూ పేకాట జరుగుతూండేది. అందులో చెప్పుకోవలసిన ప్రదేశాలు, పైడితల్లి కాఫీ హొటలూ, సూరిలింగం ఇల్లూ.

పైడితల్లి కాఫీ హొటలు చిన్న పాక. అక్కడ సాధారణంగా కూలీ నాలీ చేసుకునే జనం, వచ్చి కప్పు టీ తాగిపోతూంటారు. వాళ్లలో హెచ్చు భాగం అరువుపెట్టేవాళ్లే. పైడితల్లి, టీ తయారు చెయ్యడం కూడా వాళ్లని చూసే చేస్తాడు. మరుగుతున్న నీళ్లల్లో ఎక్కువ భాగం ఉండేట్టు కలుపుతాడు.

"కాసింత సిక్కటి డికాషనూ, పాలుమక్కలూ, ఎయ్యవయ్యా" అని అడుగుతాడు పల్లెటూరు ఆసామి.

"అయితే స్పెషల్ టీ ఇమ్మంటావా ?" అడు గుతాడు పైడితల్లి.

"ఆ, పెషల్ టాయే యియ్యి" అంటా డా ఆసామి.

"ముందు డబ్బులియ్యి. మరి అరువు బేరాలు కుదరవు."

"అదేందయ్యా. ఎగేత్తా ననుకుందావా ? అమాస ఎళ్లేక సి బాకీ ఒక్క సయాన్నైసా వుంచి తొట్టు" అంటాడు ఆసామి.

పైడితల్లి మరి మాటాడకుండా నీళ్లల్లో

# ఏడుకొండలు

25వ పేజీ తరువాయి

కలిపిన 'చా' యిస్తాడు. డబ్బుల ప్రసక్తి వచ్చింది. కాబట్టి ఆసామి మరి మాటాడడు.

ఈ అరువు బేరాలతోనే అయితే పైడితల్లి కాఫీ హొటలు దివాలా తీసును. కాని దాని అసలు రాబడి అంతా హొటలుకు వెనక భాగంలో నిర్విరామంగా జరిగే చతుర్ముఖ పురాణ పారాయణులవల్ల వస్తుంది. అనేక రకాల వ్యక్తులు అక్కడికి వస్తారు. రాత్రి రాణీలు (నైట్ క్వీన్స్) నలుగురు పగలల్లా అక్కడ ఆడుతూంటారు. ఆ పాక పక్కన రెండు మూడు పాకల్లో వాళ్ల రాత్రి వ్యాపారం నిర్విఘ్నంగా సాగుతుంది. రాత్రి వాళ్ళు సంపాదించిన డబ్బుతో, పొద్దున్నే ఒకటి రెండు గ్లాసులు మందు పట్టించి, పేకాట ఆడడానికి కూర్చుంటారు. రోజూ విధిగా ఆఊరి కుర్రాళ్ళు, అంటే పాతిక సంవత్సరాలలోపు వాళ్ళు, ఒక అర

---

బాంకులు దోచుకోనడంలో సిద్ధహస్తుడైన ఒక గజదొంగను జైలు అధికారి ఇలా ప్రశ్నించాడు: "నీవు ఎప్పుడూ బాంకులే ఎందుకు కొల్లగొట్టుతావు."

"వాటిలో డబ్బు ఉంటుంది కాబట్టి" అని ఆ దొంగ తడుము కోకుండా సమాధానంచెప్పాడు.

కె. శివరామకృష్ణ (ఒంగోలు)

---

డజను మంది అన్ని వర్ణాలకు చెందినవాళ్లూ అక్కడికి చేరుతూంటారు. కొందరు తిండీ, నిద్రా కూడా మానేసి, రోజులకొద్దీ ఇళ్లకు వెళ్లడం మానేసి కూడా ఆడుతూంటారు.

ఒకసారి ఆ ఊరికి కొత్తగా వచ్చిన రెవెన్యూ ఇన్‌స్పెక్టర్‌గారికి, తద్దినం పెట్టడానికి, బ్రాహ్మణార్థానికి బ్రాహ్మణుడు కావలసి వచ్చాడు. ఆ వూళ్లో బ్రాహ్మణ జనాభా చాలా కొద్ది. ఒక బ్రాహ్మణుడు సాధారణంగా చుట్టుపక్కల గ్రామాలన్నిటిలో బ్రాహ్మణార్థం చేసేఆయన ఉన్నాడని తెలిసి ఆ రెవిన్యూ ఇన్‌స్పెక్టరుగారు అతనింటికి కబురు పంపారు. అతను ఇంట్లో లేడు. జవాను అతనికోసం ఊరల్లా తిరిగాడు గాని, అత నెక్కడా కన్పించలేదు. చివరికి జవాను వెళ్లి, ఆ బ్రాహ్మణు డెక్కడా కన్పించలేదని ఇన్‌స్పెక్టరుగారితో చెప్పాడు. ఆ సమయానికి ఆ ఊరి నాయుడు అక్కడే ఉండి "ఏమిటి విశేషం?" అని అడిగాడు.

ఇన్‌స్పెక్టరుగారు, మర్నాడు తమ యింట్లో తద్దినం ఉందనీ, బ్రాహ్మణుడి కోసం కబురు పంపితే ఆయన దొరకలేదనీ చెప్పారు. అప్పుడా నాయుడు "పైడితల్లి కాఫీహొటలు వెనకవేపు వెళ్తే ఆ కాయన కన్పిస్తాడు. నాయుడు పిలుస్తున్నా డని చెప్పు" అన్నాడు జవానువేపు తిరిగి.

జవాను నాయుడిమాట ప్రకారం పైడితల్లి కాఫీహొటలు వెనకవేపు వెళ్లి చూస్తే ఆరుగురు పేకాటలో తీవ్రంగా నిమగ్నులై కన్పించారు. అందులో తనకు కావలసినాయన ఎవరో తెలియ లేదు, జవానుకి. "బాబూ! ఇక్కడెవరో పంతులుగా రున్నారట, మా రెవెన్యూ ఇన్‌స్పెక్టరుగారు పిలు స్తున్నారు" అన్నా డా జవాను వారితో.

బనీనూ, గళ్ల లుంగీతో బీడీ కాలుస్తున్న ఒక యువకుడు "సర్లే. వస్తానని చెప్పు" అన్నాడు పేకముక్కలమీద తన ధ్యానం చెదరకుండా.

"నాయుడు గారు కూడా అక్కడ ఉండి మిమ్మల్ని వెంటనే రమ్మన్నానని చెప్పమన్నారండీ" అన్నాడు జవాను.

నాయుడు పేరు వినగానే ఆ బ్రాహ్మణుడు తలెత్తి చూశాడు. పక్కనున్న సెట్టొకడు "ఎళ్లేళ్ళు పంతులూ. నాయు డక్కడే ఉన్నా డంట" అన్నాడు. విధిలేక అయిష్టంగా పేకముక్కలు పారేసి లేచాడా పంతులు. ఎందుకంటే నాయుడి సంగతి అందరికీ తెలుసు. అతనికి కోపమొస్తే ఎంతపనైనా చేస్తాడు.

ఊళ్లో, ఈ బాపతు మనుష్యులతో అవసరం వస్తే, ముందు పైడితల్లి కాఫీహొటలుకు కబురు పంపడం అందరికీ అలవాటే. ఈ పేకాటే వాళ్లందరికీ కాఫీలూ, టిఫిన్లూ సప్లయి చేస్తూ పైడితల్లి బాగు పడ్డాడు.

సూరిలింగంగారిల్లు ఘరానా మనుష్యులు చేరే చోటు. పెద్ద పెద్ద వ్యాపారస్థులూ, గవర్నమెంటు ఉద్యోగస్థులూ, ఊరి పెద్దలూ మొదలైనవాళ్ళు అక్కడికి చుట్టుపట్ల ఊళ్ల నుంచి వస్తూం టారు. సూరిలింగంగారు కొంత ఆస్తి కలవాడే. ఆయనకు పేకాటంటే తగని పిచ్చి. పేకాటవల్ల కొంత డబ్బు గణించాడని వినికిడి. కాని గణించి నది ఎక్కువ కాలం నిలవలేదు. అన్ని రకాల వ్యసనాలకు ఆ డబ్బు తగలబెట్టేశాడు. పెళ్లి చేసుకోలేదు. ఒక భోగమామెను తనవద్ద శాశ్వతంగా ఉండేట్లు ఏర్పాటుచేసి ఆమెకు రామవరంలో ఇల్లు కట్టించి ఇచ్చాడు.

ఆయనకు చుట్టుప్రక్కల ఊళ్లలో ఉన్న పెద్ద పెద్ద ఆఫీసర్లతో బాగా పరిచయం. బుడ్డీ వస్తైగా సప్లయి కావాలంటే సూరిలింగంతో చెప్తే చాలు. ఆయనింట్లో నాలుగైదు రకాల 'టేబు ళ్లుం' టాయి. కొన్ని తక్కువ స్థాయిలో పేకా టాడేవారికి కేటాయించబడి ఉంటాయి. కొన్ని చాలా హెచ్చు స్థాయిలో ఆడేవారికి ఏర్పరుచబడి ఉంటాయి. వందలమీద జరిగే ఆటలు అక్కడ జరుగుతుంటాయి.

అక్కడ ఉన్న ఇంకొక తమాషా ఏమిటంటే, ఆడేవారికి రెట్టింపు మంది చూసేవా ళ్ళుంటారు. గెల్చినవాళ్లని భళాభళి అని పొగడ్డం, ఓడిపోయిన వాళ్లను ఓదారుస్తూ ఉండడం, ఈ ప్రేక్షకుల పని. టేబిలుమీద రూపాయిల నోట్లు పెద్ద కుప్పగా పడి ఉన్నప్పుడు, చూసేవాళ్ల హుషారు

# ఏడు కొండలు

చెప్పతరం కాదు. "భలే షోటు! ఎవడికి వస్తుందో చూడాలి" అని ఆడేవాళ్లకన్నా ఎక్కువ ముచ్చట పడిపోతారు. అప్పటికి తక్కిన చేతులన్నీ ఆట వదులుకొని, ఇద్దరు మిగుల్తారు. ఇద్దరికీ ఆ రూపాయల కుప్పని చూస్తున్నకొద్దీ ఉద్రేకం హెచ్చిపోతూంటుంది. అంతేకాక ఈ ప్రేక్షకుల ముందు తమ పౌరుషం నిరూపించుకోవాలని, మరీ రోషంతో రెచ్చిపోతారు. చివరికి ఎవరో ఒకరికి కొంచెం అనుమానం కలిగి అవతలవాణ్ణి ముక్కలు తిరగెయ్యమంటాడు. తిప్పితే ఏముంది! తనది ఆసు, రాజా, జాకీ అయితే అవతలవాడిది ఆసు, రాణి, జాకీ. అప్పటికి పోయిన ప్రాణాలు గూటికి చేరి కుప్పను తనవైపు లాక్కుంటాడు. ఇహ ప్రేక్షకులంతా అతన్ని, విజయం సాధించిన వీరుడిగా భావిస్తారు! వాళ్లలో పెద్ద కలకలం పుట్టుంది! 'షోటు' సుమారు వాలుగైదువందల ఉంటుందంటారు. భలేఛాన్సు కొట్టాడంటారు. ఇవన్నీ చూస్తూంటే ఓడిపోయిన వాడికి రోషం మరీ హెచ్చిపోతుంది. ఎలాగైనా అవతలివాడిని ఓడించాలని పంతం పడ్తాడు. మళ్ళీ ఆట చివరిదాకా నిలబడ్తాడు. అదృష్టవశాత్తూ తనకి 'ప్యైరస్' వస్తుంది. తన దగ్గర ఉన్న డబ్బంతా ఒడ్డుతాడు. అవతలవాడు అంతకన్నా మొండి. వాడు అంతకుముందే బాగా డబ్బు గెల్చాడు. ఒకవేళ వాడు వదుల్తానన్నా, చుట్టూ ఉన్న వాళ్ళు వదలనిస్తారా? "ఇప్పుడే గెల్చావుగా. చూస్తావేం? వెయ్యి!" అంటారు. అతను ముక్కలు చూసుకుంటూ జంకుతున్నట్టు కన్పిస్తాడు. బహుశా చిన్న ఆట పడివుంటుం దనుకొంటాడు 'ప్యైరస్' పడినాయున. అది తనకు మరీ మంచిదీ. ఈ దెబ్బతో వాడి దగ్గరున్న కుప్పంతా లాగెయ్యాలని! జేబులోంచి ఆఖరి నోట్లకట్ట తీస్తాడు. అంతా వేసేస్తాడు. ఎదుటివాడు, తను అంతకుముందు గెల్చిన రూపాయలకుప్ప ముందుకు తోస్తాడు. పైగా ముక్కలు తిప్పమనైనా అనడు. ఇహ లాభంలేదు. తనే తిప్పమనాలి. ఆట తనదే పెద్దది. అయితేనేం, డబ్బయిపోయింది. తనే తిప్పమన్నాడు. అవతలవాడు డబ్బు వెయ్యమన్నాడు. తరువాత ఇస్తానంటే ఒప్పుకోలేదు. తిప్పమనడానికి పది రూపాయలు వెయ్యాలి. తన దగ్గర దమ్మిడీ లేదు. ప్రక్కనున్న ఒకాయన దగ్గర అప్పు తీసుకొని మరీ తిప్పమన్నాడు. అవతలివాడు తిప్పాడు. మూడు జాకీ లున్నాయి. తనది ప్యైరస్ మాత్రమే అంతా ఘొల్లుమన్నారు. తనని చూసి పకపక నవ్వారు. తను కుదేలైపోయాడు. లేచి వెళ్ళిపోయాడు. బయటికెళ్ళి లెక్కవేస్తే అవాళ వెయ్యి రూపాయలు పోయాయి అతనివి.

ఇలా పంతాలకు పోయి, పొలాలూ, ఇళ్ళూ, భార్యల నగలు కూడా తాకట్టు పెట్టేసి ఆడేస్తూంటారు. అక్కడ ఆడేవాడికి తన బాధ్యతలూ, అంతస్థూ, హోదాలూ, ఏవీ గుర్తుండవు. మంచి ఆట పడలేదనే దిగులు తప్ప మరేమీ జ్ఞాపక ముండదు. డబ్బు పోతున్నకొద్దీ తనని తాను మర్చిపోతాడు. తన అదృష్టాన్ని తిట్టుకుంటాడు. పంతం పెంచుకుంటాడు. చిన్న విష యాలకు కూడా దెబ్బలాడాలని చూస్తాడు. కోపం హెచ్చిపోతూంటుంది. ఆ కోపంతో విచక్షణాశక్తి పోతుంది.

సూర్యప్రకాశరావు స్నేహితులు చాలామంది పేకాట ఆడేవాళ్లే. అప్పుడప్పుడు తనకి వర్తకం మందంగా ఉండి, తోచనప్పుడు సూరిలింగంగారి యింటికి వెళ్ళి పేకాట చూసే ప్రేక్షకుల్లో ఒకడుగా ఉంటూ ఉండేవాడు. క్రమంగా అతనిలో కూడా ఆడదామనే కోరిక జనించింది. పేకాట చూసేవాళ్ళు ఎప్పుడూ గెల్చినవాడి గురించే ఎక్కువగా మాట్లాడతాడు. వాడి అదృష్టాన్ని గోరంతలు కొండంతలు చేసి వర్ణిస్తారు. అది వినేవాడికి తనకి కూడా అటువంటి అదృష్టం పడితే బాగుండుననే ఆశ పుట్టుంది. 'ఏమో? ఎవరు చెప్పగలరు? గెల్చినవాడూ తనలాటివాడే. ఏముంది! అవతలవాడి ముక్క కన్నా తన ముక్క పెద్దదైతే చాలు. సునాయాసంగా డబ్బు లభిస్తుంది. సూర్యానికీ, పేకాటలో గెలవడం అంత కష్టమైన విషయంగా కన్పించలేదు.

తక్కువ స్థాయిలో జరిగే ఆటలో కూచొని ఆడడం ప్రారంభించాడు సూర్యం. రోజుకు అయిదూ, పదీ, పదిహేనూ చొప్పున గెలుస్తూండేవాడు. అందరూ సూర్యాన్ని చాలా అదృష్టవంతు డన్నారు. పేకాటలో ఎప్పుడూ అతడి చెయ్యి గెల్చే చెయ్య నన్నారు.

స్నేహితుల ద్వారా సూర్యానికి కొన్ని కొత్త అలవాట్లు అబ్బాయి. మునుపు అతనికి సిగరెట్టంటే పరమ అసహ్యంగా ఉండేది. మెల్లిగా అప్పుడప్పుడు స్నేహితులతో కలిసి కాల్చడం అలవాటు చేసుకున్నాడు. ఈ రోజుల్లో ఏమని చేస్తూన్నా, వేళ్లమధ్య సిగరెట్టుంటే మనిషి కొక హుందా తెచ్చిపెట్టుందని గ్రహించాడు. అంతే కాకుండా తనేమైనా చిన్న ఉద్యోగం చేస్తున్నాడా? 'మునిసిపల్ కంపెనీ' ఏజంటాయె! స్నేహితులు మాటల్లో 'నీ కేమిటోయ్! నెలకు మూటవిలువ గణిస్తున్నావు దర్జాగా!' అంటుంటే తనో పెద్ద ఉద్యోగస్థుడనే అహంభావం అతనిలో ప్రవేశించింది. నిజానికి అతని జీతం నూట పది రూపాయలు. అయితేనేం? అందరు తనది చాలా ఎక్కువ జీతమని అనుకోవాలని ఉండే దతనికి. మునుపటికన్నా శుభ్రమైన బట్టలు ధరించసాగాడు. చేతిలో ఎప్పుడూ సిగరెట్టుండక తప్పదు. జేబులో పాకెట్ సిద్ధం.

తను సిగరెట్లు తాగడమే కాకుండా తన వద్దకు వచ్చే వాళ్లందరికి 'ఆఫర్' చేసేవాడు. స్నేహితులొస్తే కాఫీ కూడా తెప్పించేవాడు. కాఫీలు తాగి, సిగరెట్లు కాలుస్తూ పేకాటలో ఆ క్రితంరోజు గెల్చినవాళ్ళ గురించీ, వ్యభిచారిణుల గురించీ, పెద్ద వాళ్ళ ఇళ్ళల్లో జరిగే అవినీతి కార్యాల గురించీ చర్చిస్తుండేవారు. వీళ్ళ ఖర్చులన్నీ సూర్యమే, గొప్పకి, భరిస్తూండేవాడు.

ఇలాటి ఖర్చులే కాక పేకాటకు కూడా డబ్బు అవసర మొస్తుండేది. తన జీతం చాలేది కాదు. రెండు మూడు నెలలు ఇంట్లో చాలా ఇబ్బందైపోయింది. అటువంటి సమయంలో కంపెనీ డబ్బు కొద్దిగా వాడక తప్పలేదు. మళ్ళీ సర్దొచ్చును కదా అని కొంచెం కొంచెం వాడసాగాడు.

[illegible] పేకాట మానలేకుండా ఉన్నాడు. తను వాడుతున్న కంపెనీ డబ్బు మళ్ళీ కట్టలేకపోతున్నాడు. అటువంటి సంపాదన కోసం క్రొత్త దారులు త్రొక్కాలి అనుకున్నాడు.

తను కంపెనీ కోసం సరుకులు కొనేటప్పుడు ముందు వర్తకుల వద్ద కమీషను తీసుకొనేవాడు కాదు. ఇప్పుడు తీసుకోవడానికి సంకల్పించాడు. కాని పాత వర్తకుల్ని అడిగితే, ఈ కొత్త పద్ధతికి వాళ్ళొప్పుకోరు. అందుకని కొత్త వర్తకుల వద్ద సరుకు కొనుగోలు చెయ్య నారంభించాడు. పాత వాళ్ళకి సూర్యం తమ వద్ద కొనడం ఎందుకు మానేశాడో బోధపడలేదు. వాళ్ళు మెల్లిగా వాకబు చేసి అతని అలవాట్లు మారాయనీ, ఖర్చులు పెరిగాయనీ గ్రహించారు. కొత్తవాళ్ళ దగ్గర కమిషను లోపాయికారిగా, పుచ్చుకుంటున్నాడనీ తెలుసుకున్నారు. తమ దగ్గర కమీషను ప్రసక్తి ఎత్తకుండా, తమ సరుకు బాగులేదని చెప్పి, అంతకన్నా బొత్తిగా అధ్వాన్నమైన సరుకును కొత్తవాళ్ళ దగ్గర కొనడం చూశారు. వాళ్ళకు చాలా కష్టంగా వేసింది. పైకి సూర్యంతో మంచిగా ఉంటూనే మునీమ్స్ కంపెనీకి సూర్యం గురించి ఆకాశరామన్న ఉత్తరాలు వ్రాశారు. సూర్యం ఖర్చులగురించీ, పేకాట గురించీ వివరంగా రాశారు. కంపెనీవాళ్ళు వాటిని, ఎవరో గిట్టనివాళ్ళు రాసిఉంటారని, అంత లెక్కచెయ్యలేదు. పైగా విశాఖపట్టణంలో అప్పుడు బన్సీలాల్ ఉండి కంపెనీ వ్యవహారాలు చూడ నారంభించడంవల్లా, అతనికి సూర్యం మీద ఉన్న అభిమానం వల్లా, ఆ ఉత్తరాలన్నీ బుట్టదాఖలా అయ్యాయి.

ఈ విషయాలు చూచాయగా సూర్యానికి తెలిసాయి. తనమీద కిట్టనివాళ్ళు కంపెనీకి ఆకాశ రామన్న లేఖలు వ్రాసినారు. తన సర్వీసు ఎక్కువవడంవల్లా, తన నిజాయితీమీద కంపెనీకి బాగా నమ్మకం ఉండటంవల్లా, తననే కంపెనీ మద్దతు చేస్తోందని తెలిసి అతనికి మరింత ధీమా హెచ్చింది. కంపెనీ డబ్బు వాడకం ఎక్కువ చెయ్యడం మొదలెట్టాడు. రెండు నెలలలో, బన్సీలాల్ దేశం వెళ్ళడం, రామ్‌లాల్ అనే మరొకతను అతని స్థానంలో రావడం జరిగింది.

సూర్యానికి రామ్‌లాల్ రావడం మరీ ధైర్య మనిపించింది. ఎందుకంటే రామ్‌లాల్ 'లైను' మీదకి రావడం ఇదే మొదటిసారి. అందువల్ల పాతవాళ్ళలా చెప్తే అలా వింటాడని సూర్యం నమ్మకం. కాని రామ్‌లాల్ చండశాసనుడు. సూర్యం మీద వచ్చే ఆకాశరామన్న ఉత్తరాల్ని, బన్సీలాల్ లాగ బుట్టదాఖలా చెయ్యలేదు. తన బల్లమీద ఒకప్రక్క ఉంచాడు. రామవరం వర్తకు లెవరైనా వస్తే తన వద్దకు పంపమని ఆఫీసులో చెప్పాడు.

ఒకవంక పేకాట, మరొకవంక స్నేహితులతో ఖర్చు. ఇంట్లో కూడా మునుపటికన్నా హెచ్చిన ఖర్చు, ఇవన్నీ సూర్యం వాడుకచేస్తున్న కంపెనీ మొత్తాన్ని వెయ్యి రూపాయల దాకా పెంచాయి. అతని ఆఫీసులో ఉన్న ఇనప్పెట్టెలో కంపెనీ తాలూకు సొమ్ము ఎప్పుడూ అయిదారు వేలా ఉంటూ ఉంటుంది కాబట్టి కంపెనీకి ఈ సంగతి తెలిసే అవకాశం లేకపోయింది.

సూరిలింగంగారింట్లో పేకాట అవిచ్ఛిన్నంగా జరిగిపోతోంది. కంపెనీ సొమ్ము వెయ్యి రూపాయలు ఎలా సర్దుబాటు చెయ్యాలా ? అని ఆలోచిస్తున్న సూర్యానికి, పేకాట ఒక మార్గంలా కనిపించింది. చిన్న టేబిల్సు దగ్గర ఆడితే పదో, పాతికో కన్నా రావడమూ ఉండదు, పోవడమూ ఉండదు. పెద్ద టేబిలు వద్ద ఆడితే, వందల్లో వ్యవహారం ఇటో అటో తేల్తుంది.

అయిదారు వందలు పట్టుకొని పెద్ద టేబిలు వద్ద కూర్చో నారంభించాడు. అసలే సూర్యంది అదృష్టం చెయ్యి. దానికి తోడు వరుసగా నాలుగు రోజులు అతని తోటి ఆటగాళ్ళు చాలా మంచి వాళ్ళు దొరికారు. వాళ్ళు బ్లాకుమార్కెట్టులో బాగా గణించిన వర్తకులూ, పెద్ద ఆస్తులున్న ఆసాములూ. వాళ్ళకు చిన్న ఆట పడితే చాలు, పెద్ద పెద్ద మొత్తాలు ఒడ్డేవారు.

నాలుగు రోజుల్లో సూర్యం రెండు వేలు గణించాడు. అంటే, కంపెనీకి వెయ్యి కట్టెయ్యగా తనకొక వెయ్యి రూపాయలు మిగుల్తాయి. అవాళ ప్రొద్దున్న కంపెనీ నుంచి టెలిగ్రాం వచ్చింది, తనదగ్గరున్న డబ్బునంతా ప్రక్క ఊళ్ళో ఉన్న బాంకులో కట్టెయ్యమని. అది రామ్‌లాల్ పంపినది. కాని అవాళ కొన్ని కొనుగోళ్ళు ఉండడం వల్ల, అతనికి ప్రక్కఊరు వెళ్ళడానికి తీరుబాటు లేకపోయింది. మర్నాడు వెళ్ళి కట్టేద్దా మనుకున్నాడు.

సాయంకాల మవగానే సూర్యం, జేబులో వెయ్యి రూపాయలు పట్టుకొని సూరిలింగం గారింటికి వెళ్ళాడు. ఈ వెయ్యితో మరి రెండు మూడు వేలైనా గణిద్దామని అనుకొన్నాడు. నాలుగు రోజుల్నుంచీ తన అదృష్టం విపరీతంగా ప్రకాశిస్తోంది. జీవితాంతం తను పేకాటలో గెలుస్తూనే ఉంటా ననుకొన్నాడు.

అవాళ పెద్ద ఆటకి కూర్చున్నవాళ్ళు ఆ చుట్టుపట్ల గ్రామాల్లో పేకాటకి పేరుమోసినవాళ్ళు. అందులో సర్వన్న అని ఒకాయన ఉన్నాడు. ఆయన నందరూ 'కంపీ సర్వన్న' అంటారు. 'కంపీ' అన్న పేకాటలో ఆయన గణించిన డబ్బుతో రెండు మేడలు కట్టాడు ప్రక్క ఊళ్ళో. మరొకాయన హరిశ్చంద్రుడుగారు. ఆయన అన్నప్రాశననాడు పుస్తకాలూ, పువ్వులూ, డబ్బూ ఉంచితే అవన్నీ ముట్టుకోవడం మానేసి దూరంగా ఎవరో అజాగ్రత్తగా పారేసిన పేకముక్కని ముట్టుకున్నాడట. ఆయన పేక కలిపాడంటే, ఎవరికి ఏ ముక్కలు పడ్డాయో చెప్పగలడట. మరొకాయన పేరు ఏకాశి గారు. వారితో ఆడినవాళ్ళ పని ఏకాశీనంటా రంతా. ఇంకో ఇద్దరు, ముగ్గురు అలాంటివాళ్ళే ఉన్నారు. సూర్యం ఈమధ్య బాగా డబ్బు గెలుస్తున్నాడని విన్నారు. సూర్యం రాగానే ఆటకు రమ్మన్నారు.

అలాంటివాళ్ళతోటి ఎలా ఆడాలో సూర్యానికి తెలియదు. వాళ్ళ ఆట తీరు కనుక్కోడమే కష్టంగా ఉంది. సూర్యం ఆటని వాళ్ళు ఇట్టే పసిగట్టేశారు. సూర్యానికి మొదట్లో పెద్ద పెద్ద ఆటలే పడ్డాయి. కాని పాతికో, ముప్ఫైయ్యో కన్నా ఎక్కువ గెల్చేవాడు కాదు. అవతలవాళ్ళకు చిన్నాట పడినా వాళ్ళు వందలు గెలుస్తున్నారు.

ఒక గంటన్నరలో సూర్యం, వెయ్యి రూపాయల్నీ రెండు మూడు పెద్ద కట్టల్లో ఓడిపోయాడు. అతనికి ఆశ్చర్యం వేసింది. వెంటనే రోషంతో ఆఫీసుకెళ్ళి రెండువేల రూపాయలు పట్టుకొని తిరిగి వచ్చాడు. మళ్ళీ ఆటకు కూర్చున్నాడు.

సూర్యం చెయ్యి మళ్ళీ గెలవడం ప్రారంభించింది. రెండు మూడు వందలు గెల్చాడు. ఆట పెంచాడు. ఈసారి అవతలవాళ్ళు గుడ్డిగా చాలా సేపు నిలబడ్డారు. సూర్యం అలాగే నిలబడ్డాడు. చివరకు ముగ్గురు తప్పుకొని, సూర్యం, సర్వన్నా మిగిలారు. మరికొంతసేపు వాళ్ళూ గుడ్డిగా ఆడారు. సర్వన్న ప్రక్కన హరిశ్చంద్రుడూ, అతని ప్రక్కన సూర్యం, అతని ప్రక్కన ఏకాశీ, తర్వాత ఇంకొకరూ కూర్చున్నారు. అవాళ ప్రేక్షకు లెవ్వరూ లేరు.

అప్పటికి ఒక్కొక్కరివి అయిదేసి వందలదాకా టేబిలుమీద ఉంది. సూర్యం ముక్కలు ఎత్తి చూశాడు. తనవి మూడు రాణీలు. అతను ముక్కలు ఎత్తిచూసే సమయంలో సర్వన్న, హరిశ్చంద్రుడికి కన్నుగొట్టాడు. అది ఇతరు లెవ్వరూ గమనించలేదు. హరిశ్చంద్రుడు మెల్లిగా తలూపాడు. సర్వన్నది రెండు ఆసులూ, ఒక రాజా ఆట.

సూర్యం ధీమాగా డబ్బు వెయ్య నారంభించాడు. సర్వన్న కూడా అంతకన్నా ధీమాగా వెయ్య నారంభించాడు. సూర్యం ఒక వెయ్యి రూపాయల దాకా వేశాడు. సర్వన్నా అంత డబ్బూ వేశాడు. చివరికి సూర్యానికి జంకుపుట్టి సర్వన్నని ముక్కలు తిప్పమన్నాడు. సర్వన్న ముక్కలు తిప్పేసరికి మూడాసు లున్నాయి. సూర్యం మొహం పాలిపోయింది. సూర్యానికి, ఇది హరిశ్చంద్రుడి కుట్ర అనీ, అతనూ సర్వన్నా ఈ డబ్బు తర్వాత వాటా వేసుకుంటారనీ, సర్వన్న కన్ను గొట్టడం జరిగిన తరువాత, అందరూ పారేసిన ముక్కలలోంచి ఒక ఆసు తీసి హరిశ్చంద్రుడు సర్వన్న కందిచ్చాడనీ తెలియదు.

తరువాత కూడా సర్వన్నా హరిశ్చంద్రుడూ ఏకమ్మై సూర్యం డబ్బంతా హరించారు. ఏకాశీ తదితరులు కొంతవరకూ అది గమనించినా, పోతున్నది తమ డబ్బు కాకపోవడంవల్లా, పైగా సూర్యం తప్ప తా మందరూ పాత స్నేహితులే అవడం వల్లా మాటాడకుండా ఊరుకున్నారు.

రెండవసారి మళ్ళీ ఆఫీసుకు వెళ్ళి ఇంకొక వెయ్యి తెచ్చాడు. రాత్రి పదకొండు గంటల లోపల ఆఫీసు డబ్బు మూడు వేలూ, సూర్యం పేకాటలో ఓడిపోయి, ఇంటికి వెళ్ళిపోయాడు. అవాళ ఆ ఊరివాళ్ళెవరూ తమ ఆటలో లేకపోవడంవల్లా, ముఖ్యంగా ప్రేక్షకు లెవరూ అవాళ లేకపోవడంవల్లా, బహుశా తను ఇంతడబ్బు ఓడిపోయిన సంగతి ఆ ఊరిలో తెలియదనుకున్నాడు. తను ఇంతడబ్బు ఎలా ఓడిపోయినాడా ? అని ఆశ్చర్యపోసాగాడు. ఇంటి కెళ్ళకుండా ఆఫీసులోనే ఒక్కడూ కూర్చొని, సిగరెట్లు కాలుస్తూ 'ఇప్పుడేం చెయ్యాలా ?' అని ఆలోచించసాగాడు సూర్యం.

పాపం సూర్యానికి, ఇది సూరిలింగం, సర్వన్నా, హరిశ్చంద్రుడూ మొదలైనవాళ్ళంతా కలిసి చేసిన

# ఏడుకొండలు

కాని అది తెలియదు. అసలు అలాంటి ఆట గాళ్ళతో తెలిసినవాళ్ళెవరూ ఆడరనీ, వాళ్ళ మాయలతో పడకుండా ఉండటానికి, వాళ్ళ ఆటకు వచ్చిన చోటికే ఎవరూ వాళ్ళ సంగతి తెలిసినవాళ్ళు రారనీ, సూర్యానికి తెలియదు. సూర్యం వెళ్ళిపోయాక, మరి రాదని తెలిసి అతను ఓడిపోయిన డబ్బంతా వాళ్ళ వాటాలు వేసు కున్నారనీ కూడా సూర్యానికి తెలిసే అవకాశం లేదు. సూర్యంలాంటివాళ్ళెంతమంది వాళ్ళ చేతుల్లో హతమారిపోయారో ?

తెల్లవారితే కంపెనీ డబ్బు మూడువేలు బాంకులో కట్టాలి. తన స్థితి తల్చుకొని సూర్యం ముందు ఏడ్చాడు. కాని క్రమంగా తనకి తనే ధైర్యం తెచ్చుకున్నాడు. అతనికి ఒక్క విషయంలో ధైర్యముంది. కంపెనీకి తనమీద నమ్మకముంది. ప్రస్తుతం ఈ మూడు వేలూ, తన అజాగ్రత్త వల్లనో మరేవిధంగానో పోయినట్లు తెలియ జరుస్తే ఆ డబ్బు తన జీతంలోంచి నెలకు కొంత కొంత చొప్పున కొట్టేసుకుంటారు. లేకపోతే ఒకొక్కప్పుడు తన పొరపాటును క్షమించి ఊరుకోవచ్చును. కాబట్టి, ఏదోవిధంగా ఈ మూడు వేలూ పోయినట్లు నాటకమాడా లను కొన్నాడు.

రాత్రల్లా మేలుకొని ఆలోచిస్తూనే ఉన్నాడు. చివరికి ఒక చిన్న పథకం అమలు జరపాలని నిశ్చ యించాడు. తెల్లవారాక స్నానంచేసి కాఫీ త్రాగి, మామూలుగా ఆఫీసులో పనిచేసుకుంటూ కూర్చు న్నాడు.

ఆవాళ ప్రొద్దున్న పేపరు చూడడానికి శ్యామ్ బాబు సూర్యం ఆఫీసుకు వెళ్ళినప్పుడు యాదా లాపంగా అన్నట్లు సూర్యం తను పది గంటలకు ప్రక్కవూరి బాంకులో కంపెనీ సొమ్ము మూడు వేలు జమకట్టడానికి వెళ్తున్నానని చెప్పాడు. అలాగే తరువాత వచ్చిన ఇద్దరు ముగ్గురు స్నేహితులకూ, నలుగు రైదుగురు వర్తకులకూ చెప్పాడు. ప్రక్క ఊరు వెళ్ళాలంటే రైలుమీద గాని, బస్సుమీద గాని ఎక్కి వెళ్ళాలి, పది గంటలకు తన ఆఫీసు నుండి బయల్దేరాడు. రామవరంలో ఉన్న కాఫీ హోటలులో కాఫీ త్రాగాడు. స్టేషను దగ్గర కాస్సేపు ఇటూ అటూ తిరిగాడు. ఇంతలో అక్కడి కొక బస్సు వస్తే దానిలో ఎక్కి ప్రక్క వూరికి బయలుదేరాడు.

బస్సు రెండు మైళ్ళు వెళ్ళాక సూర్యం "అరె! అరె!" అని గాభరాపడుతూ పాంటు జేబు తడుము కుంటూ "డబ్బు పోయింది! డబ్బు పోయింది" అని అరవ నారంభించాడు. బస్సులో ఉన్నవాళ్ళంతా అతని కేకలకు ఖంగారు పడ్డారు. "ఏమిటి ? ఏమిటి ?" అని అందరూ అంటూంటే కండ క్టరు బస్సు ఆపుచేయించాడు. అందరూ సూర్యం చుట్టూ మూగారు. సూర్యం తన సీటు క్రిందా బస్సులోనూ అంతా గాలిస్తూ "మూడువేలు పోయాయి" అని అరవసాగాడు. అప్పు డొక రిద్దరు గట్టిగా, అసలు విషయ మేమిటి ? అని అడగ్గా, తను జేబులో మూడువేల రూపాయల నోట్లకట్ట పెట్టుకున్నానని అది ఎక్కడో జారి పోయిందనీ చెప్పాడు. అందరూ ఇంకా వివరాలు అడుగుతూంటే, తను పది గంటలకు ఆఫీసు నుండి బయల్దేరాననీ, జేబు రుమాల్లో కొన్ని వందల రూపాయనోట్లూ, పది రూపాయల నోట్లూ, మొత్తం మూడువేల రూపాయల నోట్లు కట్టగా కట్టి జేబులో పెట్టుకున్నాననీ, అది ఎక్కడో జారిపోయిందనీ చెప్పాడు. ఏడవ నారం భించాడు. కొందరు అతన్ని ఖంగారుపడవద్దనీ, దారిలో ఎక్కడైనా పడిపోయిందేమో, రోడ్డు మీద నడిచి వెళ్తూ చూడమన్నారు. కొద్దిసేపు ఈ సంభాషణ అయ్యాక బస్సు కదలసాగింది. సూర్యాన్ని ఓదార్చి, వెనక్కి వెళ్ళమని చెప్పి ప్రయాణికులు బస్సెక్కారు. సూర్యం కండ్ల మ్మట నీరు గారుస్తూ నడుస్తూ రామవరం వెళ్ళాడు. అతని కెదురుపడిన కొందరు అతని స్థితి చూచి, విషయ మేమిటని అడిగి తెలుసు కున్నారు.

సూర్యం ఆఫీసు డబ్బు మూడువేలు బాంకుకు

---

యుద్ధరంగంలోకి వెళ్ళేముందు గడ్డం శుభ్రంగా గీకించుకో వాలని అలెగ్జాండర్ తన సైని కుల్ని ఆదేశించేవాడు. గడ్డాలు పెరిగిఉంటే శత్రువులు వాటిని చిక్కించుకొని తలకాయలు వెనక్కు విరుస్తారని ఆయన భయం

ఎం. బాలకృష్ణ. (మద్రాసు)

---

కట్టేటందుకు తీసుకు వెళ్తూంటే పోయాయని రామవరమంతా నిముషాల్లో తెలిసిపోయింది. సూర్యం ఆఫీసులో కూర్చొని ఏడుస్తూ తన చుట్టూ మూగిన వాళ్ళకు ఈ వివరాలన్నీ తెలియ జేయ నారంభించాడు. కొందరు ఈ విషయం విశాఖపట్టణం హెడ్డాఫీసుకు తెలియబర్చితే మంచి దన్నారు.

ఒక వర్తకుడు, సూర్యం అంటే అభిమానం కలవాడు, కంపెనీకి ఫోనుచేస్తా నన్నాడు. ఆ వూరిలో ఒక సత్యనారాయణగారింట్లో మాత్రమే ఫోనుంది. వెంటనే ఆ వర్తకుడు, వారింటికి వెళ్ళి విశాఖపట్టణానికి ఫోను చేశాడు. రామ్‌లాల్‌తో, సూర్యం డబ్బు పోగొట్టుకున్న వైనం చెప్పాడు. రామ్‌లాల్ అంతా విని, తను వెంటనే కారుమీద రామవరం వస్తున్నాననీ, సూర్యాన్నేమీ గాభరా పడవద్దని చెప్పమని చెప్పాడు.

రామ్‌లాల్ వస్తున్నాడని తెలిసి సూర్యానికి కొంచెం వణుకు పుట్టింది. శ్యామ్‌బాబూ, డాక్టరు మిశ్రా మరికొంతమందీ అతన్ని ఓదారుస్తూ రామ్‌లాల్‌కు తా మందరం జరిగింది చెప్తామనీ, సూర్యం యొక్క మంచితనం గురించి చెప్పి దురదృష్టంవల్ల డబ్బు పోయిందని చెప్తామని, ధైర్యంగా ఉండమని చెప్పారు.

సాయంకాలం నాలుగు గంటలకు కారులో రామ్‌లాల్, మరి యిద్దరు మార్వాడీలూ—అతని గుమాస్తాలూ రామవరం వచ్చారు. రామలాల్‌ను చూడగానే సూర్యం ఏడవసాగాడు. అతని చుట్టూ ఉన్నవారు జరిగిందంతా చెప్పారు.

రామ్‌లాల్ పొట్టిగా, సన్నగావుండే నలభై ఏళ్ళ వ్యక్తి. అతని ముఖం ఎప్పుడూ గంభీరంగా ఉంటుంది. అతనిది చాలా కఠినమైన మనస్సనీ, పనిలో ఏమాత్రం తేడా వచ్చినా ఒప్పుకొనే మనిషి కాదనీ, అతనివద్ద పనిచేసేవాళ్ళందరూ అంటారు. సూర్యంమీద వచ్చిన ఆకాశరామన్న ఉత్తరాలు అతను జాగ్రత్తగా ఉంచాడు. అతను విశాఖ పట్టణం వచ్చిన దగ్గర్నుంచీ సూర్యాన్ని ఒక కంట కనిపెడుతూనే ఉన్నాడు.

మునీమ్ కంపెనీ, రామవరం బ్రాంచీ ఆఫీసు చుట్టూ ఆరోజు చాలామంది జనం చేరారు. లోపల ఆఫీసులో రామ్‌లాల్ సూర్యాన్ని వివరాలన్నీ అడిగాడు. సూర్యం వణికిపోతూ ఏడుస్తూ సరిగా మాట్లాడలేక పోయాడు. శ్యామ్‌బాబు, హిందీలో తను విన్న విషయమంతా రామ్‌లాల్‌కు చెప్పాడు.

"అన్ని రకాల నోట్లన్నీ కట్టగా కడ్తే అది ఎంతమాత్రం సైజు ఉంటుందని మీ అభి ప్రాయం ?" అని అడిగాడు హిందీలో రామ్‌లాల్, శ్యామ్‌బాబుని. సూర్యం చెప్పిన మాటల్ని బట్టి, అయిదు వందరూపాయల నోట్లూ తక్కినవి పది రూపాయల నోట్లూ, అయిదు రూపాయల నోట్లూ, మూడు వేలవి కావాలంటే—అది చాలా పెద్దకట్టే అవుతుంది. పాంటు జేబులో పట్టడం కష్టం. ఒకవేళ పట్టినా, అది జారిపోయినప్పుడు తెలియకుండా ఉండడం కష్టం. ఈ విషయాల్ని శ్యామ్‌బాబు కూడా ఒప్పుకొన్నాడు. అయినా ఏ దురదృష్టం వల్లనో ఇదంతా జరిగిపోయిందనీ శ్యామ్‌బాబు ఉద్దేశం.

రామ్‌లాల్ ఉద్దేశం మాత్రం అందుకు విభిన్నం. అతను గడానూ, అక్కౌంట్లూ అన్నీ పరిశీ లించి, సూర్యంవద్ద నున్న తాళం చేతులు తీసుకొని సూర్యాన్ని వెంటనే పనిలో నుంచి తొలగించినట్లు తెలియపరిచి పోలీసు రిపోర్టు కూడా ఇవ్వదల్చు కున్నానని చెప్పాడు. శ్యామ్‌బాబూ, మరికొంతమంది వర్తకులూ ఎన్నో విధాలుగా అతన్ని బతిమాలి, సూర్యాన్ని ఉద్యోగంలోంచి తీసివెయ్యద్దనీ, అంతగా కావాలంటే అతన్ని ఉద్యోగంలోనే ఉంచి, అతని జీతంలో నెలకు కొంత మొత్తం కొట్టివేస్తూ అతనివద్ద పోయిన డబ్బు, వసూలు చేసుకోమని చెప్పారు. అతని భార్యా బిడ్డలు మొఖాలను చూసైనా ఉద్యోగం ఉంచమన్నారు.

ఆ కొద్దిసేపటిలోనే రామ్‌లాల్‌కి శ్యామ్ బాబంటే కొంత గౌరవం కలిగింది. శ్యామ్‌బాబు తను ఆఊరు వచ్చి నెలరోజు లైందనీ, ఈ నెల రోజుల్లోనూ సూర్యం అంటే తనకు చాలా సద్భావం కలిగిందనీ చెప్తూంటే రామ్‌లాల్, సూర్యంమీద వచ్చిన ఆకాశరామన్న ఉత్తరాల్ని శ్యామ్ బాబుకిచ్చి చదివి అతని అభిప్రాయం చెప్ప

చేస్నాడు. అవన్నీ సూర్యం యొక్క పేకాటా, స్నేహితులూ, కమీషన్లూ మొదలైనవాటి గురించి. శ్యామ్‌బాబు వాటిని చదివి, రామ్‌లాల్‌తో ఏమీ మాట్లాడలేకపోయాడు. ఎంత కిట్టనివాళ్ళు రాసినా, సూర్యం యొక్క తప్పును కూడా కొంత వరకూ అవి బయటపెడుతున్నాయి. శ్యామ్‌బాబు, రామ్‌లాల్ మనస్సు ఇదివరకే సూర్యంమీద విముఖతతో నిండివుందనీ, ఈ సంఘటనతో పూర్తిగా విరిగిపోయిందనీ తెలుసుకున్నాడు. తను సూర్యం గురించి చెప్పి లాభంలేదని గ్రహించాడు.

సూర్యం, రామ్‌లాల్ కాళ్ళు పట్టుకొని గోల పెట్టడంవల్లా, ఊరి పెద్దలంతా అతని ఉద్యోగం మాత్రం తీయవద్దని కోరటంవల్లా, రామ్‌లాల్ చివరికి, సూర్యం కనుక వారం రోజుల్లో మూడు వేలూ కట్టేస్తే, ఉద్యోగంలో ఉంచటానికి తను ప్రయత్నిస్తానని చెప్పి కారెక్కి వెళ్ళిపోయాడు.

మరునాటి నుంచీ సూర్యం, డబ్బుకోసం ప్రయత్నం చెయ్యసాగాడు. తన ఇంట్లో ఉన్న ఖరీదైన వస్తువులూ, భార్య మెళ్ళో నగలూ అన్నీ అమ్మేశాడు. తెలిసినవా ళందర్నీ సహాయం చెయ్యమనీ ప్రార్థించాడు.

సూర్యం ఎదుట చాలమంది సానుభూతి చూపిస్తున్నట్లు మాట్లాడినా అతని వెనకాల, ఈ డబ్బు అతను నిజంగా పోగొట్టుకొనలేదనీ, కంపెనీ సొమ్ము తన యిష్టం వచ్చినట్లు దుర్వ్యయం చేశాడనీ అనసాగారు. అది సర్దుబాటు చెయ్యలేక ఈ ఎత్తు ఎత్తాడన్నారు. అందుకు శాస్తి అనుభవించవలసిందే నన్నారు.

ఎంతో మంచివాళ్ళనే, లోకం క్లిష్ట పరిస్థితులలో శంకిస్తుంది. అగ్నిపరీక్షలో తన పాతివ్రత్యాన్ని నిరూపించుకొన్న సీతాదేవినే అనుమానించిన లోకం సామాన్యుణ్ణి అనుమానించకుండా వూరుకొంటుందా ? అందులో సూర్యం అలవాట్లు అందరికీ తెలిసినవే. పైగా ఊరిలోనివా రెవరికీ తెలియదని సూర్యం అనుకొన్నా, ఆఖరిరోజున అతను సర్వన్నా, హరిశ్చంద్రుడూ మొదలైన వాళ్ళతో ఆడి చాలా సొమ్ము పోగొట్టుకొన్న విషయం కూడా, చూచాయగా అందరికీ తెలిసింది.

శ్యామ్‌బాబు సూర్యం అంటే చాలా అభిమానంగా ఉండేవాడు. కాని డాక్టర్‌కు అందరూ అన్ని విషయాలూ చెప్తూండడం, అవన్నీ డాక్టర్ శ్యామ్‌బాబుకు చెప్పడంవల్ల శ్యామ్‌బాబు జరిగినదంతా తెలుసుకున్నాడు. సూర్యం యొక్క తెలివితక్కువకు చాలా విచారించాడు. అతని మనోదౌర్బల్యం అతనికి ఎంత కష్టాన్ని తెచ్చిపెట్టిందో అర్థం చేసుకున్నాడు. లోకంలో కొన్ని చెడ్డపనులు చేసి కూడా కొందరు అభివృద్ధిలోకి వస్తుంటారు. వారికి గల సమర్థతా, అదృష్టాలవల్ల వారిని చూసి ప్రతివారూ వారివలెనే తాము కూడా నిర్వహించుకోగల మనుకొని, గోతులో పడుతూంటారు. పులిని చూసి నక్క వాతలు పెట్టుకున్నట్లు! జూదంలో గెల్చినవాళ్ళనే దృష్టిలో పెట్టుకొని, సూర్యం తను కూడా గెలుస్తాననే అనుకున్నాడు. కాని గెల్చినవాళ్ళకన్నా వోడిపోయేవారే ఎక్కువనీ, వోడిపోయి సర్వనాశనమై అనేక కుటుంబాలు కుమిలి కృశిస్తూంటాయని అతను తెలుసుకోలేకపోయాడు స్వయంగా అనుభవం అయ్యేదాకా. కాని అనుభవానికి అతను తట్టుకోలేడని శ్యామ్‌బాబుకి తెలుసు. అయినా చేయగలిగిందేమీ లేదని వూరుకున్నాడు.

సూర్యం ఎలాగో కష్టపడి, చాలామందిని సహాయం చెయ్యమని ప్రార్థించి కొందరివద్ద అప్పుచేసి, తన యింట్లో ఉన్నవి పాత్రసామానూ బట్టలూ వగైరా (ఉద్యోగం దొరికితే మళ్ళీ కొనుక్కోవచ్చుని) వస్తువులు కూడా అమ్మి పది రోజులలో మూడువేల రూపాయలను సమకూర్చుకొని విశాఖపట్టణం వెళ్ళి, ఆ సొమ్ము కంపెనీలో కట్టేశాడు. తరువాత రామ్‌లాల్ ఉండే గదిలోకి వెళ్ళి, అతనితో తన సొమ్ము కట్టేశాననీ, తన ఉద్యోగం తన కిప్పించమనీ అడిగాడు.

రామ్‌లాల్ సూర్యం లాంటివాళ్ళకు ఆ కంపెనీలో తావు లేదనీ, మరెక్కడైనా ఉద్యోగం చూసుకోమని చెప్పాడు. సూర్యాన్ని మరి మాట్లాడనీకుండా బయటకు వెళ్ళగొట్టమని నౌకరుతో చెప్పాడు. సూర్యం అప్పు డర్థం చేసుకున్నాడు, తనకు ఉద్యోగం యిస్తానని ఆశపెట్టి రామ్‌లాల్ తనచేత అంత డబ్బు ఒకసారి కట్టించాడని.

సూర్యం రామవరం ఎలాగో చేరుకొని, ఈ విషయం శ్యామ్‌బాబూ మొదలైనవాళ్ళతో చెప్పాడు. అంతా అతని దుస్థితికి విచారించారు. కానీ ఎవరూ అతనికి సహాయంచేసే స్థితిలో లేరు.

ఆవాళ సూర్యం అలా ఆలోచిస్తూనే కూచున్నాడు. అతని భార్య ఎంత బ్రతిమాలినా భోజనం చెయ్యలేదు. రెండు చేతుల్లో తల పెట్టుకుని ఏడ్వ నారంభించాడు. తన గతేమిటి ? తన భవిష్యత్తేమిటి ? భార్యా బిడ్డలెలా పోషిస్తాడు. చివరి కతని కొక వూహ తట్టింది. భార్యను పిల్చాడు. ఆమె అతనివైపు చూసింది. అన్నం వడ్డించమన్నాడు. వడ్డించింది. పిల్లలు అంతకుముందే నిద్రపోయారు. భోంచేసి సూర్యం మంచంమీద పడుకున్నాడు. భార్య కూడా పడుకొంది.

ఒకటి,రెండుగంటలు గడిచాయి. సూర్యంలేచాడు. రామవరం రాత్రిపూట వచ్చే బండి పక్క స్టేషనులో కూత కూసింది. సూర్యం భార్యా బిడ్డలవేపు చూశాడు.

అతని భార్యా బిడ్డ లిద్దరూ హాయిగా నిద్రపోతున్నారు.

సూర్యం వీధి తలుపు తీశాడు. మళ్ళీ వెనక్కి వెళ్ళి భార్యాబిడ్డ ల్నొకసారి చూశాడు. వాళ్ళ మొహా అమాయకంగా ఉన్నాయి.

బయట చీకటి దట్టంగా ఉంది. దూరాన్న రైలు, బ్రిడ్జీమీద నుంచి వస్తోన్న శబ్దం వినిపించింది. రైలాట్టే దూరంలో లేదు.

దుప్పటి తలమీద నుంచి ముసుగులా వేసుకొన్నాడు. తలుపు దగ్గరగా వేశాడు. చీకట్లో, రైలుపట్టాల కేసి నడవసాగాడు.

తన నెవరో వెంటాడుతున్న విషయం అతను గమనించనేలేదు. స్టేషను కొక ఫర్లాంగు దూరంలో నున్న ఒక స్థలాన్ని చేరుకున్నాడు. రైలుకోసం ఎదురుచూడసాగాడు. రైలు స్టేషనులోంచి బయల్దేరింది. దాని ఇంజను లైటు వెలుతురు పట్టాల మీద పడ్తోంది.

సూర్యం పట్టాలమీద పడుకున్నాడు. రైలు వస్తోంది.

రైలు ఇంజను చాలా దగ్గరలో ఉంది. పట్టాల మీద వెల్లకితలా పడుకొని, సూర్యం కళ్ళు మూసుకున్నాడు.

సూర్యం రెండు కాళ్ళు బలంగా పట్టుకొని, ఎవరో అతన్ని ఇవతల కీడ్చేశారు. ధణ ధణ ధణ శబ్దం చేసుకుంటూ రైలు వెళ్ళిపోయింది. రైలు పట్టాలకు కొద్ది దూరంలో, ఒళ్ళంతా చెక్కుకొని దెబ్బలు తగిలి పడిపోయిన సూర్యం లేచి నిల్చున్నాడు.

ఎదురుగుండా చీకట్లో శ్యామ్‌బాబు నిల్చొని ఉన్నాడు. శ్యామ్‌బాబు సూర్యం జబ్బ గట్టిగా పట్టుకొన్నాడు. సూర్యం, ఒకసారి అతని మొహంవైపు చూసి తల వంచేసుకున్నాడు. శ్యామ్‌బాబు "సూర్యం, ఇంటికి పద" అన్నాడు.

సూర్యం రెండడుగులు ముందుకువేసి ఆగిపోయాడు. ఏడుస్తూ కూర్చుండిపోయాడు.

"వద్దు శ్యామ్‌బాబూ. నా మానాన నన్ను పోనివ్వండి. నా భార్యా బిడ్డల మొఖం నే చూడలేను" అన్నాడు.

శ్యామ్‌బాబు అతని ప్రక్కనే కూచున్నాడు. "నువ్వు చేస్తున్న పని చాలా పొరపాటుపని. నువ్వు చనిపోవలసినంత అగత్యమేమీ రాలేదే. నీ ఉద్యోగం పోయినంతమాత్రాన నువ్వు అధైర్యపడితే ఎలా ?"

"లేదు శ్యామ్‌బాబూ. నా కెక్కడా ఉద్యోగం దొరకదు. నే చేసిన పనికి నన్నెవ్వరూ నమ్మరు. నే నుండడం కన్నా లేకపోతేనే మంచిది. వాళ్ళ నెవరైనా జాలిదల్చైనా పోషిస్తారు."

ఆ చీకట్లో శ్యామ్‌బాబు చిన్న చిరునవ్వు నవ్వడం సూర్యం కనిపెట్టలేకపోయాడు. "పిచ్చివాడా !" అనుకొన్నాడు శ్యామ్‌బాబు.

"అసలు జరిగిందేమిటో చెప్పు ?" అన్నాడు శ్యామ్‌బాబు.

సూర్యం ఒక్క నిముషం ఆలోచించి "మీతోటి నిజమే చెప్పదల్చుకున్నాను శ్యామ్‌బాబూ ! ఆ డబ్బు నిజంగా నేను పారేసుకోలేదు" అని జరిగిందంతా తను మొట్టమొదట పేకాడిన దగ్గర్నుంచీ అన్ని విషయాలూ శ్యామ్‌బాబుకు చెప్పాడు.

శ్యామ్‌బాబు అంతా విని "ఇదంతా నీ స్వయంకృతాపరాధమని గ్రహించావా ?" అని అడిగాడు.

"ఇప్పుడు తెలిసి ప్రయోజన మేమిటి ? శ్యామ్‌బాబూ ! తగిన శిక్ష ననుభవించాలిసిందే. నన్ను పోనివ్వండి" అన్నాడు సూర్యం.

ఒక్క నిముషం ఆలోచించి "ఫరవాలేదు సూర్యం. నువ్వంతపని చెయ్య నక్కరలేదు. నువ్వు నిజంగా పశ్చాత్తాప పడుతున్నావని నేను విశ్వసిస్తున్నాను. నీ కొక అవకాశం కల్పించదల్చుకొన్నాను. నాతో రా !" అని శ్యామ్‌బాబు, సూర్యాన్ని ఇంటికి తీసుకువెళ్తూ ఏదో చెప్పసాగాడు. ఆ చీకటిలో సూర్యం, శ్యామ్‌బాబు మాటలు వింటూ కొత్త వెలుగును చూడసాగాడు. మరొక గంట తరువాత, అదే చీకటిలో, బిడ్డ నెత్తుకున్న సూర్యం, రెండోబిడ్డ నెత్తుకున్న అతని భార్యా కృతజ్ఞతతో శ్యామ్‌బాబును తల్చుకుంటూ రామవరం వదలి వెళ్ళిపోయారు. వారికి వీడ్కోలిచ్చిన శ్యామ్‌బాబు చీకటిలో వాళ్ళదృశ్యమయ్యాక ఒక దీర్ఘనిశ్వాస విడిచాడు. ప్రతి జీవికీ జీవితంలో ఎప్పుడూ వెలుగే ఉండదు. కొన్ని రోజులు అంధకారం కూడా ఉంటుంది. అప్పుడతనికి ఒక ఆశాకిరణం లభిస్తే ! ఎంత ఆనందిస్తాడు ! ఆ ఆశాకిరణాన్ని అతనికి చూపించిన తోటి జీవికి ఎంత తృప్తి లభిస్తుంది ! (సశేషం)

ఉపహారము కూడ నమ్రగ్రహింపఁజాలరితిమి. నృసింహ జయంతి లోపల సభ ఏర్పాటు చేయుటకు కలసి వచ్చినచో మరికొంత వ్యవధాన మిచ్చుటకు గూడ సిద్ధముగా నున్నాము.

"ఆ దేవికిని కలసిరానిచో, మేమే స్వయముగా తెంతు ఢక్కనేకాక, బంగారు ఢక్కను, వెండి ఢక్కను ముందుంచుకొని మీ ఓటమిని, శ్రీ విద్యానగర వీథి వీధులలో వాడవాడలలో ఉద్ఘోషించుచు నృసింహ జయంతి వెళ్ళిన మరునాడు మధ్యాహ్నము నుండి పూరేగగలము.

"మేము తొందరపడలేదని అందరు తెలిసికొను నిమిత్తము ఈ పత్రిక ప్రతులను శ్రీ విద్యానగరములోని పండిత ప్రకాండులకును, కవీశ్వరుల కును మాత్రమేకాక, కటకపాలునకును ప్రధాన రాజపురుషులకును పూజ్యులగు శ్రీపీఠాధీశ్వరుల సాన్నిధానమునకును గూడ పంపుచున్నాము.

శార్వరి వైశాఖ శుద్ధ......శ్రీనాథభట్టు."

ఆ పత్రిక ప్రతులు శతోత్తరముగా వ్రాయించి శ్రీ విద్యానగరములోని పండితులకును, కవీశ్వరులకును రాజ పురుషులకును ఆనాడే అందజేసెను. కటక పాలుడగు సాళువరాయని తెలుంగురాయనికి కొండ వీటి స్థానాపతియు, శ్రీ పీఠాధీశ్వరులకు నృసింహ భట్టును అందించిరి. డిండిమునకు పోతన, దుగ్గ నలు వెళ్ళి యిచ్చిరి.

ఆ పత్రము చూచినదే తడవుగా అరుణగిరి నాథ డిండిమభట్టు మండిపడి క్రోధోద్రిక్తుడై దానిని ముక్కముక్కలుగా చించి పారవేసి ద్వారపాలకుని పిలిచి, "ఈ వెధవలను బయటికి గెంటివేయి! మరల మన యింటిలో అడుగుపెట్టనీయకు!" అని శాసించెను. ద్వారపాలకుడు సంభ్రమముతో వచ్చి, ఆ బ్రహ్మచారుల రెండు రెక్కలు మోటుగా పట్టుకొని వాకిటిలోనికి లాగికొనిపోవుచుండెను.

దుగ్గన బిగ్గరగా 'మా బావ మీ ప్రత్యుత్తరము తెమ్మన్నాడు' అని అరచుచుండెను.

పోతన 'నీ కంటె బలిచక్రవర్తే నయము. ఆతడు బ్రహ్మచారులను పరాభవింపలేదు. ఏమి కవిసార్వభౌముడవయా నీవు! త్వరలోనే శాస్తి జరుగు తుందిలే! అందుకే ఈ దుర్బుద్ధి పుట్టింది!" అని కోపావేశముతో డిండిముని శపించుచు, త్రోయు చున్న ద్వారపాలకుని త్రోవులకు ముందుకు గంతులు పెట్టుచు తూలుచు పోవుచుండెను.

ఆ గందరగోళము విని అంతలో గృహాభ్యంతరము నుండి గౌరీదేవి త్వరితగతి వచ్చి, శ్రీగురువుల యాశ్రమములో తాను తరచుగా చూచిన దుగ్గన పోతనలను గుర్తించి, వణికిపోవుచు భర్తకు దండము పెట్టుచు, "అయ్యో, అయ్యో ఎంత పని చేయు చున్నారండీ! వా రిద్దరూ మానవమాత్రులుకారు. బలరామ కృష్ణులండీ, నరనారాయణ ఋషులండీ! అయ్యో వారిని ఆదరముతో పిలిపించండి—నేనైనా వారిని బ్రతిమాలుకొని ప్రసన్నులను చేసికొందును!" అనుచు నెత్తిన నోరు పెట్టుకొని విలపించెను. డిండిముడు వినిపించుకొనలేదు.

పోతన దుగ్గనలు ఆవేశముతో నడచుచు వీథి లోనికిపోయి బిగ్గరగా డిండిముని నిందించుచు, కంటగొట్టులవలె ఎఱ్ఱవడ్డ ముఖములతో అశ్వము లెక్కి, చబుకులతో చరచుచు క్షణకాలములో విడి

# కవిసార్వభౌముడు

23-వ పేజీ తరువాయి

దికి చేరి, పండితుల మధ్యనున్న శ్రీనాథుని యెదుట నిలిచి అర్థము కాకుండ ఏమేమో మాటలాడుచు కన్నీరు కార్చసాగిరి.

శ్రీనాథుడు దిగ్గనలేచి, ఇద్దరిని ఒక్కసారిగా ప్రేమాతిశయముతో తన దీర్ఘబాహువులతో కౌగిలించుకొని, శిరస్సులు, బుగ్గలు ముద్దు పెట్టు కొని, కన్నీరు తుడిచి ఓదార్చి, 'అక్కడికి పసిపిల్లలను మిమ్మును పంపిన పొరపాటు నాది. అతడు దురుసుగా ప్రవర్తించునని ఊహించలేదు నాయన లారా! అతనికి చేటు మూడినది' అనెను.

ఆ మాటలతో వారు తేరుకొని ఉత్సాహము తెచ్చుకొని 'ఆ మాటే మేమూ చెప్పివచ్చినాము' అనిరి. శ్రీనాథుడు వారి నిద్దరిని ఆదరపూర్వకముగా శరీరములు కరములతో నిమిరి, "లోపల మీ అక్క మీ కోసము దిగులుపడుచున్నది. వెళ్ళి కనపడి రండి!" అని పంపివేసెను.

ఆక్షణమునుండి కొండవీటి జన మిక్కిలి సంద డిగానుండెను. చిత్రకారశిల్పి యొకడు వచ్చి మూడు ఢక్కలయాకారము లెట్లుండవలెనో, వాని యాకా రము లెట్టివో, నిర్ణయించెను. వెంటనే బంగారు పనివారు బంగరు ఢక్కను, వెండి పనివారు వెండి ఢక్కను తయారుచేయ నారంభించిరి. సమ్మెటలపై సుత్తి దెబ్బలతో ఆ ప్రదేశము మారుమ్రోగు చుండెను. కంచుఢక్క పోత పోయుటకు మూస సిద్ధముచేసి ఆరబెట్టిరి. ముత్యాలపనివారు ముత్యాల చేరులు సిద్ధము చేయుచుండిరి. చర్మకారులు చర్మములు పదనుచేయసాగిరి.

మరియొకవంక వడ్రంగులు ఆ ఢక్కలకు అను కూలమైన ఆకారములలో మూడు శకటములు. రమ్యోన్నతములుగా సిద్ధము చేయ నారంభించిరి రంగులు వేయువారు రంగులు వేయుటకును, కమ్మ రులు కమ్ములు కూర్చుటకును సిద్ధమైరి. ఆ బండ్లలో నొకదానికి గుఱ్ఱములు, ఒకదానికి వృషభ ములు, కంచుదానికి కంచర గాడిదలు తెప్పించి యుంచిరి. మేళ తాళములవారు నట్టువకత్తెలు నిర్ణయింపబడిరి.

ఇక్కడ నిట్లుండగా శ్రీ విద్యానగరములోని కవి పండితలోకము . గగ్గోలుపడుచుండెను. పండితు లాకావ్యము చూడలేదు. విన్న యువకవులు, "ఏమిది! శ్రీనాథునికి ఏమి అహంభావము! మనబోంట్లకే అన్ని తప్పులు కనిపించినవే. మహా విద్వాంసుడగు డిండిమునకు ఒక్క తప్పు కూడ కనిపింపదా?" అనుకొనుచు రెండవనాటి సాయంకాలమున ముమ్మకవి యింటికి ఒక్కరొక్కరే గోష్ఠికి చేరిరి. అందరు శ్రీనాథుని అధిక్షేపణ పత్రికను ప్రస్తావించువారే. కొంత తడవు ముమ్మకవి మౌనము వహించెను. కుశాగ్ర బుద్ధియగు నా ద్రావిడ పిండమునకు సందేహ మొకటి కలిగి యిట్లనెను: "మీరు అందరూ ఒకటి గమనించినారా? మన కానాడు ఏవో కొన్ని శ్లోక ములు వినిపించెనేకాని, మనలో ఒక్కరికైనా వ్రాత ప్రతి చేతికీయలేదు. నామాత్రానికి నేను ప్రొద్దు

పోవుటచేత యాదాలాపముగా విన్నాను. శ్రద్ధగా వినలేదు. మీ కెవరికైనా శ్లోకములు జ్ఞాపక మున్నవా?"

ఉన్నవని ఇద్దరు ముగ్గురు నాలుగైదు శ్లోక ములు చదివిరి. ముమ్మకవి ఒక్కొక్కటి రెండు మూడు మారులు చదివించి వినెను. శ్రద్ధగా నాలకించి యాలకించి విరిసిన ముఖముతో "ఆడా, ఆడా, ఎన్న తెలివి శ్రీనాథభట్టా! ఎన్నా శ్లకు డిండిముల వ్యాధికి చికిత్స చేయగల వైద్యుడు దొరికినాడు!" అనెను.

వారు తెల్లవోయి ఏమిటని ప్రశ్నింపగా ముమ్మ కవి, "అవి నిర్దుష్టములు. ఆహా, శ్రీనాథుడు రొంబ ఉపాయశాలి" అని నిర్ధారించెను.

శ్రీ విద్యానగర విద్వాంసు లెవ్వరు నా కావ్యము కని విని యుండలేదు. కనుక ఈ స్పర్ధాపర్యవసాన మెట్లుండునో యని వ్యగ్రతతో నిరీక్షించుచుండిరి.

గౌండ పండితులును వారి యనుయాయులును శ్రీనాథుని ననేక విధముల నిందించుచు తాము డిండిమునకు సర్వ విధముల బాసటగా నిలుతుమని ప్రకటించుచు, శ్రీనాథుడు తమ గౌడవీథిలో నూరేగ సాహసించినచో, ఆటంకము కలిగింతుమని ప్రగల్భ ములు పలుకుచు, శ్రీనాథుని ఢక్కాదులు ధ్వంసము చేయుటకు విద్యావల్లును అతని గరిడీవారిని పూర్ణిమ నాటి మధ్యాహ్నమునకు గౌడవాటికలో సిద్ధముగా నుండ నేర్పాటు చేసిరి.

నృసింహ జయంతి వచ్చినది. ఆనాటితో డిండి మున కిచ్చిన గడువైపోవును. ఆత్మాతిశయముతో పైత్య భ్రమ కప్పియున్న డిండిముడు తన అధి క్షేపణపత్రికకు ప్రత్యుత్తరమీయడని శ్రీనాథు డెరుగును. దానికై యాతడు ప్రతీక్షింపలేదు.

ఆనాడు శ్రీనాథుడు శ్రీ లక్ష్మీ నృసింహస్వామిని కలశములో నావాహనచేసి, భక్తి శ్రద్ధలతో పూజిం చెను. ఆ పూజ ప్రారంభించినప్పటినుండియు పోతనకు చిత్రమైన యావేశ మావిర్భవింపసాగెను. ఆతనికి డిండిమునియింట జరిగిన యవజ్ఞకు కోపము పోలేదు. బలి చక్రవర్తి నానాడు తలపించినప్పటి నుండి త్రివిక్రమావతారమును ధ్యానింపసాగెను. ఈనా డాతనికి నృసింహస్వామి విజృంభణము అంత రంగములో పొంగారుచుండెను. పూజావసానమున శ్రీనాథుడు, "పోతా, నృసింహమూర్తిని గూర్చి పద్యము లేమైనా చెప్పినావా?" అని ప్రశ్నించెను.

ఆ మాటలు విన్నదే వ్యవధానముగా పోతన ముఖము రూపాంతర మొందినది. హిరణ్యకశిపుని చెండాడు చున్న భీకర సింహముఖ మావేశించినది. సింహేంద్ర మధ్యరాగమున ఒడలు తెలియని యవస్థలో నీ పద్యము చదివెను.

"చించున్ హృత్కమలంబు శోణితము
వర్షించున్ ధరామండలిన్
ద్రెంచున్ గర్కశనాడికానలులు
భేదించున్ మహా వృక్షమున్
ద్రుంచున్ మాంసము మూక్ష్మ
ఖండములుగా దృష్టాసురున్ వ్రచ్చి ద
ర్పించున్ బ్రేవులు కంఠమాలి
కలు గల్పించున్ నఖోద్భాసియై"

ఇట్లు చదువుచు, తల రెండుచేతుల వ్రేళ్ళను వంచి నఖములు ప్రదర్శించి, ఆవేశముతో నవకుడై దుగ్గన

ఘంటములపై మ్రోగెను. విద్వాంసులందరు నిర్విణ్ణులై చూచుచుండిరి. శ్రీనాథుడును మొదట ఒక్కింతుక విభ్రాంతుడై యుండి, వెంటనే స్మరించి నృసింహమూర్తిని బ్రహ్మరుద్రులు చేసిన స్తవములతో స్తుతించెను.

> "యతోస్య నంతాయ దురంత శక్తయే
> విచిత్ర వీర్యాయ పవిత్రకర్మణే
> విశ్వస్య సర్గస్థితి సంయమాన్ గుణైః
> స్వలీలయా సందధతేఽవ్యయాత్మనే."
>
> *   *   *
>
> "కోప కాలో యుగాన్త స్తే
> హాతో యు మసురోల్పకః
> తత్సుతం పాహ్యుపసృతం
> భక్తంతే భక్తవత్సల!"

శ్రీ దేవి పూజా శంఖములోని అమృత తీర్థము గ్రహించి పోతన ముఖమున ప్రోక్షించి తమ్ముడా! లే!" అన్నది. వగము స్మృతి వచ్చి పోతన ఈ పద్యము చదివెను:

> "ప్రాభవ మొప్ప నుత్కట కృపా
> మతియై కదియంగ జేరి సం
> శోభితదృష్టి సంఘముల జూచుచు
> బాలుని మౌళియందు లో
> కాభినుతుండు వెట్టె ననురాంతకు
> డుద్భట కాలసర్ప భీ
> తాభయదానశస్తము ననర్ఘశు
> మంగళ హేతు హస్తమున్"

ఆ పద్యము చదువుచునే పోతన శాంతముగా కన్నులు తెరచెను. వెంటనే శ్రీనాథుడు వెలిగించి యిచ్చిన కర్పూర హారతి శ్రీదేవి పట్టగా పోతన ఆనందము విరియుచున్న ముఖముతో ఆ జ్యోతికిని అది పట్టిన అక్కకును నమస్కరించెను. ఆ పైనాత డే విశేషమును జరుగనట్లే స్వస్థుడై ప్రవర్తించెను.

శ్రీనాథు డానాడు సాయంకాలవేళ శ్రీ విద్యానగరములోని వేదవిదులను ఆహ్వానించి, మహా వైభవముగా వైశాఖ పూజ నిర్వర్తించెను. వారలనాతడు స్వయముగా అష్ట గంధములతో వాసించుచున్న శ్రీచందనముతోడను పుష్ప మాలికలతోడను అలంకరించి, ధూపదీపములతో నర్చించి, చూతఫలములు సువర్ణములు గల కర్పూర తాంబూలము లర్పించి, వట్టివ్రేళ్ల వీవనలతో విసిరి తాపోపశాంతి కావించి, శ్రీ లక్ష్మీనృసింహ ప్రసాదమును నివేదించి నమస్కరించెను. వారందరు అభీష్టఫలావాప్తిరస్తు అని శ్రీనాథుని నాశీర్వదించిరి.

నృసింహ జయంతితో డిండిమున కిచ్చిన గడువు తీరినది. మూడు ఢక్కలు శకటములు అశ్వాదులు మేళ తాళాదులు సర్వము సమీచీనమైనవి. డిండిములు ప్రత్యుత్తర మీయలేదు. రాజ పురుషులు కల్పించుకొనలేదు. నిర్ణీత దినమున శ్రీనాథు డుత్సవము జరుపునెడల, తెలుగురాయడు నగర భటులను శాంతముగా జరుగుచున్నంతవరకు నూరకుండుడనియు, అల్లరి జరుగునట్లున్నచో వెంటనే తనకు వేగిరిచే వార్త పంపి, తాను వచ్చువరకు ఉభయ పక్షములను తొందరచేయవద్దనియు శాసించెను.

పూర్ణిమ వచ్చినది. శ్రీనాథు డా మధ్యాహ్నవేళ మహేశ్వరు నారాధించెను. మూడు ఢక్కలును మంత్రాక్షతలతో సంస్కరింపబడెను. ఈశ్వరుని ఆత్మ ప్రదక్షిణ నమస్కారము లొనర్చిన పిమ్మట రాజోపచారముల సమయములో 'వాద్యం సమర్పయామి' అనుచు వాదకులచే మూడు ఢక్కలు వాదింపజేసి ఆ విజయ ఢక్కానాదము మహేశ్వరున కర్పించెను.

అందరు సుష్ఠుగా భోజనములు కావించి యించుక తడవు విశ్రమించిరి.

అంతట ఊరేగింపు సాగినది. ముందు నట్టువకత్తెలు బలి విగ్రహము కీర్తించు గీతము లాలాపించుచు నృత్యము చేయుచు నడచుచుండిరి. వారి వెనుక ఆడ గుర్రములు పూంచిన శంఖాకార శకటముపై బంగరు ఢక్క మ్రోయించువారు తరలిరి. దానివెంట వృషభములు పూన్చిన చక్రాకృతికల శకటమున వెండి ఢక్క మొరయుచుండెను. దాని తర్వాత ధనురాకారముగల శకటముపై కంచు ఢక్క మ్రోగించు



మీరు చెప్పిన ప్రత్యేక భీమా పట్టా మా ఆయన పేరున తీసుకుంటే, ఎంత వస్తుందంటాగు? అని అడిగింది ఒక ఇల్లాలు భీమా కంపెనీ ఏజంటును.

"ఆయన మామూలుగా చస్తే రు 10 వేలు; ప్రమాదంలో చస్తే రు 20 వేలు; బుద్ధిపూర్వకంగా చస్తే 30 ఏళ్లు మీకువస్తాయి" అని ఆ ఏజెంటు శపీమని సమాధానం చెప్పాడు.

పి. మల్లికార్జునరావు (కర్నూలు)

చుండిరి. అది సరిగా డిండిముని కంచు ఢక్క వలెనే ఉండెను. దానిని కంచర గాడిదలు లాగుచున్నవి.

ఆ ఢక్క లిట్లు మ్రోయుచుండ ఉద్ఘోషకులు సంస్కృత ప్రాకృత కర్ణాటాంధ్ర భాషలలో శ్రీనాథుని విజయమును డిండిముని పరాజయమును బిగ్గరగా చాటుచుండిరి—శ్రీనాథభట్టు జయించినారు. ఢమ ఢమా! అరుణగిరినాథు లోడినారు. ఢమ ఢమా! గౌడ డిండిమ డిండిమము శ్రీనాథ హస్తగతమైనది ఢం ఢం!—

ఆ వెనుక శ్రీనాథభట్టు పోతన, దుగ్గనల కైదండ గొనుచు మిత్ర పండితులతో వికసితముఖుడై సల్లాపించుచు పాదచారియై వెళ్లుచుండెను. అందరు నాగరక వేషములు ధరించిరి.

అంతటికినిముందు మహాగద ధరించి పర్వతమల్లును వెనుక ఇరువైపుల నాతని శిష్యులును నడుచుచుండిరి. అశ్వారూఢులైన శ్రీ విద్యానగర రక్షకులు కూడ నా యుత్సవమున కపూర్వశోభ చేకూర్చిరి.

అట్లు వారు నివసించుచున్న వీథిలోను బ్రాహ్మ వీథులలోను ఉత్సవము శాంతముగా గడచినది. ప్రతి వారును ఇండ్లలోనుండి బయటికివచ్చి చూచి, ఆశ్చర్యవిభ్రాంతులై గుసగుసలాడుచుండిరి.

కర్ణాట బ్రాహ్మణవీథి చేరునప్పటికి ఇండ్లలో నుండి ఇంచుక కలకలము సాగినది. లింగన చయను మందిరము వచ్చెను. శ్రీనాథుడు లోనికేగి, చయనులకును, ఆయన త్రేతాగ్నులకును వందన మాచరించెను. చయనులంతయు సంప్రీతినొంది శ్రీనాథుని వీథిలో నిలిపి, తన చిన్ని కుమార్తెలు—స్వాహా, స్వధా—యనువారిచే మంగళహారతి ఇప్పించెను. అది చూచి ఆ వీథి యంతట ఇంటింటను కర్ణాట కన్యకలు కన్నులపండువుగా వచ్చి శ్రీనాథునకు మంగళ హారతులు పట్టిరి.

ఇప్పు డా యుత్సవము గౌడ డిండిము లుండు గౌడ బ్రాహ్మణ వీథిని సమీపించినది. గౌడ వీథిలో నుండి పెద్దగా కేకలు వినవచ్చినవి. వెంటనే నగర భటులు కటకపాలునకు వేగిరిచే వార్త పంపి శంఖ వాదములు చేసిరి.

శ్రీనాథుడు శాంతముగా నడచుచుండెను. పోతన దుగ్గనలు ఉత్సాహముతో గంతు లిడుచుండిరి. మేళము వారు ఢక్కా శకట వాహకులు వందిమాగధులు జంకుచుండిరి.

గౌడ వీథిలో పర్వతమల్లు పది యడుగులు వేసినంతనే, గదాధరులైన విద్యామల్లుడు నతని శిష్యులు గదల త్రిప్పుచు, నాటోపముగా నెదురైరి. అంత వరకు భుజముపైనున్న పర్వతమల్లు గదయు లేచినది. విద్యా పర్వతుల గదలు కలియుటకు సిద్ధముగా నుండెను. రెండు వైపుల గందరగోళముగా కేకలు వేయుచుండిరి.

చప్పున శ్రీనాథుడు ముందుకు పరువెత్తి మల్లుర మధ్య నిలిచెను. ఆతడు సామవాక్యములతో పర్వతమల్లు గదను నగర రక్షకుల కిమ్మనెను. అత డిచ్చిన పిమ్మట శ్రీనాథుడు విద్యామల్లువంక తిరిగి తన కాగద యిమ్మని చేయి చాచెను.

విద్యామల్లు గద కూడ పర్వతమల్లు గదవలెనే మిక్కిలి బరువైనది. శ్రీనాథు డది మోయలేడను ధీమాతో విద్యామల్లు తన గదను రెండు చేతులతో శ్రీనాథున కందిచ్చెను. శ్రీనాథుడు దాని నవలీలగా ఒంటిచేతితో గ్రహించి రాజభటుల కందించెను. అది చూచి విద్యామల్లు నిర్ఘాంతపడి, శ్రీనాథుని పాదములంటి నమస్కరించి, తా నడ్డము తొలగి తన శిష్యులనందరిని గూడ ప్రక్కకు తప్పుకొనుడనెను. ఇప్పుడావల గౌడ బ్రాహ్మణులును వారి యనుయాయులే మిగిలిపోయిరి.

మరల నట్టువకత్తెలు గీత మందుకొని ముందుకు అడుగుపెట్టుచుండిరి. ఒక్కుమ్మడిగా గౌడులు వారిపైబడి మృదంగములు, తాళములు, తిత్తులు లాగికొనబోవుచుండగా నగర రక్షకులు అడ్డము వచ్చి, మేళము చుట్టును చక్రాకారముగా నిలిచి ప్రక్కకు తీసికొనిపోయిరి.

గౌడులంతట దౌర్జన్యముగా ఢక్కా శకటములపై బడబోవుచుండిరి. వెంటనే వెనుకమున్న ఆంధ్ర పండిత బృందము వారి నడ్డగించెను. కొంత తడవు అటు వారును ఇటు వీరును కేకలు పెట్టుచుండిరి. కోపావేశముతో వారు పలుకుచుండిన దూషణ వాక్యము

# కవిసార్వభౌముడు

లేదో స్పష్టముగా తెలియరాకుండెను. ఉభయ పక్ష ములను చేతులనున్న కొమ్ము తెంబులు హస్తము లతోపాటు పైకి లేచుచుండెను. అక్కనమూరి తన కొమ్ము చెంబును చేతనున్న పన్నని యంగ వస్త్రమునకు ముడివేసి చక్రాకారముగా త్రిప్పుచు ముందుకు దూకెను.

శ్రీ విద్యానగరములో బ్రాహ్మణు లట్లు కొట్లా టకు దిగుట యరుదు. అందును పండితుల కొట్లాట యశ్రుతపూర్వము. సాధారణముగా రాజ భటులు పై అధికారుల యాజ్ఞ లేనిది బ్రాహ్మణు లపై చేయి వేసికొనుటకు సాహసింపకుండిరి. భటు లుభయ పక్షములను బ్రతిమాలుచుండిరి.

సరిగా చేతులు చేతులు కొమ్ము చెంబులు కొమ్ము చెంబులు కలియుటకు సిద్ధముగా నున్న సమ యమున మహా వేగముగా కటకపాలు డాశ్విక భటు లతో వచ్చి గుర్రము దిగి, రెండు బృందముల మధ్యను దర్పముగా నిలిచి, రెండు చేతు లెత్తెను. రెండు పక్షములు నిశ్శబ్దము లయ్యెను.

మంం దాతడు గౌడులవైపు తిరిగి, ఏమిటీ యల్లరి అని ప్రశ్నించెను. వారిలో వృద్ధుడు ముందుకువచ్చి, "ఆహా! తమరే దయచేసినారు. ఎంత అదృష్టము! శ్రీ అరుణగిరి నాథులకు రెండు తరములుగా డిండిమము విద్యాతిశయ గౌరవ చిహ్నముగా శ్రీ విద్యానగర ప్రభువులు ప్రసాదించి నారుగదా! అటు చూడండి ప్రభూ! ఆ కొండవీటి పండితమన్యుడు, వ్యాకరణములో అ ఇ ఉణ్ణులు రాని కుంక, డిండిమ భట్టారకులను జయించి నానని అవహేళన చేస్తూ, మూడు ఢక్కలు మ్రోగించుకొంటూ, వీథులవెంట ఎట్లా వూరేగు తున్నాడో చూడండి. ఈ ఖచ్చాకోరు! వానికి ఇవి ఎవరిచ్చారో కనుక్కోండి. వాటిని వెంటనే పగులగొట్టి పారవేయించండి ప్రభూ!" అనెను. వెనుకనుండి గౌడులు — అట్లా, అట్లా! అనుచు సంతోషముతో వెర్రి కేకలువేసిరి.

కటకపాలు డప్పుడు శ్రీనాథునివంకకు తిరిగి, "ఏమిటీ డిండిమాడంబరము కవీశ్వరా?' అని ప్రశ్నిం చెను. శ్రీనాథు డలవోకగా, "మీకు తెలియని దేమున్నది? మీకు ముందుగానే ఈ విధముగా డిండి ముల ఓటమి చాటుచు ఊరేగుదుమని పత్రము ప్రతి పంపుకొంటిమిగదా! మామానసోల్లాసము తప్పుల తడక బూతులబుంగ అని అధిక్షేపించి, పండిత సభలో నిలిచి సమర్థించుకొనలేనప్పుడు, మేము గెలిచినట్లు ప్రకటించుకొనుటకు మాకు అధికారములేదా? ఇప్పటికైనను డిండిములు పండిత సభ నంగీకరించునెడ ప్రస్తుత మీ యుత్సవము నిలిపి సభా పర్యవసానము నిరీక్షింపగలము!" అనెను.

తెలుగురాయడు, ఉభయపక్షముల పండితులకు నమస్కరించి, "మీ బోంట్లు ఇట్లు చేతులు కలుపు కొని వీథిలో కొట్లాడుకొనుట ఎవ్వరికిని గౌరవ ప్రదముకాదు. క్షేమము కూడ కాదు" అని యాదే శించెను. అంతట తన భటుల నక్కడనే నిలిపి అశ్వా రూఢుడై, డిండిముల మందిరమున కరిగి కొలది సేపు సంప్రదించి వచ్చి, శ్రీనాథునితో నిట్లనెను. "మీరు కోరినట్లు త్వరలో పండిత సభ చేయించుట కేర్పాటు చేయింతును. శ్రీ దేవరాయ చక్రవర్తుల సమక్షమునసే సభ జరిపించుటకు యత్నించెదను. నియమములు సభాసమయము ప్రభువులతో విన్న వించిన పిమ్మట ఉభయులకు త్వరలో తెలిపెదను."

"ధన్యోస్మి! మహేశ్వరుడు మీకు సర్వమంగళములు ప్రసాదించుగాక!" అని శ్రీనాథుడు తెలుగురాయని నాశీర్వదించి, తన యుత్సవ జనమును నిశ్శబ్దముగా మరియొక వీథిని విడిదికి పోవ నాజ్ఞాపించెను. గౌడులు తమకు మహా విజయము చేకూరినదని సంతోషముతో పెద్దగా మాటాడుకొనుచు తమ తమ గృహములలోని కేగిరి. అప్పుడు సూర్యు డస్తమింపబోవుచుండెను.

ఆనాటి ఊరేగింపు పర్యవసాన మేమగునో తెలిసి కొను కుతూహలంతో, ప్రక్క వీథులలోచేరి యంత వరకు తొంగిచూచుచున్న యువకవులు ఇప్పు డొక్కరొక్కరే శ్రీనాథుని విడిదికి చేరుకొన సాగిరి. కొంతవడికి నారణప్పతో కలసి ముమ్మకవివచ్చి శ్రీనాథుని నభినందించి, "శ్రీనాథభట్టా, ఇప్పు డైనా మమ్ము ఆ మానసోల్లాసకావ్యము రెండు కళ్ళతో చూడనిత్తువా?" అనెను. శ్రీనాథుడు నవ్వుచు, 'అవశ్యము, మీ రెప్పుడు చూపమంటిని ?' అనుచు ఒక ప్రతి దుగ్గనచే తెప్పించి ఇప్పించెను. అప్పటికి నూరు ప్రతులు విడిదిలో సిద్ధముగా నున్నవి.

ముమ్మకవి శ్రద్ధగా చదివి, 'ఎంత నేర్పుగా డిండి ములను మోసము చేసితివయ్యా!—ఒక్క వ్యాకరణ దోషములేదే. అద్భుతము. హావురు!' అని శ్లాఘిం చెను. యువ కవులు సగౌరవముగా శ్రీనాథునకు నమస్కరించి సెలవు తీసికొనిరి.

ఆ సాయంకాలము నారణప్ప పోతన దుగ్గనలు కలసి తుంగభద్రా తీరమునకు వాహ్యాళి చనిరి. వా రా రాత్రి ప్రొద్దుపోయిన తర్వాతగాని విడిదికి రాలేదు. నారణప్ప తన క్రొత్త మిత్రద్వయముతోపాటు విడిది లోనే భుజించెను. అర్ధరాత్రముదాటువరకు భావి కవితా ప్రస్తావములతో వారు ఉత్సాహానందములతో ప్రసంగించుకొనుచు గడపిరి.

ఆ సాయంకాలముననే అరుణగిరినాథుని కుమా రుడు రాజనాథుడు దూరదేశ యాత్రనుండి తిరిగి వచ్చెను. ఈ మధ్య జరిగిన గందరగోళము తెలిసి కొని, వెంటనే తండ్రి నడిగి తీసికొని, మానసోల్లాస కావ్యము శ్రద్ధగా పఠించెను. అది చదువుచుండ గనే అతని ముఖము వివర్ణము కాజొచ్చెను. "అయ్యో తాతపాదులు ఎంత తొందరపడిరి!—సరిగా నేను ఈ సమయములో దేశాంతరము పోవుట ఎంత పొరపాటు! ఈ శ్రీనాథుడు మిక్కిలి కుటిలుడు. ఈ చిక్కులోనుండి బయటపడుటెట్లు!" ఇట్టి యాలోచనలతో నాత డా రాత్రి సరిగా నిద్దుర పోలేదు.

ఆ రాత్రి పోతనకు శ్రీనాథుడు చమత్కార చంద్రిక చదివెనో లేదో యను ప్రశ్న యాకస్మి కముగా తోచెను. ఆ మరునాటి యుదయమున శ్రీనాథుని నేకాంతమున దర్శించు నవకాశము లభించి నంతనే ఆతడు, "మీరు చమత్కార చంద్రిక చదివి తిరా?" అని ప్రశ్నించెను. శ్రీనాథుడు పరాకుగా నుండి యాకోశ మింతవరకు విప్పలేదు. ఇప్పుడు పోతన స్మృతికి తెచ్చినంతనే శ్రీ కృష్ణభగవానుని ప్రబోధముగా భావించి, వెంటనే యా గ్రంథ పఠన మారంభించెను. (సశేషం)

నా ఆర్థికపు అవసరాలు ఎక్కువగా ఉంటుండేవి. ఫలానా దగ్గర ఇంటర్వ్యూ. పరుగు తీయడమే. ఫలానా దగ్గర ఖాళీ. అప్పు సప్పు చేసి దూకిరావడం. అటు స్నేహితుల దగ్గర తగుమాత్రం మర్యాద కోసం తాపత్రయపడడంలో యథోచితమైన ఖర్చు. ఎవరినో తాత్కాలికంగా యాచించడం నిరాకరణలో కలిగే అంతర్వేదన .... మళ్లీ అప్పు తీర్చుకోవడం కోసం పడే పాట్లు యివన్నీ యిప్పుడు చెప్పుకోవడం చేతకావడంలేదు. అప్పు డనుభవించిన బాధలో శతాంశం కూడా యీ మాటల్లో పొదగ లేక పోతున్నాను. ఆ దౌర్భాగ్యాన్ని పాఠకులు క్షమించి ఊహించుకో గలిగినపుడు నా స్థితి ఎలాంటిదో అర్థమవుతుంది.

ఎప్పుడూ చెల్లెలి దగ్గర చేయిచూపాలని ఉండేది కాదు. ఆత్మాభిమానం అడ్డొచ్చేది. 'ఆత్మాభిమానం' అన్నమాట అనవసరంగా ఉపయోగించేస్తున్నా ననుకొన్నవారికి ఒకటే విన్నపం. పరిస్థితి వ్యక్తి స్థితిని నిర్ణయిస్తుంది. కమల దగ్గర అప్పట్లో బాగానే ఉండేది. నగలు పెరుగుతుండేవి వారంవారం. ఆ పిన్ని దగ్గర నుండి యింత, తాతగారింటికి వెళ్లి యింత, పెద్దమ్మ దగ్గరకు వెళ్లి యింత, మేనమామ దగ్గర్నించి కొంత, బంధుత్వాల ప్రయోజనాలతో బాగానే సేకరించుకొనేది. కొన్ని దగ్గర్ల మారాము చేయడానికి కూడ ఆస్కారం ఉండేది. చిన్నపిల్ల. ముద్దు. దానికి తోడు పెళ్లి ప్రయత్నాలు. ఇంకెన్నాళ్లు మన యిళ్లల్లో ఉంటుంది — మన ముద్దు మురిపెం చూపించుకొంటాం అనుకొనే తెలుగు సంసారజీవితంలోని అందమయిన అనురాగాలు తోడ్పడ్డాయి.

అలాంటి సమయంలో కమల నా స్థితి అర్థం చేసుకొని ప్రవర్తించి ఉంటే, అప్పట్లో ఆమెపై ఏర్పడ్డ భావాలు యెలా ఉండేవో యిప్పుడు వూహించాల్సిన అవసరం లేదు.

'నా దగ్గర ఏ దమ్మిడీ కూడ లేదు' అనేది అడిగీ అడగడంతోనే.

'అలా లేకుండా అయిపోవుగాక' అనుకొని, ఆ బాధలో కూడా నా మనోజనితమయిన ఆ భావానికి నవ్వుకొనేవాడిని.

వ్యక్తిత్వాన్ని అన్ని పరిస్థితుల్లోనూ, అన్ని వాతావరణాల్లోనూ నిలుపుకోవడం కష్టం. ఒకే రకం వ్యక్తిత్వం అన్ని పరిస్థితుల్లోనూ నెగ్గుకురాలేదు. పరిస్థితికి వ్యక్తిత్వానికి రాజీ కలుగుతూండాలి, జీవితంలో మంచి పెంచుకోవాలంటే. వాతావరణాన్ని అనుకూలంగా మార్చుకోవాలి. యీ విషయం అంత తేలికయినదేమీ కాదు. అనుభవం కావాలి. ఆ అనుభవమే కమల పట్ల లోపించిన — ఫలితం యిప్పుడు పడుతున్న బాధ.

బాధల్లో ఉన్న వ్యక్తిని చూస్తే జాలి కలుగుతుంది. ఫలానా వాడు చనిపోయాడు అంటే— ఒకసారి అయ్యయ్యో అని, కంట నీరు పెట్టడం కద్దు. ఆ మనిషి మనకి ఏవిధంగానూ సంబంధించకపోనీ, వాడు క్రూరుడు, దయా దాక్షిణ్యాలు లేనివాడే అవనీ—ఆ బాధ సహజం.

అలాంటి సహజమైన బాధే కల్గింది నాకూ చెల్లెలి విషయంలో. అన్నా చెల్లెళ్ల సంబంధం అలాంటి

# మంచి భవిష్యత్తు

17-వ శేష భాగం

చాడి అని ఎవరో చెప్పిన విషయాలు జ్ఞాపకమొచ్చాయి. మనిషిలో క్షమించే శక్తి లోపిస్తే— అంతకంటే మానవత పతనానికి యింకో నిదర్శనం అక్కర్లేదు.

మర్నాటికి ప్రయాణాన్ని నిశ్చయించుకొన్నాను. చెల్లెలు దగ్గరకు ఎలా వెళ్లాలి అన్నది కూడ నాకు తెలీదు — ఏం తీసుకు వెళ్లాలి. ఎలా మాటాడాలి మొదలైనవి కూడ. అందుకే పొరుగింటి మామ్మగారితో పరిస్థితి ప్రస్తావించాను. ఆమె చెప్పిన ప్రకారమే నేనూ తయారయాను. ఈ విషయంలో ఎవ్వరూ నవ్వాల్సిన అవసరంలేదు. తెలిసినట్టు నటించడం తప్పు. తెలుసుకోవడం చాల లాభదాయకం. తెలుగు ఆచారాలకు సంబంధించినంతవరకు యీ సలహా పాటించడం అవసరం. జీవితంలో పాత అనుభవా లేమన్నా ఉంటే ఆలోచించండి. చెల్లెలి దగ్గరికి వెళ్లేటప్పుడు పాటించాల్సిన విధులేలాంటివో. అలా పాటించనప్పుడు వాటిల్లే ప్రమాదా లెట్టివో?

నా ప్రయాణంలో ఒకటే ఆలోచన. అక్కడ చెడిసిన పరిస్థితిని ఎలా సమన్వయ పరచడం— అన్నది. ఏ సంసారంలో కోడలుపిల్ల బాధపడుతున్నదంటే దానికి కారణం ఒక్కటే — భర్త పాలన సరిగా లేకపోవడం అదే నాకు తెల్పినదీ, వూహించినదీ. బావతో చెప్పాల్సిన మాట లేవిటి? నా మాటలతో ఎలా అతనికి నమ్మకం కుదర్చటం? నా మాటలు నిండా ఎలా జీవిత సత్యాలని నింపడం —మొదలయిన ఆలోచనలు బుర్రలో కిర్రు కిర్రు లాడుతున్నాయి.

'జీవితంలో ఏసారి తప్పుటడుగు వేసేసిన తర్వాత ఆ తప్పుటడుగుతో యింకా తప్పుదార్ను పట్టి అధఃపతనానికి పాలవడం కంటే భరించి, ఆలోచించి సవరించుకోవడం అవసరం. మన కళ్లతో ఎన్ని జీవితాలు చూడడంలేదు? భవిష్యత్ అంతా నాశనం చేసుకొని, సంసారం నరకం చేసుకొని, పెళ్లాం కన్నారింట్లో—భర్త యింకొకరితో హీనంగా, నీచంగా పిల్లా జెల్లా, మురిపెమూ ముద్దూ లేని గొడ్డు జీవితాలు గడపడం. ఇన్ని చూసీ — మనం కొద్దో గొప్పో చదువుకొని, యింతో అంతో లోకజ్ఞానం సంపాదించుకొని— జీవితాలని పాడు చేసుకొంటే ఎలా? మన జీవితమంతా ఉండేవారు ఎవరో ఆలోచించక నీవు ప్రవర్తించా వనలేను. తప్పులుంటే క్షమించడంలోనే ఉంది గొప్పతనం, మొదలైనవి యేవేవో చాల విషయాలు నెమ్మదిగా పాలంలోకి తీసుకొచ్చి, గట్టుమీద కూచోబెట్టి చెప్పాలనుకొన్నాను. ఈ విషయంలో నెగ్గగలనని నమ్మకమూ కలిగింది.

అంత మరీ ఏ ఉత్తరముక్క రాయలేనంత చేతకానిది కాదుగదా? చెల్లెలన్నా తన బాధ అన్నయ్యకి రాసుకోలేక పోయిందే అని యింకో ఆలోచన కలిగింది. తెలియక పోవచ్చును. లేక అవసరం లేదనుకొందో. లేక పరిష్కారం జీవితంలో లేదనే నిరాశ కలిగిందో. నా జీవితంలో అన్నయ్య లేడనుకొందో—నా వూహాకి తట్టలేదు. కాని యిన్నాళ్లూ అన్నయ్య జ్ఞాపకమే లేదు అనుకొనడానికి వీలుగా ఉంది — నేను ప్రత్యక్షమయేసరికి—కమల చూసే తీరులో.

'మీ అన్నయ్యొచ్చాడు' అనేసరికి అత్తవారింట్లో ఆడపిల్ల పొందే సంతోషం ఎలాంటిదో కమల కళ్లల్లో కన్పించిం దానాడు. పాత జీవితాలని మరచిపోయి ప్రస్తుతాన్ని కొత్తగా చూస్తోంది. కమల మనసులోని ఆలోచనలు మాయమై పోయాయి. నా బాధా, బరువూ ఎవరో పంచుకొంటున్నారు అనుకొంటున్నట్టుంది.

'మీ అన్న యొచ్చిన ట్టున్నారు—'

కోడలు అవబడే పిల్లకి ఆ వాతావరణంలో ఆ మాట గౌరవం. గర్వం.

'ఏం తెచ్చాడు?'

ఆమె సంతృప్తిగా సమాధానం చెప్పుకోవడానికి వీలుగా 'ఖరీదైన చీర.'

ఇంకా వూహపరచుకోవాలంటే, తెచ్చి యిచ్చిన మిఠాయి, పళ్లూ. అవన్నీ అనవసరం అని కాదు. అవి సమాజంలోని స్థానాన్ని నిలబెట్టేవి, నిశ్చయించేవి. అన్నయ్య రిక్తహస్తాలతో వచ్చాడని సంతోషించిన స్త్రీ ఎవరన్నా ఉంటే — ఆమె పరిస్థితి అదృష్టవంతులకు లభించేదిగా ఉందనేది గ్రహించాల్సిన విషయం. అన్నయ్య లేక తమ్ముడే అలా వచ్చినందులకే సంతోషించే మనస్సులు లేవని చెబుతున్నా ననుకోవడం తప్పు.

బావకూడ కనిపించి గౌరవంగా లోపలికి తీసుకు పోయాడు.

ఒక్కొక్కసారి పరిస్థితులు తారుమా రవుతాయి. ఎవరిని రక్షించాలని మనం వెళ్లతామో వాళ్లని కష్టపెట్టినవాళ్లం అవుతాము. ఎవరికి జ్ఞానోదయం చేస్తా మనుకొంటామో—వారినుండే చివాట్లు తినొచ్చును. మన మనుకొన్నది, పరిష్కార మాలోచించినది ఆ పరిస్థితిలో అక్కడ పనికిరాకపో వచ్చును. అలాంటి తారుమారే జరిగింది నాకక్కడ.



అన్నీ మాటల్లో కూడ గౌరవాలే వస్తున్నాయి. కాని వ్యతిరేకా లేమి లేవు. చిన్నదానికి —కన్నదానికి భేద ముండదంటారే — అదే యిక్కడ ధృవపడింది కూడ. ఎలా విషయంలోకి అడుగు పెట్టడం — అసలు యదార్థాలు తెలుసుకోవడం యెలా అన్నది పెద్ద సమస్య అయింది నా పాలిట. నే నెరిగిన మనుష్యులు కొందరు ఉన్నారు ఆ వూళ్లో. వాళ్లకి విషయాలు కొంతవరకు తెలియొచ్చు. అక్కడే పొరపాటు ఉంది. ఇంటి గుట్టు రచ్చ కీడ్వడం—ఒకరి దగ్గర మనం తేలికపడిపోవటం తప్ప యింకే ఫలితమూ ఉండదు.

జీవితంలో యింకా పెద్ద సమస్యలు యీనాటి మానవుడికి ఉన్నవన్న విషయం నిజమే. ఇంతవరకూ ఆ పెద్ద సమస్యలు గురించే వాదోపవాదాలు వ్యాసాలు, ఉపన్యాసాలు, దీర్ఘ యత్నాలు జరుగుతున్నాయి. ప్రపంచ దృష్టిలో చిన్న సమస్యలనిపించుకొబడిన జాతి, మత, భాషా భేదాలు, ప్రాంతీయ తత్వాలు, ఆశ్రిత పక్షపాతులు లాంటివి పరిష్కార వాంఛితాలుగా భావిస్తున్న రోజుల్లో నేవ దంపతుల సంసారంలోని చిక్కులు నే సమస్యగా సామకాలీన పాఠకలోకం గ్రహించకపోవచ్చు. కాని, అనుభవ మవుతున్న లోగానికి కూడ కొంత ప్రాధాన్యం యిచ్చి ముందుపెట్టి రాబోయే రణం గురించి నిరోధక యత్నాలు చేయాలి మరి!

సాయంత్రం. ప్రయాణ బడలిక తీర్చుకొంటున్నాను. నాకు అనుమానం. చెల్లెలు అసలు తన బాధ చెప్పుకోదో యేమో నని! ఉత్తరం రాయుని చెల్లి తనస్థితి చెప్పుకొనే మనస్తత్వం గలదని యెలా అనుకోవడం. సరే నేనే అడగాలని తోశ్యం చేసుకోవాలనీ నిశ్చయించుకొన్నాను. అందులోనూ నాన్నగారు రాసిన విషయమే గదా. అలాగే సంభాషణ కదపొచ్చు అని.

ఇంకో ఆశ్చర్యమైన విషయం కూడ యిక్కడ పేర్కొనాలి. కమల ముఖంలో ఎక్కడా బాధ కన్పించలేదు. కమల బాధలు గుప్తంగా దాచుకో గలిగినంత శక్తివంతురా లయిందా అనుకొంటున్నాను. ఏమో చీర కట్టడంతోనే తరతరాల అనుభవ సత్యాలని మోస్తున్నట్టు ప్రవర్తించే తీరు కమలకు సహజంగా అబ్బినదే మరి!

మంచం దగ్గరకి నో స్టూల్ లాగి ఫలహారం పెట్టింది. మంచినీరు గ్లాసుతో మళ్లీ వచ్చింది. నాకు కాఫీ అలవాటు లేకపోవడం కమలకు గుర్తుండడం గమనీయం. చెల్లెల్నే చూస్తున్నాను తడవా. పాతికేళ్లవాడిని. నాకు యింకా సంసారమూ తెలీదు. సాగరమూ తెలీదు. అన్నిటి లోతుపాతులనీ, మంచి—చెడులనీ అనుభవిస్తున్న కమలంటే కొత్తగానే ఉంది నాకు. మంచంపందిరికి చేరగిలబడింది. ఆమెలో అంతవరకూ ఉన్న ఉత్సాహం చల్లారిపోవడంవల్ల మంచినీరు అందుకొన్నచేయి అలానే ఆగిపోయింది.

'బాబు ఉత్తరం రాసాడు. అందుకే వచ్చాను' అన్నాను చివరికి. సంభాషణలోకి దింపడమే అంతర్యం.

కమల మాట్లాడలేదు. ఆమెలో బాధ స్పష్టీకరించడం కొంతవరకు సులభంగా [illegible] విద్య. కమల కళ్లల్లో నీరు ముత్యాలా తిరిగి మెల్లగా కిందికి జారుతోంది. ఆ పెద్ద కళ్లు, ఆ సిలంపు నయనాలు అప్పుడే లోకంలోని యిన్ని బాధలని చెప్పుకోడం నేర్చుకొన్నాయిగదా అవి అశ్చర్య పోయే సమయం కాదని నాకు. మనస్సుకి దెబ్బ తగిలింది. హృదయం బాధ నింపుకొంది. హృదయం తేలిక పడడం వేరు. బరువెక్కడం వేరు. గుండె బాధతో నిండడంతో బరువైంది. రక్తంలోని ఏదో ఒక శక్తి క్షీణించిపోయింది గాబోలు.

అంతెందుకు? నా అనుభవలేమికి ఒక్క ఉదాహరణ చాలు. చెల్లెలు అలా కంట తడిపెట్టుకుంటే జవాబు చెప్పలేకపోయాను సరిగదా సమయస్ఫూర్తిగా నోదార్చడం చేతనవకపోవడం విడ్డూరం. నేనూ ఆ బాధతో కొట్టుకుపోయాను. ఆలోచించాల్సిన శక్తి క్షీణించిపోయింది. ముఖంలో అలుముకొన్న దైన్యం, మెల్లగా జారుతోన్న కన్నీరు నా మనస్తత్వాన్నే పీడికిట పట్టుకొన్నాయి.

'బాబుకి......నాలుగైదు నెలలయింది.....లోజుల్లో ఉత్తరం చొప్పున రాస్తున్నాను.....రమ్మని—ఏడాది మీద కబుర్లు కూడ పెట్టాను. అత్త ఏ విధంగా చెప్పి పొడుస్తుందో నీకు తెలీదురా—ఇప్పటికీ రాలేదు. అమ్మా అయ్యాలేని చందమయింది' కంఠం రుద్ధం చేసుకొంది. జీరవటుకుతోంది గొంతు. గుండెలో యెంత బాధ, హింస, నిస్సహాయత లేకపోతే అంత తేలిగ్గా ఆ అశ్రువులు ఏకధారగా కురుస్తాయో ఆ సమయంలో వూహించలేదు కాని యిప్పుడు నన్ను కలచి వేస్తున్నాయి.

నిజంగా దౌర్భాగ్యం. ఎంత విజ్ఞానము, సంఘంలో మంచి పలుకుబడి, ఇతరుల మనస్సులో గౌరవభావం మొదలయినవి వుండి యేం లాభం? అవసరమయిన దగ్గర అవసరమయిన మాటలాడలేనప్పుడు నానించి యెలాంటి మాట విన వచ్చిందో గిందో యిప్పటికీ నాకు అంతు చిక్కని విషయం.

'ఆయన మాత్రం ఏం చేస్తారు. అమ్మా, అయ్యా దగ్గర నోరెత్తలేరు. ఎప్పుడన్నా వూరుకొంటారు. అలా వూరుకోవడమే కొంత నయమయింది' ఈ మాటలు వింటున్నప్పుడు కూడ కొంతసేపు నాకు భావం బోధపడలేదు. ఇంతకుపూర్వంవరకే వింటున్నాను. మధ్యలో ఆపినట్టయింది. జీవితంలో ఒక్క భర్త వలన తప్పించి, యింకోరివలన సంసార జీవితం దుఃఖభాజకం కాదనే నా నిశ్చల నిర్ణయం దెబ్బతిన్నది. ఆ......

''బావకీ, నీకూ ఏ పొరపొచ్చాలూ లేవా? కమలా?''

లేనట్టే తలూపింది. 'ఆయ నోర్తి అమాయికలు. పొలంలో పని చూసుకోవడమూ—తండ్రేది చెపితే అది చేయడం తప్పించి యింకో విషయం తెలీదు. ఆయన్ని చూసేసరికి కళ్లు నీరు తిరుగుతాయి. నన్ను చూసి ఆరోజంతా మరి కన్పించరాయన.' ఈ మాటలని జాలితో నింపే ఆ స్వరం యిప్పుడు వింటున్నట్టే వుంది. పెరకొంగుతో కళ్లు తుడుచుకోవటం, బాధ వెంగక్కకుండా వుండాలనే యిటున, కళ్లు పటపటమూసి తెరవడం యిప్పుడు చూస్తున్నట్టే వుంది.

అంతలో బావ రానే వచ్చాడు. [illegible]

ఏం లాభం ఉద్యోగానికి అర్హత కోల్పోయాడు. చిన్న రకం ఉద్యోగాలు చేయడం సమాజం దృష్టిలో చిన్న తనం. స్వతంత్రంగా సంపాదించుకొనే ఆశ కన్పించడంలేదు. జీవితం తండ్రిగారి నియంతృత్వంతో గడుపక విధిలేదు. దానికి తగ్గట్టు పిల్లల్ని పెంచడం కూడ సరిగా తెలీని పశువుల క్రూరపాలనకి చిన్నప్పటినించి అలవాటుపడిపోయి, రాటుతేరడం. 'తినడం లేదా వెధవ ఏదీ ఆ కర్రతే'—అలా పెంచిన వ్యక్తిత్వాలు యీ నాటికీ యిలా తయారయాయి.

ఇంతవరకూ నా సమస్య వేరు. ఇప్పుడు వేరు. ఇది నా సమస్యకాదు. ఆ భార్యా భర్తల సమస్య మాత్రమే. వాళ్లే అది పరిష్కరించుకోవాలి. నా జోక్యం సత్ఫలితాల నిస్తుందనుకోవడం తెలివితక్కువకింద లెక్కకట్టాలి. నేను బోధించితే వినేవారు చెల్లి, కొన్ని పరిస్థితుల్లో బావ. కాని, అత్త, మామగారు. ఏదో చెప్పజూడడం కూడ సాహసమే. నందిని చేయబోయి పందిని చేస్తే వచ్చే గొడవ జీవితాంతం అనుభవించాల్సి వుంటుంది. మాటలంత తేలిక పనయితే తెల్లాలే చూసుకొనేది. నాకంటే ఈ విషయంలో ఆమె చాలా నయం.

కమల వంట అంటూ వెళ్ళిపోయింది. బావ నా దగ్గర కమలకు మల్లే మంచం పందిరకు ఆనుకొని నిల్చున్నాడు.

'కూచోరా' అని పక్కకు జరిగాను.

కమల పడుతున్న బాధ బావ పడుతున్నాడా అన్నది యిక్కడ ఆలోచించుకోవాలి. లేక ఈ వ్యథ అంతా కమలకి సంబంధించినదేనా? జీవితంలో మంచికీ, ప్రేమకీ, ఆటపాటలకీ అలవాటు పడిపోయిన కమలకి బాధిస్తున్న విషయాలు మాత్రమేనా?

తనంత కొడుకుని హీనంగాచూసే తండ్రులు నాకు తెలీరు. అంచేత ఆవిషయం ఆశ్చర్యకరమైనదే. బావ కూడ చెల్లి మల్లే బాధపడుతూంటే ఈ విషయంలో జోక్యం చేసుకోవాలనే ఆవేశం కలుగుతోంది. బావనెలా కదపడమని మౌనంతో వున్నాను. రాం లేచి, "పశువులకు గడ్డి వేయించి వస్తా" నంటూ కదిలాడు అక్కడనుంచి. నేను 'సరేలే ఆగు నువు లేకపోతే ఆ పని ఆగిపోదులే' అంటూ చేయి పట్టుకొన్నా. దీనంగా చూశాడు. చెప్పుకోలేక పోతున్నాడు' 'చెప్పుకొనే శక్తి వుంటే—' అన్నట్టుగా చూస్తున్నాడు.

'వాడు (అంటే నాన్న) చూస్తే లేక లేస్తాడు'

ఆ మాటలు చాలు— నే నో నిశ్చయానికి రావడానికి. రాం వెళ్ళిపోయాడు. నాకు మిగిలింది ఆలోచన. లేచాను. బావతో అలా పొలం వెళ్ళాలని. ఏం చెపితేనేం కమల మాటలకంటే యెక్కువ బాధ కలిగించాయి. కొన్ని మాటలాడుతున్నపుడు కళ్ళల్లో గిర్రున తిరిగింది నీరు. 'కమల లేకపోతే నే నెటన్నా పోయేవాడిని' లాంటి మాటలు.

బహుశా యిలాంటి యిక్కట్లలోనే అమ్మ ఆత్మహత్యకి పూనుకొని వుంటుంది. అందుకే నా జీవితమంతా యిలా అయిపోయింది. ప్రపంచంలో జీవితానికి మిగిలిన ఒక్క వరమూ తల్లి ప్రేమ. అది లేకుండా చేసిన సమాజ సంకుచితత్వం కూకటి వేళ్ళతో పెళ్లగించాలి.

నాన్నగారు యెంత ఆలోచనా రహితంగా ప్రవర్తించారో యిప్పుడర్థమయింది. 'అమ్మా అయ్యా లేని చందమయింది' అన్న కమల మాటలు వెనక దాగివున్న చీకటిలో, లోకంలో మానసికంగా పడే బాధ అర్థమయింది. ఒక బలమైన నిరాశ చాలు జీవితాన్ని మంట గలిపేయడానికి.

ఈ యింటిలో యిలాంటి విష వాతావరణం తయారవడానికి యెలాంటి పరిస్థితి కారణమయిందీ అంతు చిక్కడంలేదు. అత్త, మామ లిద్దరూ యిష్టపడి చేసుకొన్న సంబంధం. నిజానికి ఈ సంబంధం విషయంలోనేకాదు. అన్ని సంబంధాల విషయంలోనూ 'రాం' ధోరణి ఒక్కలాగే వుండేది. 'పెద్దల మాట చద్దిమూట' అనుకొనే వ్యక్తి.

కట్నం కానుకల విషయంలో వీలయినంత ముద్దూ మురిపెం తీర్చుకొన్నాడు నాన్న. పెద్ద కూతురవడం వలన, తన చేతులతో చేయడంవలన, జీవితంలో ఆడపిల్లకే మిస్తున్నాం అనే భావం వలన అన్నీ సక్రమంగానే జరిగాయి.

ఆశ గొప్పది. జయమవుతున్నకొద్దీ ఆశ విజృంభిస్తుంది. చెల్లెలి మెడలోని నగ ఒకటి సుమారు రెండు వేలు ఖరీదు చేసేది మామ తీసుకొన్నాడు. ఆ విషయం నాన్నకి చెప్పడం జరిగింది. నాన్న జోక్యం చేసుకోకుండాపోయినా బావుండేది. లౌకికం ప్రదర్శించా రాయన. అది మాపాలుంచేవారాయన నగ పెడితేగాని పంపించేది లేదని. చివరికి నగ పెట్టకుండానే పంపించాల్సి వచ్చింది. ఇప్పటికీ కూడ ఆ నగ ఆమె మెడలోకి రాలేదు.

అసలే ముళ్ళమొక్క. కొమ్మలు పెరిగితే ముళ్ళు పెరగవా? ముళ్ళు ముదిరాయి. ఇప్పు డవి గుచ్చుకొంటున్నాయి—అన్ని హృదయాలని. అయితే అందరికీవున్న బాధ వేరు. కమల బాధవేరు. జీవితంలో అలవాటు పడిపోయినవరకు చిన్న విషయాలు కూడ గొప్ప బాధ కలిగిస్తాయి. అలవాటు పడిపోతే హత్య చేసినా బాధ వుండదు. కమల చిన్న పిల్ల. లోకం సంగతి ఏం తెలీదు. మనస్తత్వ శాస్త్రాలు చదువుకోలేదు. ఏదో అందరికిమల్లే అన్నీ తెలిసినట్టు అనుకరించేది.

కమలకు నెల తప్పిందట. ఆ మాట విన్న తర్వాత నా కళ్ళల్లో కదులుతున్న చరిత్ర నా తల్లిది. కమలకి యే రకంగా ధైర్యం చెప్పడమో, ఆశ కల్గించడమో నాకు తోచడంలేదు. ఈ కష్టాలని ఓర్చే శక్తి ఆమెకి నేను యివ్వాల్సిన బోధ. ఆమె భవిష్యత్తుని ఆశ పూరితంగా చూపించాల్సిన బాధ్యత నాకు వుంది. అన్నా చెల్లెళ్ల సంబంధం అలాంటిది అన్న మాటలలో వున్న భావం అది. అన్నగా నా ధర్మం నిర్వర్తించటానికి యిదో పరీక్ష. నా హృదయాన్ని, వివేకాన్ని వినియోగించుకొనడానికి యిదో అవకాశం. నా సంతృప్తి యీ సంఘటనయొక్క పర్యవసానంగా వుంటుంది.

ఆత్మహత్య చేసుకొన్న అమ్మకి లోపించినవి యివే. అన్న లేదు అమ్మకి. నాన్న (తాత—నాకు) వివేకంగా సమస్యను యోచించలేదు. నో పాఠం బోధించిన నీతి మర్చిపోతే వాడు తెలివి తక్కువ విద్యార్థి. రాజకీయ నాయకులు ఆ నీతి పెడచెవిని పెట్టడం వలనే యుద్ధా లొస్తుంటాయి.

కమల పెద్దమ్మలా—కమల జీవితం [illegible] అవకూడదు. అది నాన్న వూహకి తట్టే—నాకు లేఖ రాసారు. ఆయన వచ్చి సహించలేరు కుమార్తె దుఃఖాన్ని. అందుకే నన్ను కోరారేమో!

'పండుటాకులు రాలిపోకపోతాయా?' చెల్లెలికి చెప్పిన కొద్ది మాటల్లో యిదొక మాట. ఆ తెల్లారి వచ్చేసేముందు యిచ్చిన ధైర్యాలలో దీని స్థానం చిన్నది.

మామగారిని వంటరిగా పిలిచి, 'నే నెందు కొచ్చానో మీకు తెలుసు. నేనేం చెప్పాలనుకొన్నానో మీ రూహించే వుంటారు. మా అమ్మలాంటి జీవితం మా చెల్లెలికి రానీయకండి. ఆ పాపం యింకొకర్ని చుట్టుకోదు. ఆ జీవితాన్ని అంత చిన్న జీవితంగా మార్చేసి బావ జీవితంలో చిచ్చు వెలిగించకండి. అమాయకుడు. రాం. ఉన్నంత కాలం భరించగలడు కాని లేకపోతే బాధ పడతాడు' అన్నాను.

మామతో జవాబులేని మౌనం.

* * *

నేను కమలనోదార్చే యోచనలో అలా నిజాలు గరపాను గాని ఆ మాటలతో సంతృప్తి పొంది వుంటుం దని నాకు ఆశ, నమ్మకమూ నశించాయి. మామగారికి ఆ మాటలన్నా యెందుకు చెప్పానా అని విచారం నాకు. నా మాటలకు విలువ లేకుండా చేసుకొన్నాను. తర్వాత పరిస్థితులు యింకా హీనంగా తయారయాయి. ఆ విషయం ఆ గ్రామస్తులవలన విన్నాను.

సీమంతం అయిపోయింది. అన్ని యిళ్ళల్లోనూ జరిగే తంతుకి భిన్నంగా, కోపాలతో, పట్టుదలతో కార్యక్రమం పూర్తయింది. చెల్లెలిని యింటికి తీసుకుపోయారు నాన్నగారు. రెండేళ్ళ క్రితం కమల వేరు. ఇప్పటి కమల వేరు. నిండుకుండలావుంది. తొణకదు. బెణకదు. సంసార జీవితం బోధించిన పాఠంతో పరిపూర్ణత సంపాదించుకొంది. సముద్రంలాపొంగే ఉత్సాహపు కెరటాలు తగ్గాయి. తొందర పోయింది. ఆలోచన—విశృంఖలత్వం వీడిపోయింది. హృదయంలో కారుణ్యం, మనస్సులో మంచితనం, కళ్ళల్లో, వదనంలో కన్పించసాగాయి. మాతృత్వం పోలికలన్నీ అంకురిస్తున్నాయి. కమల నాకంటె పెద్దదిలా కన్పిస్తోంది. ఇంతకుపూర్వం నటించింది. అనుకరించింది. ఇపుడు నిజంగానే పెద్దదయింది. నామీద గౌరవం కూడ పెంచుకొంది. ఆ గౌరవం ఎలా నిలబెట్టుకోగలనో—అన్నది ఈమధ్య నాపై బడ్డ యింకో బాధ్యతగా తయారయింది.

కమలకి ఆడపిల్ల!. ఆ విషయం నాన్నగారు రాసిన రోజున నా సంతోషానికి పట్టపగ్గాల్లేవు. చిన్నపాప కోసం ఏవేవో వస్తువులు, చిన్న బంగారం గొలుసు, పట్టుగౌను తయారు చేసుకొన్నాను.

నాన్న దగ్గరనించి యింకో ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరం ఈ సమయంలో రాకూడనిది. ఆ విషయం నేనైతే కమలకి తెలియజేయను. కమల ఆరోగ్యం కోలుకున్నవరకు. మరి ఏం చేశారో? కమల ఆ విషయం వినకూడదు.

రాం ఎక్కడికో వెళ్ళిపోయాడట!

అయినా ఈ విషయం కమలకి చెప్పకుండా ఎంత కాలం వుంచడం జరుగుతుంది?

నా ప్రయాణం ఆపు కొన్నాను. నేను కమలని చూడలేను. 

# గళ్లనుడికట్టు - 88



## అడ్డం

1. పలు వన్నెలలో దుర్జనుడు.
3. వర్ష బిందువు.
5. కోపం.
7. చిర కుచ్చెళ్ళు : కావలి భద్రములు వెతికి చూడాలి.
8. రత్నములే !
9. ప్రాసేదానిలో ఓడ, పన్నెండు తూములు.
12. సంతోషం.
14. రూపాయలో ఒక భాగం !
15. వలయముకు కలువ స్వరూపం కావాలి.
16. మోసం గాదని చెప్పగలరా ?
17. చిన్న తగ్గించినా అంతే !
20. వెన్నెల.
24. మనోహరము.
25. గుణాల స్థాన మనుకోకండి, గుడారము!
26. చిప్పలో దొరికేదా ?
27. నేరము మోపబడినవాడు.
28. దూదిపరుపు.

## నిలువు

1. చిగురు. చీర అంచు.
2. మంచి జాతి గుర్రము.
3. చిన్న ఎలుక.
4. ధరకు ముట్టిన దానిలో పర్వతము.
5. సూచింపదగిన అర్థము సూచించుట, అని నిఘంటువు.
6. ప్రయాణము, కదలండి! అని.
10. తేలికకు నాశము కలిపితే నీటి పట్టిపేరు.
11. నివాసస్థానము.
13. దండన మధ్య మార్పు వస్తే మాయ!
18. అప్పుడు చిలికి ఎత్తిన వెన్న.
19. అందుకా ! కలము ! కాగితము కావాలి!
20. కార్తికమాసము.
21. తక్కువ. (చివర నోరు, ముందు క్రిందికి వచ్చు.)
22. ఆలోచనముందు శిరస్సు చివర పోత.
23. ఒక నూనె ఆ సంతోషము.





## వనితలకు మనవి

వనితావాణికి పంపే ఉత్తరాలు క్లుప్తంగా ఉండాలి. వీలైనంతవరకూ పత్రికలో సగం 'కాలం' మించకుండా ఉంటే బాగుంటుంది. వ్రాసినవారి పేరు వగైరా తెలుగులో నే వ్రాయాలి. ఇంగ్లీషులో ఉండకూడదు.

## 87-వ గళ్లనుడికట్టుకు జవాబు



# హరివంశం

11-వ పేజీ తరువాయి

"తల్లీ! నీవు ఇంకను నిద్రపోలేదా?"

"నాన్నా! నాకు నిద్ర పట్టుటలేదు."

"అవును. నాకును నిద్ర పట్టుటలేదు.

"తల్లీ! బయట వర్షమా! నాకు ఉక్క పోయుచున్నదమ్మా!"

"నాన్నా! కొంచెము విసురుదునా!"

"వద్దు తల్లీ! వద్దు! ఆ గవాక్షమును కొంచెము తెరువుము. అంత గాలియు నాకు కావలయునమ్మా!"

సుదక్షిణ భయపడినది. తండ్రివంక చూచినది. ఆయన ఆయాసముతో బాధపడుచున్నట్లున్నాడు. ఒడలు నిజముగా వర్షము కురియుచున్నట్లున్నది. ఇంతలో ఇది యేమి మార్పు! ఇది ఏమి విపరిణామము! ఆమె గవాక్షము వద్దకు పోయినది. గవాక్షమును తెరచినది. బయటి చీకటి లోన ప్రవేశించినట్లు, గాలియు ప్రవేశించినది. మహారాజు వృష్టిస్నానము వలె ఆ గాలిని క్రోలినాడు. సుదక్షిణ ఆయనను చూచి కొంచెము తెప్పరిల్లినది. ఆయనయు తెప్పరిల్లినట్లున్నాడు. వర్షముతోడి, గాలులతోడి, ఆ రాత్రి అందముగా నున్నది. సుదక్షిణకు అది అందముగా కన్పించినది. ఆరు బయలున ఒకవిధముగ, చెట్లులున్నయెడ నరియొక విధముగా గాలి సంగీతము పాడుచున్నది. గాలిపాటునకు వర్షమును ఒకసారి ఒకవిధముగా, మరియొకసారి యింకొక విధముగా కురియుచున్నది. కన్ను తెరచుట, మూయుట వలె, వర్షము గూడ నిమేషానిమేషముగా పడుచున్నది. సుదక్షిణ ఆ విచిత్రము చూచుచున్నది; వినుచున్నది. ఆ చీకటిలో ఏమి కన్పించును అని ఆమెకు పట్టలేదు. ఏదో కన్పించుచున్నట్లుతే ఉన్నది. గవాక్షము గుండ గాలి తోడి వర్షము లోనకు గూడ వచ్చి ఆమెకు పరిచర్య చేయుచున్నది. ఆమెకు వర్షము తుంపలు తుంపలుగా మీద పడగా, మనస్సునకు శాంతి కల్గినట్లు ఉన్నది ఆమె మరియు నితర గవాక్షములను గూడ దెరచినది. తెరచుచు ఒక్క వాతాయతనము వద్ద నిలువెల్లను ఆశ్చర్యమై నిలుచుండి పోయినది. ఈ చీకటి యేమి! ఈ వర్ష మేమి! ఈ గాలులేమి! భీకరము, సుందరము, అవ్యవస్థము అయిన ప్రకృతి యేమి! దూరముగా ఆ కాంతి యేమి! ప్రకృతి దేవత ధరించిన బహురత్నస్థగిత కిరీటము వలె, దేవతలు ఆమెను చూచుటకు మలచికొన్న అనిమిషనేత్రముల కాంతులవలె, వర్షాధి దేవతలు కాశికకు పట్టిన ముత్యములతోడి, రత్నముల తోడి వెల్ల గొడుగువలె ఆ కాంతి యేమి? ఆ కాంతి విచిత్రమై ముందునకును వెనుకకును జరుగుచున్నది. ఫణాగ్రస్థిత రత్నకాంతులతోన మహాసర్ప మొక్కడు వర్షములో, గాలులతో ఆడుకొను చున్నట్లు కదులుచున్నది. పరమశివుని జటా

జాటముతో గుభిల్లుమని పడినవి యున్నది చిమ్మిన నురుగులను పోలిన, ఆ కాంతులు పైకి ఎగురుచు, క్రిందకు పడుచు, ఆ చీకటిలో రత్నములను ఒక్క వరుసలో పరచినట్లు మాణిక్యములను ఒక్క క్రమములో ఒలకబోసినట్లు, ఇంద్రధనస్సులు కొన్నివేలు భూమికి దిగివచ్చుచు నొక్కచో ఆగి పోంఖ పరస్పర సన్నికర్షముచేత, పరస్పర సమాకర్షణముచేత విచిత్రచిత్ర ప్రభాకాయమానములను సృష్టించినట్లు ఆ కాంతులు దిగ్భ్రమను, దృక్భ్రమను గూడ కల్గించుచున్నవి.

ఆమె ఆశ్చర్యము పొందినది. అట్లు పొందినదనుట తక్కువమాట. అదియేమో అద్భుతము. అద్భుతము యొక్క స్థాయి తన్నావేశించినట్లు ఆమెకు భాసించినదో! భాసించలేదో! ఆమె స్థాణువై నిలచిపోయినది. శరీరమునకు మాత్రమే ఆ నిలచిపోవుట తెలియుట లేదు. మనస్సు విచిత్రమై క్రొత్త కన్నులను తెచ్చుకొని ఆ కాంతులను చూచుచున్నది. ఆ కాంతు లేమి కాంతులు! శ్రీకృష్ణదేవుని మందహాసములా! పరమశివుని నేత్ర దీధితులా? మహాసర్ప మొక్కడు వేయి పడగలుగా తలను విప్పి, కాశికను ఈ వర్షాబాధనుండి రక్షించుటకు వచ్చుచున్నట్లు లున్నది. ఈ ఫణిఫణాగ్రముల మీదనుండి బహువిధ మణుల యొక్క కాంతులు విరియబుచిన జపా పుష్పములవలె ఒక్కసారి, మల్లియల కాంతి వలె ఒక్కసారి, పద్మ ౹ల పాణింధమముగ ఒక్కసారి, పారిజాతముల కుసుమల వలె, పత్రముల వలె నింకొక్కసారి ...చిత్రములై తోచుచున్నవి. గాలికి కదలుచున్నవి. వర్షపు జల్లులు పెల్లుగా పడి, రాతి నేలల మీద పడినట్లు పైకి జల్లులతో తుంపరలు తుంపర్లుగా లేచి, ఆ కాంతులలో మఘువ ధనుశ్శతముల తారాడి పారాడుచున్నట్లు లున్నది. అది ఏ దిక్కు? ఆమె మనస్సున కది యేమియు తెలియలేదు. ఆమెకు మనస్సునకు తెలిసినది, ఆమె చెవులు వినుచున్నది, కన్నులు కనుచున్నది ఒక్కటే. ఆ కాంతులు విచిత్రవలయములుగా తిరుగుచున్నవి. తాను వినుచున్న శబ్దము విచిత్రమై కొన్ని వేల మహాసర్పములు బుసలు కొట్టుచున్నట్లు లున్నది. ఆ వర్షమును చూచి, ఆ గాలులను చూచి, తన శక్తి ముందు వానియొక్క నిర్వీర్యత నెరిగినది వలె, ఆ మహాసర్ప మేదో విచిత్రపూత్కారములుగా నవ్వుచున్నట్లు లున్నది. పరమశివుని శరీరమునకు అలంకారములైన సర్పములను తల్లియైన అన్నపూర్ణ కాశికా సంరక్షణమునకు పంపినదా! పరమశివుడు కాశికను ఆవరించిన ఈ వర్షములో తాండవారంభియైన నవోదయాంశువులను పోని పింగళిమయులైన తన జటలను విరియ చూచినాడా! ఇంద్రుడు తన వేయి కన్నులను తెరచి కాశిక ఈ వర్షములో ఎట్లులున్నదో చూచుచున్నాడా! సుదక్షిణకు ఏమి ఏమియో తెలియలేదు. ★





# భూగర్భంలోనికి సాహసయాత్ర

10-వ పేజీ తరువాయి

సంగతేంకాను? మనమింకా భూగర్భంలోనికి ఒక అంగుళం కూడా వెళ్ళలేదు."

"అంటే?"

"అంటే, మనం ద్వీపం నేలమట్టానికి వచ్చామన్నమాట. మనం దిగివచ్చిన ఈ గొట్టం సముద్రం ఎత్తున ఆగిపోతుంది."

"నీకు బాగా తెలుసా?"

"బాగా తెలుసు. బరోమీటర్ (Barometer) చూడు."

నిజంగానే బరోమీటర్‌లోని పాదరసం ఇరవై తొమ్మిది అంగుళాలు చూపిస్తున్నది.

"బయట వాతావరణం పీడన శక్తి మాత్రమే సూచిస్తున్నది చూడు. ఈ పాదరసం బరోమీటర్ మార్చి 'ఎనిరాయిడ్' (Aneroid) బరోమీటర్ వాడితే మంచిది" అన్నాడు ప్రొఫెసర్‌గారు.

వాయుపీడనం సముద్రం ఎత్తుగాఉన్న దానికన్నా అధికమయినప్పుడు ఈ 'యంత్రం' ఉపయోగపడని మాట నిజమే!

"కాని వాయుపీడనం క్రమంగా అధికమయి చివరకు మనం భరించలేనంతగా ఉండదా?" అన్నాను.

"ఉండదు. మెల్లిగా దిగుతాం. మన వూపిరితిత్తులు అలవాటు పడ్తాయి. గాలిలో ఎగిరేవారు పైకి వెళ్ళినకొద్దీ వాయువు లేనట్లు భావిస్తారు. కాని మనకి అక్కర్లేనంత గాలి ఉంటుందేమో. రెండింటిలో ఇదే మంచిదనుకుంటాను. క్షణం ఆలస్యం పనికిరాదు. మనముందు పంపిన మూట ఏది?"

అంతకుముందురాత్రి దీనికోసం వెతికినా దొరక లేదన్న సంగతి జ్ఞాపకం వచ్చింది. మా పెదనాన్న హాన్స్‌ను అడిగాడు. అతను తన వేటగాని దృష్టితో జాగ్రత్తగా పరిశీలించి, "డెర్ హాప్స్!" అన్నాడు.

"అదుగో పైన"

పైనే ఉన్నది. మాకు నూరు అడుగుల ఎత్తున ఒక్క రాయి మొనకు వేల్లాడుతూ కనిపించింది. మా అయిస్‌లాండర్ పిల్లి వలె పైకి పాకటానికి వెళ్ళాడు. మరికొన్ని నిముషాలలో మూట మా చేతుల్లోకి వచ్చేసింది.

"ఇప్పుడు ఏదైనా తినాలి" అన్నాడు మా పెదనాన్న. "అయితే, కావలసినంత అట్టే పెట్టెయ్యాలి. ఎంతకాలం ఇలా ప్రయాణం చేస్తామో తెలియదు కదా!"

బిస్కట్లు, మాంసం కొంచెం జిన్ కలిపిన నీళ్ళతో మింగివేశాను.

మా పెదనాన్న జేబులోనుంచి ఒక చిన్ని పుస్తకం తీసి అందులో ఇలా వ్రాసుకున్నాడు:

"సోమవారం జూలై 1. గంట 8.17; బరోమీటర్, 2 .7 అంగుళాలు; థర్మామీటర్, 6°; సెంటిగ్రేడ్. దిక్కు, ఆగ్నేయానికి కొంచెం తూర్పు"

చివరిది దిక్సూచి చూసి వ్రాశాడు.

"ఆక్సెల్" అని అరిచాడు ప్రొఫెసర్‌గారు ఉత్సాహంగా, "మన మిప్పుడు నిజంగా భూగర్భం లోనికి వెడుతున్నాం. ఈ క్షణమే మన యాత్ర ప్రారంభమవుతుంది."

ఇలాగ అని మా పెదనాన్న యంత్ర సామగ్రిని తీసుకున్నాడు. ఎలెక్ట్రిక్ టార్చికి 'కనెక్షన్' ఇచ్చాడు.

"ముందుకి పదండి!" అని అరిచాడు.

ఎవరి బరువు వారు భుజాలపైన వేసుకుని అంతకుముందే చూసిన ద్వారం ప్రవేశించాము.

ఆ చీకటిలో మునిగిపోబోతున్న నేను తల పైకెత్తి చూశాను. మేము దిగివచ్చిన గొట్టం ద్వారంలోనుంచి అయిస్‌లాండ్‌మీది ఆకాశం ఆఖరిసారిగా చూశాను.

1229 లో లావా పొంగినప్పుడు ఈ సొరంగంలో నుంచే వచ్చివుండాలి. ఇప్పటికీ గోడలపైన నిగనిగలాడుతూ కప్పేసిఉన్నది. మా ఎలెక్ట్రిక్ దీపం కాంతి దానిమీద ప్రతిబింబించి నూరురెట్లు తీక్షణమయి పోయింది.

మేము దిగేదారి సుమారు 45° ఏటవాలుగా ఉన్నది. దానిపైన జారిపోకుండా నడవటమే మాకు సమస్యగా తయారయినది. అదృష్టవశాత్తు అక్కడక్కడ కాలికి ఆధారంగా ఘనీభవించిన లావా మెట్లవలె పైకి పొడుచుకువచ్చి మాకు సాయపడ్డాయి.

మా సామాను త్రాడు చివర కట్టి మాముందు 'పంపించి' వేశాము.

మా కాళ్ళక్రింద మెట్లవంటి లావా 'బొడిపెలు' ఉన్నాయని చెప్పాను. ఇవి నిజానికి 'స్టాలాక్ టైటులు' (Stalactites) [గుహలలో స్తంభాకారంగా ఏర్పడిన శిలా విశేషాలను స్టాలాక్ టైట్ అంటారు. ఖనిజ ద్రవ్యాలు ఘనీభవించి ఏర్పడ్తాయి] లావా అక్కడక్కడ ఇటికరాయివలె సూక్ష్మ రంధ్రాలు కలిగి ఉన్నది. పైన వింత ఆకారాలు కనిపిస్తున్నాయి. గాజు స్ఫటికాలు దీపాలు వేళ్ళాడినట్లు వేళ్లాడుతున్నాయి. ఈ అగాధాలలో నివసించే రాక్షసులు అతిథులకోసం తమ భవంతిలోని దీపాలు వెలిగిస్తున్నారా అన్నట్లు మా టార్చి వెలుగు పడినప్పుడల్లా ఇవి మెరిసిపోయేవి.

"చాలా బాగుంది!" అని అరిచాను ఉత్సాహంగా. "పెదనాన్న, ఏమి దృశ్యం! పసుపునుంచి జేగురు రంగుకి మారే ఈ లావానిచూసి ఆనందించటంలేదా? ఈ స్ఫటికాలు దీపగోళాలవలె ఉన్నాయి!"

"అలాగనిపిస్తోందా ఆక్సెల్? పదే వీటినిమించిన దృశ్యాలు చూస్తావని ఆశిస్తున్నాను. ముందుకి నడు! నడు!"

జారు, అని ఉంటే బాగుండేది. ఎందుచేతనంటే మేము బాగా ఏటవాలుగాఉన్న శిలాతలాలమీదుగా దిగి వెళ్ళిపోయాము. దిక్సూచి చూశాము. ఎంత సేపూ, ఆగ్నేయమనే సూచిస్తున్నది. లావా ప్రవాహంవేరుగా ప్రయాణం చేసినదన్నమాట!

అయినా ఉష్ణోగ్రత అంతగా అధికం అవలేదు. ఇది డేవీ సిద్ధాంతాన్ని నిరూపిస్తున్నది. రెండు గంటలు ప్రయాణం చేసిన తర్వాత థర్మామీటర్ 10 డిగ్రీలు సెం. మాత్రమే చూపిస్తున్నది. అంటే 4 డిగ్రీలు మాత్రమే అధికం అయినదని తెలుస్తున్నది. దీనినిబట్టి నిలువుగా కన్నా అడ్డంగానే ఎక్కువగా దిగుతున్నామని వూహించవలసి వచ్చింది. ఎంత లోతు దిగామో తేలికగా అంచనావేసి ఉండవచ్చు. ప్రొఫెసర్‌గారు మేము దిగిన దారి కోణాలు జాగ్రత్తగా గమనిస్తూ వచ్చాడు. కాని వివరాలు ఎవరికీ చెప్పలేదు.

సాయంత్రం (రాత్రి) ఎనిమిది గంటలకు ఆగమని సంజ్ఞ చేశాడు. హాన్స్ వెంటనే కూర్చున్నాడు. మా టార్చి ఒక లావా గూటిలో ఉంచాము. మేము ఒక పెద్ద గుహలో ఉన్నాము. అక్కడ కావలసినంత గాలి ఉన్నది. అప్పుడప్పుడు గాలి వీచేది. ఈ కదలికలకు కారణం ఏమిటి? ఈ ప్రశ్నకు సమాధానం నాకు అప్పుడు తోచలేదు. ఆకలి, అలసట నా బుద్ధి పని చెయ్యకుండా చేసేశాయి. ఏడు గంటలు ఆగకుండా దిగితే సోలిక పడక మానదు. పూర్తిగా అలిసిపోయాము. "ఆగవచ్చు" నన్న ఆజ్ఞ నాకు సంతోషం కలిగించింది. హాన్స్ మాకు కావలసిన భోజనం ఒక లావా బండమీద పరిచాడు. ఆకలితో తిన్నాము. కాని నాకు ఒక దిగులు పట్టుకున్నది. మేము తెచ్చుకున్న నీటిలో సగం వరకూ ఖర్చయిపోయినది. భూగర్భంలో నీరు దొరకకపోదని మా పెదనాన్న అన్నాడుకాని ఇంతదాకా ఏమీ లభించలేదు. ఈ విషయం ఆయనకు చెప్పకుండా ఉండలేకపోయాను.

"నీటి వూటలు లేవని ఆశ్చర్యంగా ఉన్నదా?" అని అడిగాడు.

"ఆశ్చర్యంకన్నా భయంగా ఉంది. మనవద్దనున్న నీరు అయిదు రోజులకేసరిపోతుంది"

"భయపడకు, ఆక్సెల్, మనకు కావలసినదానికన్నా ఎక్కువ నీరే దొరుకుతుంది."

"ఎప్పుడు?"

"ఈ లావా కప్పుదాటిపోగానే. ఈ గోడలు ఛేదించుకుని రాగలిగిన వూట ఏదీ?"

"కాని ఈ దారి ఇలాగే చాలా లోతుకి వెడుతుందేమో? నిలువుగా మన పురోగమనం చాలా స్వల్పమనుకుంటున్నాను."

"ఎందుకని?"

"ఎందుకంటే, మనం భూగోళంపై పెచ్చు లోనికి గనక వెళ్ళినట్లయితే వేడి ఇంకా ఎక్కువగా ఉండి ఉండాలి."

"నీ సిద్ధాంతం ప్రకారం" అన్నాడు మా పెదనాన్న. "కాని థర్మామీట రేమంటోంది?"

"15 డిగ్రీలు కూడా లేదు. మనం బయలుదేరిన తర్వాత తొమ్మిది డిగ్రీలు మాత్రమే అధికమయినదని తెలుస్తోంది."

"అయితే నువ్వే నిర్ణయాని కొచ్చావ్?"

"నా నిర్ణయం ఇది. పరిశోధనలవల్ల భూగర్భం లోనికిదిగితే ప్రతి వంద అడుగులకి ఒక డిగ్రీ వేడి ఎక్కువవుతుంది. కొన్ని ప్రదేశాలలో ఈ అధికం కొంచెం ఇటూ అటూగా ఉండవచ్చు. ఉదాహరణకి సైబీరియాలోని యాకుట్స్క్‌వద్ద 36 అడుగులకే ఒక డిగ్రీ అధికమవుతుందని తెలుసుకున్నారు. ఇది నేలలోని శిలా విశేషాలనుబట్టి మారుతుంది. ఆరిపోయిన అగ్ని పర్వతాల సమీపంలో 125 అడుగులకే ఒక డిగ్రీ వేడి జాస్తి అవటం గమనించారు. ఈ చివరి లెక్క ప్రకారం మనం దిగిన లోతు అంచనా వెయ్యవచ్చు."

"అలాగేవేసి చూడబ్బాయ్"

"అతి సులభంగా" అన్నాను నేను నా 'నోటు పుస్తకం'లో వ్రాసుకుంటూ. "నూట ఇరవై అయిదుని తొమ్మిదితో హెచ్చవేస్తే పదకుండు వందల ఇరవై అయిదు అడుగులు వస్తుంది."

"చాలా సరిగ్గా చేశావు."

"అయితే?"

"నా లెక్కల ప్రకారం సముద్రంకింద 10,000 అడుగులు ఉన్నాము."

"అది సాధ్యమా?"

"ఆ, లేకపోతే అంకెలు పనికిరావు."

ప్రొఫెసర్‌గారి లెక్కలు సరియైనవే. మానవుడు అంతవరకూ దిగిన లోతుకన్నా ఆరువేల అడుగులు క్రిందికి దిగాము—టైరోల్ (Tyrol) లోని కిట్జ్‌బాల్ గనులు, బొహీమియాలోని ఉట్టెన్‌బర్గ్ గనులు, వీటినిమించి అన్నమాట.

ఉష్ణోగ్రత 81 డిగ్రీలు ఉండవలసినది 15 కూడా లేదు. (సశేషం)

# పులివేట

9-వ పేజీ తరువాయి

"ఏమే—అయిందా నీ వంట—కడుపు మాడి పోతూందది" అన్నాడు పొయ్యి పక్కన కూలబడి పులిగాడు.

"ఆ! కాస్త కూకో—పులుసు దింపి గిన్నె తెస్తా" లచ్చిమి పొయ్యిలో పుల్లలు సర్దుతూ అంది.

* * *

వెన్నెల్లో మంచంమీద పడుకుని పులిగాడు ఆలోచనల్లో పొర్లుతున్నాడు. రెండో కుక్క మంచంమీద లచ్చిమి పడుకుంది. పక్కకు పొర్లి కర్ర వుందీ లేందీ తడిమి చూసుకున్నాడు పులిగాడు. దివాణంలో కొట్టిన పన్నెండు గంటలు గాలిలో తేలి వచ్చి తగిలాయి.

"అర్ధరాత్రి అయిందే" అనుకున్నాడు గట్టిగా ఆవలించి — మరి కాస్సేపట్లో గురకపెట్ట సాగాడు పులిగాడు.

లచ్చిమి కాసేపు ఊరుకుంది. ఆ తర్వాత లేచి కూర్చుని, పులిగాడు బాగా నిద్రలో వున్నాడని నిర్ధారణ చేసుకున్నతర్వాత చప్పుడుచేయకుండా లేచింది. దుప్పటి కప్పుకుని బావివేపు నడిచింది. . . .

నవ్వుతూన్న చంద్రుడ్నిచూసి లచ్చిమి యువరాజాగారి చేతుల్లోంచి నవ్వింది.

"నువ్వు నవ్వితే ఎంతో అందంగా వుంటావు" అన్నాడు యువరాజావారు.

"నా కదంతా తెల్దు" అంది మరీ ముడుచుకుంటూ లచ్చిమి.

"నేను మరో నెలరోజుల్లో ఢిల్లీ వెళ్ళిపోతాను. దసరాలకి కాని రాను — ఈలోగా ఏంచేస్తావు?"

"లగ్గం పెడతాడంట బాబు—" అంది చిలిపిగా లచ్చిమి.

"యువరాజావారు లచ్చిమిని మరింత దగ్గరగా అద ముకున్నాడు.

"నీవు మా కుటుంబంలో పుట్టవల్సింది—" అన్నాడు లచ్చిమిని ముద్దెట్టుకుంటూ.

"ఇంక లోతా—బాబు లేస్తాడేమో" అంది లచ్చిమి లేవటానికి ప్రయత్నంచేస్తూ.

"ఏం తొందర—" అన్నాడు యువరాజావారు వదలకుండా.

"అహ! అనుమానం మడిసి — తరువాతేమన్నా సేస్తాడు" అంది లచ్చిమి వదిలించుకుని—

లచ్చిమి చెప్పదలచుకుందేదో చెప్పడానికి భయపడింది. లచ్చిమికీ, యువరాజావారికీ మొదలయిన ఈ సంబంధం ఆ రోజుతో సాంఘిక మర్యాదలనూ, నీతి నియమ నిబంధనలనూ దాటిపోయింది.

"ఏదో చెప్పాలన్నావు — ఇందాక" అన్నారు యువరాజావారు నిల్చుని లచ్చిమిని దగ్గర తీసుకుని. లచ్చిమి వణికింది.

"ఏమిటది — ఏమీ చెడ్డవార్త కాదుగదా—" అన్నా డతను.

"నాకు—నాకు—" లచ్చిమి గొంతులోంచి దాదాపు బయటికి రాలేదది—యువరాజావారి చేతులు కొయ్యబారాయి—లచ్చిమికండ్ల నీరు కారసాగింది—

రెండురోజుల్లో తమ సంబంధం ఇలా అవుతుం దని తను అనుకున్నా, ఇంత త్వరగా అవుతుందని అనుకోలేదు—

"మరి— నీవు?" మాటలు రాక లచ్చిమిని చూస్తూ నిలబడిపోయాడు.

లచ్చిమి కండ్లలో నీరు తిరుగుతుండగా అతన్ని గాఢంగా కౌగిలించుకుంది. హృదయంలో బాధ వెల్లువగా వస్తుండగా తనకేసి అదుముకుం దతన్ని—

"నాకేం తెలీదు—మీ ఇష్టం—" అంది గొంతు పెగుల్చుకుని మాట్లాడుతూ—

"సరే—నేను ఆలోచించి—రేపు చెప్తాను—" అన్నారు యువరాజాగారు రెండడుగులు వేసి—

లచ్చిమి భయంభయంగా గుడిసెవేపు నడి చింది—

"ఎవర్రా అది!" అని అరిచాడు పులిగాడు పక్కమంచం చప్పుడు విని లేస్తూ—

"నే నే నే — " అంది లచ్చిమి నిదుర నటిస్తూ — పడుకుని.

పులిగాడు పడుకున్నాడు మళ్ళీ — కీచురాయి శబ్దాల్లో పులిగాడి గురక కలిసిపోయింది—

* * *

పొద్దున్నే పులిగాడికి రాజావార్నుంచి కబు రొచ్చింది. దివాణంలో ఎనిమిదిగంటలకు టంచ నుగా కల్సుకోవలసిందని.

"ఏందిరా మందల! ఏం గిరాకి?" అని అడిగాడు వార్త తెచ్చిన సుబ్బుల్ని—

"ఏమో మావా! నాకేం తెల్దు—రాజాగారికి శేరీసుచేసి చిన్నోడన్నాడంట — పాలెం అడియిలో పులి తిరుగుతావుందని—నిజవో గాదో తెల్దు—" అన్నాడు సుబ్బులు.

"పాలెం అడియిలో పులా! ఏడదిరా! చెరువు గట్టవతల్నా— ఎవరు చెప్పినారు!"

"అదేమావా తెల్దు — మొన్న రేతిరి రెడ్డిగారి దూడల్ని గొట్టపోయిందంట—ఆవుల్ని గూడ మేతకు తోలడంలే మావా, పాలెంవాళ్ళు—నాలుగేళ్ళముందు దెబ్బదిని తప్పించుకుపోయిం దిదేనని అంట్రను"

"యాడదిరా అది! నాలుగేళ్ళ ముందర్నా!" సుబ్బులు వెళ్ళిపోయాడు.

పులిగాడు జీవితంలో మరిచిపోలేని సంఘటన అది. నాలుగేళ్ళక్రితం పాలెం అడివిలో పెద్దపులి తిరుగుతూన్నట్టు కబ్బెలుగొట్టె రత్తిగాడుచెప్పాడు— బురదలో కాలిగుర్తులు చూచి—

"నిజం మావా, నీవు దానిపని బట్టాల్సిందే — మరోడికయితే అది దొరకద్దు!" అని రత్తిగాడు మొహు ఎత్తుకుంటూ అన్న మాటలు తనకు బాగా జ్ఞాపకం వున్నాయి.

పెద్ద రాజావారు, ఫారెస్టు రేంజరు శివకామయ్య గారూ, తనూ పెద్ద సరంజామాతో పాలెం అడి విక్కీ, చెరువుకు మధ్యన కాపు వేయటం—అర్థ రాత్రి పులి రావటం—మేక అరుపులో బాటు తన తుపాకిమోత కలిసిపోటం తనకు బాగా తెలుసు. అయినా మొట్టమొదటిసారి తన తుపాకిదెబ్బకు అందకుండా తప్పించుకుని పోయిం దా పెద్దపులి. నెత్తురు కారిన దారివెంబడే పోయినా అయిదారు మైళ్ళలో ఎక్కడా దొరకలేదు పులి జాడ.

# పులివేట

"ఒరే పులీ! మొదటిసార్రా నీ దెబ్బదిని తప్పించుకోటం పులి!" అన్నారు రాజావారు దివాణంలో.

"అది పసిగట్టింది దొరా! ముడిసివుండాదని—లేకపోతే నా—గుండె అదరిపోదా—" అన్నాడు ఆలోచిస్తూ ఆరోజు తను.

"నాయాల్దిది మళ్ళీ వచ్చిందా! ఏడకి బోద్దిలే!" అనుకుంటూ పులిగాడు గుడిసెలోకి పొయ్యాడు. తల గుడ్డ విదిలించి, చక్కగా చుట్టుకున్నాడు. పాత చెప్పులు తుడిచి వేసుకున్నాడు. చేతికర్ర చంకనబెట్టి బయటికి వచ్చాడు.

"లచ్చిమే—దివాణంకాడికి బోతావుండా—" అన్నాడు.

లోపల్నుంచి జవాబు రాలేదు. తొంగి చూచాడు పులిగాడు.

"ఏమో! కళ్ళేమే ఎర్రబడినయ్యి? ఏంజేసినా?" అని అడిగాడు. లచ్చిమి మాట్లాడలేదు. పులిగాడు దగ్గర కొచ్చాడు.

"నలుసు బడిందే పొద్దన—" అంది లచ్చిమి దూరంగాబోయి.....

దివాణంలో తను అడుగుబెట్టేసరికి అక్కడ జనమంతా కాచుకుని వున్నారు. పెద్దరాజావారు సోఫాలో కూర్చుని వెనుక పనివాళ్ళు విసురుతూండగా యువరాజాగారితో మాట్లాడుతున్నారు. పులిగాడు ఇద్దర్నీచూచి వంగి నమస్కారంచేశాడు. యువరాజావారు చిరునవ్వు నవ్వారు.

"ఏరా పులీ—పని బడిందిరా! ఆ పెద్దపులి మళ్ళీ పొలెంమీద బడిందట—" అన్నారు రాజావారు గంభీరంగా.

"అయ్యా—తమ సిత్తం" అన్నాడు పులి వినయంగా.

"రేపు మాపటికి మాటు వేయించమని సిద్ధం చేశాను. నీవూ, విజయరాయలూ, వెంకట్రాయలూ పోవాలి—ఈసారిగూడ గురి తప్పుతావా ఏం?' అన్నారు ఆయన.

"ఎంతమాట దొరా! ఈ పారితో దాన్ని పైనలా చేయనా!"

"ఏమో! చిన్నరాజావారు చాలా హుషారు. ఎలా చూస్తావో! వెంకట్రాయలుకు ఎక్కువ అనుభవంలేదు. వాకి నెత్తురుపోటూ, గుండె నొప్పి లేక పోతే నేనే వద్దును—ఏమంటావు?"

"తమ సిత్తందొరా! నేను సిద్ధవే ఎప్పుడూ!"

"రేపు పొద్దునవచ్చి చూచిపో—నీ తుపాకి తుప్పు పట్టిందా, బాగా వుందా?"

"దానికేం దొరా! తమ రిచ్చిన తుపాకి! తుప్పు ఎట్టా పట్టది దొరా!" అన్నాడు పులిగాడు.

"స రేపో—రేపు పొద్దున్నే రా" అన్నారు రాజావారు లేస్తూ.

ఇంటికి రాగానే పులిగాడు తన తుపాకీ తీశాడు. ఒక్కసారి దాన్ని తాకగానే అతనికి పాత విషయాలన్నీ జ్ఞాపకంవచ్చాయి.

"ఎన్ని పులుల్జచ్చాయోదీన్జేతిలో" అనుకున్నాడు పులిగాడు. బారెల్ అంతా శుభ్రంగా సన్న చువ్వకు గుడ్డచుట్టి తుడిచాడు—గుర్రమూ, తూటా మాటు పెట్టే చోటూ బాగా చూచుకున్నాడు.

రెండు మూడు సార్లు గు(రం లాగి చూచాడు. ఫోర్ సైటుమీద మట్టి తుడిచి దూరాన చెట్లకేసి గురిపెట్టాడు—

"రేపటితో ఆఖరు—నాయాల్డిది—" అను కున్నాడు తూటాలు పెట్టేచోటు తుడుస్తూ.

"లచ్చిమీ—రేపు మాపటికి వేట కెల్తుండా—" అన్నాడు పెద్దగా. జవాబు రాలేదు. సామాన్యంగా ఆమాట చెప్పగానే లచ్చిమి తన పాతకోటు, తల పాగా, వేటకు కావల్సిన సరంజామా అంతా తయారు చేస్తుంది. జవాబు రాకపోవటంలో ఏదో వుందను కున్నాడు—లచ్చిమి గోడకానుకుని కూర్చుని వుంది.

"ఏందే కత? పొద్దునేదో కళ్ళెర్రగున్నాయి— ఇప్పుడేవో మూల కూకున్నావు—ఏందే సంగతి?" అని అడిగాడు.

లచ్చిమి మాట్లాడలేదు. దానికి ఒకటే బాధ. తను చేసినది తప్పు. ఇది తెలిసిందంటే పులిగాడు తుపాకి తనమీద గురిపెట్టితీరుతాడు.

"ఏంలేదే—తల్నొప్పి" అంది లచ్చిమి బయ టికి పోతూ—

"సి(తంగా వుండదే—ఏందో!" అనుకున్నాడు పులిగాడు.

రా(తి పదిగంటలప్పటికి పులిగాడు గురక మొదలుపెట్టాడు. లచ్చిమి కాసేపు చూచి ఎప్పటి లాగా బావివేపు పోయింది. అక్కడ యువరాజావారు కాచుకుని వున్నారు. అతనికి ఏం చేయను తోచ లేదు. లచ్చిమికి చెప్పసాగా డతను—

"చూడు—నేను రేపు వేటకు పోయివస్తాను— తర్వాత మ(దాసు పోతున్నాను—చూడు మంచి ...దు తీసుకొస్తాను. నీకేం (పమాదంరాదు— చు డు—" అతనికి భయంగానేవుంది లచ్చిమి ఏమంటుందో అని—

"వద్దు—వద్దు—నాకు భయంగా వుండది—" అంది లచ్చిమి ఏడుస్తూ.

"అలా అంటే ఏం చేసేది—ఇదొక్కటే ఉపాయం నీకేమీలేదు—చాలా సులభం—" అన్నారు యువ రాజావారు. లచ్చిమికి అర్థమయింది. యువరాజా వారికి కావల్సింది సుఖం అనీ, బాధ్యత లేదనీ.

"మరి నాగతేంకాను—" అంది లచ్చిమి.

ని(దలో పొర్లిన పులిగాడికి క(ర తగిలి మెలు కువ వచ్చింది—లేచి కూర్చున్నాడు. (పక్కన లచ్చిమి పడక ఖాళీగావుంది. అనుమానం వేసింది. క(ర చేతబుచ్చుకుని జా(గత్తగా విన్నాడు—బావి దగ్గర్నుంచి మాటలు గాల్లో కలిసి వచ్చాయి. చప్పుడు చేయకుండా ఆవేపు నడిచాడు—అప్పటికే యువ రాజావారు లచ్చిమిని వదిలేసి వెళ్ళిపోయాడు. దూరాన నీడల్లో ఆకులు కాళ్ళకిందపడి చిటపట మన్నవి. చీకట్లోంచి ఒక్కసారిగా ముందుకొచ్చి చూచాడు పులిగాడు—బావిగట్టుమీద ఏడుస్తూ కూర్చున్న లచ్చిమి కన్పించింది.

"లచ్చిమి — ఏందే?" అన్నాడు దగ్గరిగాపోయి. లచ్చిమి అదిరిపోయి నిల్చుంది. పులిగాడివంక బెదరి పోతూ చూచింది. ఏమో సంగతి వుందని పసిగట్టాడు. చెయ్యి పట్టుకుని గుడిసె దగ్గరకు లాక్కుపోయాడు. దీపం పెద్దది చేశాడు.

"ఏందే సంగతి సెప్తావా—సెప్పవా?" అన్నాడు కుదుపుతూ కూతుర్ని. లచ్చిమి ఏడవటం మొద

# కొల్గేట్ వాడి నోటినించి దుర్వాసన రాకుండా చేసుకోండి
# రోజంతా దంతక్షయం రాకుండాకూడా కాపాడుకోండి!




ఎందుకంటె : ఒక్క సారి తోముకొంటేనే
**కొల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసన మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85 % వరకు తొలగించును**

కొల్గేట్ 10 మందిలో 7 గురికి నోటి దుర్గంధమును వెంటనే ఆపుతుందని మరియు భోజనము అవగానే కొల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొనుట ద్వారా ఎక్కువ మందికి ఎక్కువ దంతక్షయము అరికట్టిందని దంత శాస్త్ర చరిత్రలో పూర్వమ్ము ఎన్నడూ తెలియచేయనంతటి శాస్త్ర పరిశోధనల ఫలితముగా నిరూపించబడినది !

ఊరికే నోటిలో నీళ్లు పోసుకొని పుక్కిలించుట కాదు. భోజనము అయిన వెంటనే క్రమంతప్పకుండా కొల్గేట్‌తో పళ్లు తోముకోండి. దాని చేనతనమైన నురుగు పళ్ల మధ్య కనపడకుండా ఉండే సందులలోనికి వెళ్లి నోటి దుర్వాసనకు మరియు దంతక్షయమునకు కారణమైన కుళ్లి పోతున్న ఆహారపు తునకలను తీసువేస్తుంది !

పిల్లలు కొల్గేట్‌తో పళ్లు తోముకొనుటకు యిష్టపడతారు. ఎందుకంటె చాల సేపు ఉండే దాని పిప్పర్‌మెంట్ వంటి రుచి అంటే వారికి ప్రీతి !




మీకు పొడరు కావాలంటే,
ఈ లాభములన్నిటిని మీరు
కొల్గేట్ టూత్ పొడరు ద్వారా
పొందగలరు... ఒక డబ్బా
నెలలు వస్తుంది

కొల్గేట్‌తో క్రమం తప్పకుండా పళ్లు తోముకొంటే

- ✔ నోటి దుర్వాసనను పోగొట్టును
- ✔ దంతక్షయమును నిరోధించును
- ✔ పళ్లను మెరుస్తూ ఉండేలా ఉంచును




నోరు ఎక్కువ శుభ్రముగా, తాజాగా ఉండుటకు మరియు పళ్లు ఎక్కువ తెల్లగా ఉండుటకు ప్రపంచములో ఏ యితర పళ్లు తోముకొనే క్రీమ్ కన్న కొల్గేట్ నే ఎక్కువ మంది వాడుతున్నారు.

DCG.3197 TEL.

కొట్టింది. కర్రెత్తాడు పులిగాడు. వాడికి అనుమానం తోచింది.

"ఏం జరిగిందే! చెప్పు—లేకపోతే మాడు పగు లుద్ది—"

లచ్చిమి ఏడుపు ఎక్కువ చేసింది. పులిగాడు చూశాడు. తను ఒక్కసారిగూడ లచ్చిమిమీద చెయ్యి చేసుకోలేదు. ఇది ఇలా కాదు—నెమ్మదిగా అడగాలి—మంచిగా తెలుసుకోవాలి—

అరగంటసేపు బూరడించి, పొగడిసిన తర్వాత పులిగాడికి చెప్పింది లచ్చిమి—పెండ్లికాకుండానే తల్లి కాబోతున్నానని—తనను మోసం చేసినవాడు యువ రాజాగారని—లచ్చిమి చెంప ఫెడీల్మంది. వెనక్కు పడిపోయింది లచ్చిమి—

ఇదన్నమాట యువరాజావారు తను నమ్మకంగా పనిచేసినందు కిచ్చిన బహుమతి—ప్రాణం పోయినా పోనీ, మానంతో చెలగాటాలాడ్తాడా—

*   *   *   *

ప్రొద్దున్నే లేచి దివాణానికెళ్ళాడు పులిగాడు. మేకా, తప్పెట్లూ, మాటువేయటానికి సామాన్లు అన్నీ తయారుగా వున్నాయి. మధ్యాహ్నం మూడు గంటలకి పులిగాడూ, వెంకట్రాయలూ, యువరాజా వారూ జీపులో బయలుదేరారు. నాలుగున్నరకంతా పాలెం చెరువుగట్టు చేరారు. అక్కడ వాళ్ళకోసం యానాది సుబ్బడు కాచుకొని వున్నాడు.

"మద్దన వాగుండాది దొరా—నీళ్ళు కొన్తది రాత్రి—నిన్న దూడకాలుగూడ దొరికిండాడ — రాత్రికి కచ్చితంగా వస్తది. పగలంతా అడివిలో తిరగద్ది—" అన్నాడు వాడు. వాగుకు ఎగువగా కొంచెం చెట్టూ చేమా వున్నచోట మేకను కట్టేశారు— పది ఇర వయి గజాల దూరంలో చెట్టుమీద తయారుచేశారు కూర్చునేదానికి చోటు. యువరాజాగారికి ఒక చేతిన తుపాకీ, రెండో చేతిన ఫ్లాస్కులో ఓవల్టీనూ — చప్పుడు వినగానే వచ్చి కనుక్కోమని చెప్పి పంపిం చేశాడు—పులిగాడు సుబ్బడ్ని మరో చెట్టుమీదకు—

రాత్రి పదిదాకా ఎక్కడా అలికిడిలేదు. మేక మాత్రం కాబొయ్యేదేదో తెలిసినట్లు గుంజుకుంటూ, అరుస్తూ తిరుగ సాగింది. పక్కనే వాగునీళ్ళు గలగల పారుతున్నాయి.

ఈ వాళ్ళతో అఖరు దానికి" అన్నాడు వెంక ట్రాయలు.

"ఏవి!" అన్నారు యువరాజాగారు.

"అవును. అఖరు ఇవాళ్ళతో" అన్నాడు పులిగాడు.

ఇంతలో మేక అరుపులు మానేసింది. వాగు వేపు చూచింది. ఒక్కసారిగా గుంజుకోడం మొద లెట్టింది. పులిగాడు తుపాకి సరిజేసుకున్నాడు. వాగువేపు జాగ్రత్తగా చూచాడు. ఎక్కడా చలనం లేదు. నీడల్లో ఏమి దాక్కునివున్నాయో తెలియటం లేదు. మేక మరీ అల్లకల్లోలం చేస్తూవుంది.

"పులిరాదేం?" అన్నారు యువరాజావారు. పులిగాడు మాట్లాడవద్దని సైగచేశాడు. వాగు

# పులి వేట

వేపు చూసి. వాగుకు అవతల చెట్టు నీడలోంచి ఏదో కదలి రావటం వెన్నెల్లో స్పష్టంగా కన్పిస్తూవుంది అడుగులో అడుగేసుకుంటూ అటూ ఇటూ వాసన జూస్తూ నిల్చుకుంటూ నడుస్తూ కదలసాగింది.

"ఫర్వాలేదు—గాలి మనవేపే వీస్తూంది—" అనుకున్నాడు వెంకట్రాయలు మనస్సులో. లేకపోతే పులి పసిగట్టేస్తుంది సులభంగా. పులివాళ్ళకి మరో యాభై గజాల్లో వుందనగానే వెంకట్రాయలూ, పులిగాడూ తుపాకీలు తయారుగా వుంచుకున్నారు. ముందు పులిగాడు కొట్టేటట్టూ, వెంటనే యువ

"ఎక్కడికైనా విందుకు వెళ్ళి నప్పుడు నేను శాస్త్ర మొహం తప్పి స్తేసరి, ఈయన అడ్డమైన గడ్డీ తింటారు. ఇహ చూడండి! ఆ రాత్రంతా నిద్రలో ఈలలు వేస్తారు." అని మొరపెట్టు కున్నది ఒక ఇల్లాలు డాక్టరుతో, తనభర్త నుద్దేశించి.

ఇంతకూ ఈలలు వేసేది ఆయనేనని మీరు గట్టిగా చెప్ప గలరా' అడిగాడు డాక్టరు ఆమె మాటలకు అడ్డువస్తూ.

'భలేవాడివే! ఈవేళ ఉద యం ఆయన నిద్రలేచే నరికి అయన పక్కమీద పది కుక్క పిల్లలు ఉన్నాయి నరా!!" అంటూ ఆమె మండిపడింది.

డి. చక్రపాణి (ఆదోని)

రాజుగారు, వెంకట్రాయలూ కొట్టేటట్టూ ముందు గానే నిర్ణయం అయిపోయింది.

"పులి — పులి" అన్నారు యువరాజావారు ఉత్సాహంగా—

"ష్......మాటాడకూడదు—" అన్నాడు వెంక ట్రాయలు. పులి అప్పటికి ఇంకా దగ్గరికొచ్చింది. యువరాజావారు తుపాకీ ఎత్తారు.

పులి కనపడంగానే కాసేపు నిలబడిపోయింది మేక. ఆతర్వాత విపరీతం అరుస్తూ పారిపోవటానికి గుంజుకోసాగింది. పులిగాడు తుపాకీ గురిపెట్టుకుని సేఫ్టీ వెనక్కి తీసాడు. గుర్రంమీద చేయి వేశాడు. పులిదగ్గరకు రాసాగింది—ఇరవయి అయిదు గజాలు—పదిహేను గజాలు — చెట్టునీడల్లో అది సరిగ్గా కనపడ్డంలేదు. కాని దానికండ్లు చింతనిప్పుల్లాగా చీకట్లో మెరిశాయి.

ఉన్నట్టుండి పులి లంఘించింది మేకమీదికి. గాండ్రింపుల్లో మేక దీనారవాలు కలిసిపోయాయి.

మరుక్షణంలో పులిగాడు తుపాకీ ఫోర్ సైట్ లోంచి గురిచూచి గుర్రం నొక్కాడు. చీకటిని చీల్చుకుంటూ వెలుతురు పగిలింది—దిమ్మదిరిగి పడ్డది పెద్దపులి. వెంకట్రాయలూ, యువరాజావారూ చేతీ ఒకసారి కాల్చారు—పులి పడిపోయింది.

యువరాజావారు కాల్చిన మరుక్షణంలోనే మరో మోత మోగింది. దాంతో కలిసి యువరాజాగారి అరుపు కలిసిపోయింది.

పులి అరుపులు నిలిచిపోయిన తర్వాత, సుబ్బడూ మిగతావాళ్ళూ చెట్లుదిగి వచ్చారు. చూచారు.

యువరాజాగారి ముఖం అంతా నెత్తురుమయం.—

"ఏమయింది!" అన్నాడు వెంకట్రాయలు—

"నాకు తెల్దు—" అన్నాడు వణికిపోతూ పులి గాడు.

యువరాజాగారి తుపాకి వెనక్కికొట్టుండాలని తేల్చాడు పులిగాడు చీకట్లో చూచి. అందరూ కలిసి జీపులో యువరాజాగార్ని చేర్చారు. కారే నెత్తుటితో సీటు నిండిపోయింది. వెంకట్రాయలు శరవేగంగా పోనిచ్చాడు జీపును. పులికి కాపలాగా సుబ్బల్నుంచారు. వెనకసీట్లో భయంకరంగా పగిలిపోయిన ముఖం పులిగాడిచేతుల్లో అటూ ఇటూ కొట్టుకో సాగింది. వాడి చేతులు నెత్తుటితో నిండిపోయాయి.

దివాణంలో చిచ్చులాగా వ్యాపించింది వార్త. పెద్దరాణీగారు ఏడుస్తూ వచ్చారు. పెద్ద రాజావారు నిల్చోలేకుండా వున్నారు. నాటువైద్యులకీ, డాక్టర్లకీ కబురు పంపారు.

పందడిలో పులిగాడు బయటకి నడిచాడు. వాడి కళ్ళముందు వెన్నెల్లో లక్ష్మీ, యువరాజా కన్పిం చారు. నెత్తురోడుతూ మృత్యుతాండవం చేస్తున్న యువరాజాగారి ముఖం, పెద్దరాణిగారి ఏడుపూ వాడి కండ్లలో నిలిచాయి. గుడిసె చేరాడు పులిగాడు. కుక్కిమంచంలో వెల్లకిలా పడుకునివుంది లక్ష్మి.

"ఎంతపని చేసినాను! ఎదవ నాయాల్దిది! దీని వల్ల! ఛీ" అనుకున్నాడు.

తల తిరిగిపోయింది వాడికి. తుపాకీ తీసాడు. ఒక్క తూటా వుంచా దందులో—వెన్నెల్లో బారెల్ తళుక్కుమంది. నక్షత్రాల్లోకి చూచాడు వాడు. కంటినీరు ధారగా ప్రవహించింది.

"తండ్రీ! దిక్కుమాలినోడ్ని! చమించు" అన్నాడు వాడు చీకట్లోకి చూస్తూ.

తోట మారుమోగింది. నిద్రించే పక్షులు ఉలిక్కిపడ్డాయి. రాజాగారి తుపాకి ఆఖరిసారిగా మానవజీవాన్ని రుచిచూసింది. బారెల్లోంచి పొగ గాల్లోకిలేచి వెన్నెల్లో కరిగిపోయింది.

అచేతనంగాపడివున్న లక్ష్మికి ఇవేమీ తెలియవు. పాషాణం విషమని మాత్రం తెలుసు అభాగ్యురాలికి—



# సినీ విహారం

13–వ పేజీ తరువాయి

అగ్రహావేశాల్లోకి పరుగెడుతున్న తండ్రినీ, కూతుర్నీ ఆగమన్నాడు కాస్సేపు డైరెక్టర్....మరో కోణంలోంచి వాళ్ల కోపాన్ని చిత్రీకరించాలని కాబోలు.

ఈ సన్నివేశంలో పద్మగా దేవిక, తండ్రి సుందరరావుగా జూనియర్ ఏ. వి. సుబ్బారావు చక్కగా నటించారు. సెట్‌పై భీముడు పాత్రలో బాలకృష్ణ, ఆతని జతగా బాల కూర్చుని ఉన్నారు. ఈ చిత్రంలో ఆనంద్‌గా కాంతారావు, ప్రతాప్‌గా రాజనాల నటిస్తున్నారు గనుక పద్మయొక్క ప్రేమ, పెళ్ళి, ఆశయాలు ఎన్నో రీళ్ళు చూసిన తరువాతగాని సఫలమవుతాయో, కావో తేల్చుకోలేము. ఈ చిత్రానికి దర్శకుడు ఆమంచర్ల శేషగిరిరావు. మాపాలు (అంటే మాటలూ పాటలూ) ఆరుద్ర పాలు, సాపాలు (అంటే సంగీతం) కె. వి. మహదేవన్ స్వంతం. కామెరా నాగిర్దార్. కళ గోడ్‌గాంకర్. ఈ చిత్ర గాథలో కన్నాంబ రాజశ్రీలు కూడా ప్రధానపాత్రలు నిర్వహిస్తున్నారు.

## మెరుపు సేనతో దండయాత్ర

ఆ సెట్ మీదకు అడుగు పెట్టగానే ఏదో తెలుగుతనం కనబడుతోంది. మనం విజయనగర సామ్రాజ్య వైభవం గురించి చరిత్రలో చదివినవీ, వినినవీ అక్కడ కనిపిస్తున్నాయి. ఆ సెట్‌పై నిర్మింపబడిన తిమ్మరసు గృహంలోని ప్రతి అంగుళం తెలుగు కళతో కళకళలాడుతోంది. అంతేకాదు. మహామంత్రి, సైన్యాధిపతి ధరించిన దుస్తులలో ఆనాటి తెలుగుతనం స్పష్టంగా ఉట్టిపడుతూంది. ఈ చరిత్రకు న్యాయం చేకూరుస్తున్న చిత్రకళా దర్శకుడు మాధవపెద్ది గోఖలేను అభినందిస్తూ సెట్ మీదకు అడుగు పెట్టాము. అది గౌతమీ పిక్చర్స్ తయారుచేస్తున్న "మహామంత్రి తిమ్మరుసు" కు చెందిన సెట్ అని ఈసరికి మీకే అర్థమై ఉంటుంది.

ఆ చిత్ర నిర్మాతల్లో ఒకరైన పుండరీకాక్షయ్యను పలకరించి, దర్శకుడు కామేశ్వరరావు, కామెరామన్ అన్నయ్య, శబ్దగ్రాహకుడు హరి ఈ ముగ్గురితో కలిసి కామెరా ముందు వెలుగులో, మహామంత్రి తిమ్మరసు, రంగనాయకులు, కెంపరాజు, కందోళీ పాత్రలలో పరకాయ ప్రవేశం చేసిన గుమ్మడి, మిక్కిలినేని, అప్పారావు, రాజశ్రీల చేష్టలు, మాటలు పరిశీలిస్తూ కూర్చున్నాను.

శ్రీ కృష్ణదేవరాయలవారు మెరుపు సేనతో గజపతిపై దండయాత్రకు బయలుదేరి వెళ్లారు. రాయలవారిని కలుసుకోవడంలో ఆలస్యం జరిగితే ఏం ప్రమాదం జరుగుతుందో అని మహామంత్రి తిమ్మరుసు సత్వర కర్తవ్యాన్ని నిర్ణయిస్తున్నాడు. మహా సేనాధిపతిని రప్పించి ఆయనతో "రామలింగ నాయకా ! మీరు వెంటనే అశ్వికదళంతో బయలుదేరి వారికంటె ముందుగా విజయవాడ చేరుకోవాలి" అని ఆజ్ఞాపించగానే సైన్యాధిపతి శిరస్సును వంచాడు. ఈలోగా వారికి "కొండపల్లి మనదేరా, కొండవీడు మనదేరా, కాదని ఎవ్వడు



ప్రాచీన ఆధునిక నృత్యపద్ధతులలో, సర్వజన ప్రశంసనీయంగా ఇటీవల వాణీ మహాల్లో నృత్య ప్రదర్శనం ఇచ్చిన కుమారి జి. శ్రీమణి బి. ఎ.

వాదుకువస్తే కటకంవరకూమనదేరా!" అంటూ పాట పాడుతూ కందోళి ప్రవేశించింది. ఆమె ఆ కాలంలో సి. ఐ. డీ. దళానికి చెందిన యువతి.

"దేవరా ! మరి నేను." అంటూ మహామంత్రిని ప్రశ్నించింది కందోళి.

"కొండపల్లిలో నీకు బంధువు లున్నా రన్నావు కదూ !" అని ప్రశ్నించాడు మహామంత్రి.

"నా బంధువులు కొండపల్లి కోటలోనే ఉన్నారు దేవరా !" అని జవాబిచ్చిందా "మాతాహారి!" మహదానందంతో.

"ఐతే నీవు చేయవలసిన పని చాలా ఉంది. చెప్తాను రా" అంటూ తిమ్మరుసు ఆమెను మరొక మందిరంలోనికి తీసుకువెళ్లాడు.

ఈ సన్నివేశంలో మహామంత్రిగా గుమ్మడి, రంగనాయకులుగా మిక్కిలినేని, కెంపరాజుగా కొత్త నటుడు అప్పారావు, కందోళిగా రాజశ్రీ నటించారు. ఈ చిత్రానికి నిర్మాతలు రామబ్రహ్మం, పుండరీకాక్షయ్య. కవి : పింగళి నాగేంద్రరావు. ★

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్‌తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4'×2', 4'×4' చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి.

# యువ ప్రపంచం

## విద్యార్థుల సమ్మె: తల్లిదండ్రుల బాధ్యత

కౌండిన్యగారు తిరుపతి విశ్వవిద్యాలయ విద్యార్థుల సమ్మెమీద వ్రాసిన వ్యాసము చదివి ఈ లేఖ వ్రాస్తున్నాను. ఐదు సంవత్సరముల క్రితం నేనూ విద్యార్థినే. ఇప్పటికి చదువుకొనవలననే వాంఛపోలేదు. గతిలేక ఉద్యోగం చేస్తున్నాను.

స్వాతంత్ర్యం వచ్చిన ఈ 15 ఏళ్ళలో మన దేశంలో క్రమశిక్షణ దెబ్బతినడానికి కారణాలు చాల ఉన్నాయి. విద్యావేత్తలు ఈ విషయమై చాలా పరిశోధన జరిపారు. కాలానికి అనుగుణంగా డొంక తిరుగుడు వ్యాసాలతో సరైన కారణాలు తప్పించి మిగతావన్నీ వూహించారు. నిజానికి ఆత్మ పరిశోధన చేసుకుంటే ఏ తండ్రి తన కొడుకును (విద్యార్థి దశలో) తన అదుపుఆజ్ఞలో వుంచుకోలేడు? ఉంచుకోలేని శక్తి లేకపోతే ఆ తండ్రికి సంఘంలోవున్న గౌరవం ఏమిటి? తన పిల్లలను సరిగాపెంచి బాధ్యత కలిగిన వ్యక్తులుగా సంఘానికి అందజెయ్యాలంటె వారిని మందలించవలసిన బాధ్యత ప్రతి తండ్రికి ఉన్నదా? లేదా?

ఉత్తరహిందుస్థానములోని విద్యార్థులు తమకు ఎవరెవరు పాఠాలు చెప్పాలి, అనే సమస్యమీద సమ్మె చేస్తారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తమకు ఏ ఏ మాదిరి పరీక్షలు జరపాలి, ఏ ఏ సబ్జక్టులు ఉండాలి, ఏ భాషలో బోధించాలి, అనే సమస్యలమీద సమ్మె చేస్తున్నారు. బహుశా ఇంకొక సంవత్సరంలో మిగతాచోట్ల తమకు పరీక్షలే జరుపకూడదని,పరిక్షలు జరిపినా తప్పించకూడదని ఏ విశ్వ విద్యాలయంలో నైనా సమ్మె జరిగిందంటే నాకు మాత్రము ఆశ్చర్యముకాదు. ఈ గతికి ఏడవాలో నవ్వాలో తెలియడములేదు!

విశ్వవిద్యాలయాలకు 'స్వయం నిర్ణయాధికారం ఉండాలని చెప్పే ప్రతి పెద్ద మనిషి విద్యార్థులు సమ్మె చేయగానే అధికారులకు నీతులు చెప్పడానికి బయలుదేరుతారు. కౌండిన్యగారికి నామీద కోపం రావచ్చుకాని సంఘానికి ఏమైనా సహాయం చెయ్యదలచుకుంటే, తప్పయినా ఒప్పయినా విశ్వ విద్యాలయ అధికారులు తరఫున మాట్లాడి, ఆ సంస్థయొక్క గౌరవమున నిలబెట్టి విద్యార్థులకు బుద్ధి వచ్చేటట్లు చెయ్యవలసిన బాధ్యత అందరిదీను.

'విద్యార్థి' అనే మాటకి సరిఅయిన అర్థం తెలిసికొనవలెనంటే అధ్యాపకులను గౌరవించాలి. అది తెలిసికోనప్పుడు మనదేశం ఈ పెద్ద మనుష్యుల చేతుల్లో అదోగతి పాలవుతుంది. నాది ఒకటే కోరిక. ప్రభుత్వం శాసనరీత్యా విశ్వవిద్యాలయాలకు సంబంధించిన ఏ విషయంమీద పత్రికలలో కూడా చర్చలు నిషేధించాలి. రాజకీయవేత్తలు దూరంగా ఉండాలి. విశ్వవిద్యాలయాలు ఈ (వి) నాయకులకు ఎల్. ఎల్. డి. మొదలైన గౌరవ పట్టాలు ఇవ్వకుండ వీలైనంత దూరంగా ఉంచాలని నా విజ్ఞప్తి.

మనదేశం బాగుపడాలంటే అసలు విద్యార్థులు ఒకసారి తప్పితే మరల పరీక్షకు కూర్చోనివ్వరాదు. 35 మార్కులు తెచ్చుకోలేనటువంటి విద్యార్థిని సెప్టెంబరులోను లేక మరల వచ్చే మార్చిలోను పాస్ చేయించడమువల్ల విద్యా ప్రమాణం ఎప్పటికైనా తగ్గిపోతుందికాని పెరగదు. ఈ లేఖ చదివిన ప్రతి విద్యార్థికి సిగ్గు రావాలని ప్రతితండ్రి ప్రతి నాయకుడు తన బాధ్యత తెలుసుకోవాలని నా వాంఛ.

కాంచజన్యం [illegible] (మద్రాసు)

* * *

## విద్యార్థుల విజ్ఞాపన

శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ విద్యార్థులు కొన్ని సౌకర్యముల కొరకు సమ్మె కొనసాగిస్తున్న విషయము ప్రజలందరకూ విదితమే.

విద్యార్థులు ఆరు గంటలసేపు (అనగా రోజుకు రెండు పరీక్షలు) పరీక్షలు వ్రాయుడము కష్టమైన పనికాదు, అని ఒక చిన్న మాటలో విద్యార్థులు చేస్తున్న ఆందోళనను కొట్టిపారేసిన వైస్ చాన్సలరు విచిత్ర ధోరణిని అర్థము చేసుకొనడము చాలా కష్టమైన పని.

ఒక్కటికాదు, రెండుకాదు, మూడుసంవత్సరాల కాలము వందలకొలది డబ్బు ఖర్చుపెట్టి, రాత్రింబగళ్ళు చదివినదంతా రోజుకు ఆరు గంటల చొప్పున వెళ్ళగక్కమంటే విద్యార్థుల హృదయాలెంత గాయపడతాయో గొర్రెల నరికే కసాయివానికి కూడా అర్థమవుతుం దనుకుంటాము. ఇలాగే ఇదొక్కటే కాదు, విద్యార్థులు కోరిన ప్రతి కోరికా న్యాయసమ్మతమైనదని పెద్దలంతా ఒప్పుకున్నారు.

పుత్రుల సమస్య తండ్రులది. విద్యార్థులకెంత బాధ్యతుంటే వారికి అంతే ఉంది. వందలకొలది రూపాయలు ఖర్చుపెట్టి వారు తమ పిల్లలను కళాశాలలకు పంపించి చదువు చెప్పిస్తున్నారు. ఈ సమ్మెపట్ల అటువంటి తల్లిదండ్రుల సానుభూతికి నోచుకోలేని విద్యార్థులు దురదృష్టవంతులే. కావున వారు ఇప్పటికైన విశ్వ విద్యాలయం అధికారుల కఠిన హృదయాన్ని కదిలించే మార్గాన్ని వెతుకుతారని ఆశిస్తున్నాము.

ఎన్నో విధాలుగా సహాయము చేస్తామని తీపి మాటలతో హామీ యిచ్చిన శాసన సభ్యుల కార్యసాధన ఏమాత్రమూ కనిపించలేదు. ఇప్పటికైన వారు వారి మాటను నిలబెట్టుకుంటారని ఆశిస్తున్నాము.

విద్యార్థుల సహనాన్ని ఇంకా ఇలాగే వాయిదాల పద్ధతిని ఎన్నాళ్ళు పరీక్షిస్తారో అర్థం కాకుండా ఉంది. ఇప్పటికిది మూడవ వాయిదా. కనీసము ఈ చర్చలో కూడ ఏమి తీర్మానించినదీ తెలీకపోగా, అసలు అక్కడ మా విషయము చర్చించినారో లేదో కూడ తెలీకుండా ఉంది. ప్రజాస్వామ్యము, ప్రజాస్వామ్యము అంటున్న ఈ దేశములో ఈవిరంకుశత్వమేమో అర్థం కాకుండావుంది.

గాంధీ మహాత్ముని ఆదర్శమైన శాంతియుత పోరాటాన్ని అనుసరిస్తున్న విద్యార్థులలో అణగియున్న అగ్నిజ్వాలల హాహాకారాన్ని చవి చూడదల్చుకుంటే ఆట్టే కాలము పట్టదు.

ఈ న్యాయసమ్మతమైన, శాంతియుతమైన పోరాటాన్ని చూచి పైనున్న ఏడుకొండల వెంకటేశ్వరుడైనా కరుణిస్తాడేమో కాని, అధికారులుమాత్రం గుర్తించేట్టులేరు. పిలిస్తే పలికే అప్రత్యక్ష దైవమైనా అధికార్ల కఠినహృదయాల్ని కరగించాలని మా ప్రార్థన.

విద్యార్థుల న్యాయసమ్మతమైన ఈకనీసపు కోర్కెలు, ఈ సమ్మెవలన పోగొట్టుకొన్న అటెండెన్సు,సాధించేవరకూ తమ పట్టు వదలరనీ, తలిదండ్రులకు, పురప్రజలకు, ప్రభుత్వమునకు, విశ్వ విద్యాలయానికీ, "విద్యార్థులకు కాదు విశ్వ విద్యాలయము, విద్యార్థులు విశ్వ విద్యాలయము కొరకు" అని నమ్మిన అధికారులకూ ఇదేవిజ్ఞప్తి.

విద్యార్థిబృందము,
వెంకటేశ్వర విశ్వవిద్యాలయము,
అనంతపురము. ★

కవరుపైన 'యువప్రపంచం' శీర్షికకు అని స్పష్టంగా వ్రాయాలి.

## పొట్టికథలు

"నొప్పిఏమాత్రం లేకుండా దంతవైద్యం చేయడం నా ప్రత్యేకత. మీకూ ఒక్కసారి మత్తు మందు వాసన చూపుతాను. అంతే మరుక్షణంలో మీపన్ను నాచేతిలో ఉంటుంది." అన్నాడొక దంత వైద్యుడు తన వద్దకు వచ్చిన పెద్దమనిషితో.

పెద్ద: అంత తేలిగ్గా పన్ను పీకటానికి మీరు అదనంగా ఏమన్నా వసూలు చేస్తారా?

వైద్యుడు: ఒక్క రూపాయి ఎక్కువగా పుచ్చుకుంటాను.

పెద్ద: అబ్బే! అనవసరం. నొప్పి పుడుతూనే పుట్టింది. మామూలు వైద్యమే చెయ్యండి.

వైద్యుడు: మహాదొడ్డ సాహసం కలవాడవయ్యా!

పెద్ద: ఒక్కనిమిషం ఆగండి! పంటినొప్పితో బాధపడుతున్నది నేను కాదు, మాఆవిడ.

ఎం. విశ్వనాథం (బెంగుళూరు)

* * *

"డబ్బుకోసం దిగులుపెట్టుకునే మీరు మీ ఆరోగ్యం పాడు చేసుకున్నారు. అలాంటి దిగుళ్లేమీ పెట్టుకోకుండా నిశ్చింతగా ఉంటే కోలుకుంటారు." అని సలహా చెప్పాడు ఒక వైద్యుడు తన వద్దకు వచ్చిన రోగికి.

"చూడండి! రెండు వారాల క్రితం మీ లాంటి పెద్దమనిషే నా దగ్గరకు వచ్చాడు. అతడు ఇంటిఅద్దె ఇవ్వలేదట. దిగులుపడి పోయాడు. ఆ విషయం మర్చిపోవయ్యా అని నేను నచ్చచెబితే ఇప్పుడు హాయిగా ఉన్నాడు." వివరించాడు వైద్యుడు.

రోగి: మీరే ఆ సలహా చెప్పారని నాకు తెలుసు. ఆ ఇంటి యజమానిని నేనే.

ఎస్. శాస్త్రి (మద్రాసు)










**Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street, Madras-1, Chief Editor: S. Sambhu Prasad.**

